# బైద్యనాథ్ ............

## ఇద్దరికీ ఆరోగ్యము మరియు పెరుగుదల కొరకై

జీవితమంతా

మీరు భాగస్వాములు కనుక

మీరు శ్రద్ధవహిస్తారు కనుక

మీరు ఒకరికి మరియొకరు
ఆనందముగా ఉండుటకు
శ్రద్ధ తీసుకుంటారు.

మీకు శక్తిని, బలమును కలుగచేసి
రోజు రోజుకు సంవత్సరముల తరబడి
విటా-ఎక్స్ మిమ్ములను కాపాడును.

స్త్రీ పురుషులకు బలవర్థకమైన ఔషధము.



## బైద్యనాథ్ విటా-ఎక్స్

## మొటిమలా?

మొటిమలు, మచ్చలు, ఉడుకు పొక్కులు మరియు
చర్మరోగములకు ఆదర్శమైన నివారిణి
మంచి రక్త శుద్ధికరము, చర్మమును పరిశుద్ధముగా
ఉంచును,






## బైద్యనాథ్ సురక్తాస్ట్రాంగ్

రక్తమును శుద్ధి చేయును. చర్మమును నిర్మలముగా ఉంచును.




మామూలు పండ్లపొడి కాదు ఔషధము కూడా దంతక్షయము మరియు చిగుళ్ళ
వ్యాధులకు అత్యవసరమైన నివారిణి ఆరోగ్యకరమైన దంతములు బలమైన
చిగుళ్ళు ఆరోగ్యముగా చింతలు లేకుండా ఉంచును.

బైద్యనాథ్ ఎర్ర పండ్లపొడి మాత్రమే ఈ పనిచేయును

## బైద్యనాథ్ ఆయుర్వేద పండ్లపొడి

B3P 97T

## న్యూఢిల్లీ లేఖ

నృత్యతార అనూరాధ (12-18) ముఖ చిత్రంతో వెలువడిన వారపత్రికలో శ్రీ జమ్ముదుబాషి గారి పాలితులకి దూరమవుతున్న పాలకులు! (న్యూఢిల్లీ లేఖ) బాగుంది. "సామాన్య ప్రజా జీవతంతో సంబంధం లేని తాఉవని ప్రభుత్వ యంత్రాంగం' గురించి చక్కగా వివరించారు

– సింగం దత్తాత్రేయమూర్తి, ఒంగోలు

## సీరియల్స్

అనూరాధ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రారంభమైన శ్రీ సి విమలాగణేష్ గారి "పావని' సీరియల్ బాగుంది ఇది కూడా పత్రికకు ఓ మంచి సీరియల్ కాగలదని అనిపిస్తుంది "నిశ్శబ్ద సంగీతం" సీరియల్ బిహరా వెంకట సుబ్బారావు గారు చాలా చక్కని శైలితో మృధుమధుర పదజాలంతో నడిపిస్తున్నారు వారికి మా కళాభివందనాలు!

– బాసంశెట్టి లక్ష్మికేశవ్, తాడేపల్లిగూడెం

★ ★ ★

నటి అనూరాధ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక ఎంతో ఆకర్షణీయంగా ఉంది పావని' సీరియల్ మొదటిలో నే మమ్ములను ఎంతో ఆకర్షించింది రచయిత్రి సి. విమలాగణేష్ గార్కి మా కృతజ్ఞతలు

– నాగండ్ల వెంకటేశ్వర్రావు, అమ్మాపాలెం

★ ★ ★

నటి అనూరాధ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక చాలా బాగున్నది

కొత్తగా ప్రారంభించిన సి విమలాగణేశ్‌గారి కొత్త సీరియల్ "పావని' ప్రారంభంలో నే మాకు. బాగా నచ్చినది

– చోడాబత్తుల సరోజ, కుప్పనపూడి

★ ★ ★

సి విమలాగణేశ్ గారి "పావని" సీరియల్ ప్రారంభ సంచికలో నే మమ్మల్ని బాగా ఆకర్షించింది

– డి లక్ష్మి, చిట్టివలస




మి (మా) "ఆంధ్ర సచిత్ర వారపత్రిక"లో సీరియల్ పావని' ప్రారంభంలో నే మమ్ములను ఆకట్టుకొన్నది రచయిత్రి విమలా గణేష్' గారికి నా ధన్యవాదాలు

– పి చంద్రశేఖర్, దూపాడు

## ముఖచిత్రం

19-25 సెప్టెంబర్ 1986 నటభూషణ శోభన్‌బాబు ముఖచిత్రం చాలా బాగుంది

– గరిగ నర్సయ్య, రామకృష్ణాపూర్

## కథలు

శోభన్‌బాబు ముఖచిత్రంతో వెలువడిన ముఖచిత్రం శోభాయమానంగా ఉంది ఎర్రసుక్కల సిలుకు సీర సోమిరెడ్డి జమునగారి కథ హృదయ విదారకంగా ఉండి మా హృదయాలను ఆకట్టుకుంది తాగుడు వల్ల ఎలాంటి పరిణామాలు జరుగుతాయో కళ్లకు కట్టినట్లుగా తమ కథలో వివరించారు రచయిత్రికి మా అభినందనలు

కథపడింది సి వి సర్వేశ్వరశర్మ గారి కథ సెక్స్ కథలు వ్రాసే వారికి కనువిప్పు కల్గించేలా ఉంది

– డి నర్సింగరావు, జి, విజయలక్ష్మి, పటానుచెరువు

★ ★ ★

శోబన్‌బాబు ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రుల అభిమాన పత్రికలో ఎం పేరయ్యశాస్త్రిగారి ఈ చావుకి కర్త లెవరు?' కథ మా మనస్సులను దోచింది సి వి సర్వేశ్వర శర్మగారి కథ పడింది' కథ కూడా బాగానే ఉంది

– రెడ్డి శివనాగేశ్వరరావు, మాచర్ల

(74 వ పేజీ చూడండి)


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు (1938-1972)

17-23 అక్టోబరు 1986

శ్రీ అక్షయ నామ సం ఆశ్వయుజ శు పూర్ణిమ

సంపుటము 79 : సంచిక 7

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2.75 |
| పోస్ట్‌లో 6నెలల చందా | రు 78 00 |
| పోస్ట్‌లో 12నెలల చందా | రు 156.00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి అంబిక

(ఫొటో సురేష్‌చంద్ర బచావత్)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :

# మానవశక్తే మన ప్రధాన సమస్య!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

గృహాలంకరణకి వాడే ప్రత్యేకమైన ఒక దాని కోసం నేనీ మధ్య గాంధి చౌక్‌కి వెళ్లాను. మేము ఉంటున్న ప్రాంతంలో అది దొరకదని చెప్పటం వల్ల నేను అక్కడికి వెళ్లాల్సి వచ్చింది. అప్పుడు మిట్ట మధ్యాహ్నం, ఎండ చాలా తీవ్రంగా ఉన్నది. పద్మవ్యూహం లాంటి ఆ సందులు గొందులు దాటి వెళ్లటానికి నాకు మూర్ఛ వచ్చినంత పనైంది. ఉత్తరాదిన అతి పెద్ద టోకు విక్రయ కేంద్రంగా చెప్పబడే అక్కడ జనం ఇసుక వేస్తే రాలనంతగా ఉండటం వల్ల ఊపిరాడదు. పురుషులు, స్త్రీలు, పిల్లలు – అన్ని వయసుల వారూ హడావుడిగా ఒక దుకాణం నుంచి మరో దానికి పరుగులు పెడుతూ ఇక్కడ కొన్నీ, అక్కడ కొన్నీ కొంటూ పెద్ద సంచులు మోసుకుంటూ ఆ మిట్ట మధ్యాహ్నపు ఎండలో తిరుగుతున్నారు. అంత జనసమ్మర్దాన్ని నేను చాలా అరుదుగా చూసి ఉంటాను. ఇటువంటిది భారతదేశం వెలుపల కూడా నేనెక్కడా చూడలేదు. భారతదేశాన్ని పోలి ఉండే స్పెయిన్, ఇటలీలలో కూడా ఇంతటి రద్దీని నేను ఎప్పుడూ చూడలేదు. చివరికి పారిస్‌లో కూడా మధ్యాహ్న భోజన విరామ సమయంలో తెరచి ఉండే దుకాణం కనిపించటం కష్టం. మనకి అవసరానికి మించిన మానవశక్తి ఉన్నదని నా అనుమానం. అది మన మంచికి కానంత, మనం భరించగల దానికన్నా ఎక్కువ ఉన్నట్లనిపిస్తున్నది.

మనది 75 కోట్ల మానవ శక్తి ఉన్నటువంటి దేశం. బ్రహ్మాండమైన ఈ శక్తే మన ప్రధాన సమస్య అనిపిస్తున్నది. అంత ఎక్కువ శక్తిని సవ్యంగా ఉపయోగించుకోవటం అలా ఉంచి అసలు దానిని అదుపులో పెట్టటం కూడా అంత తేలిక కాదు. దానితో వ్యవహరించటానికి రెండే మార్గాలు ఉన్నాయి. సోవియెట్ రష్యాలో లాగా దానిని పూర్తిగా అణచి వెయ్యటం. అలా చెయ్యటం వల్ల ప్రతి వ్యక్తి ప్రభుత్వం తనకి నిర్దేశించిన పనిని మాత్రమే చేస్తాడు. లేదా అమెరికా సంయుక్త రాష్ట్రాలలో లా కృతకమైన ఆటంకాల నుంచి పూర్తి స్వేచ్ఛని ఇచ్చి చూడటం. ఈ రెండిటిలో మనం ఏదీ చెయ్యము. మనది పూర్తిగా నియంతృత్వ వ్యవస్థ ఉన్న సమాజం కాదు, పూర్తి స్వేచ్ఛ ఉన్నటువంటిదీ కాదు. ఆ రెండిటి మధ్యలో ఎక్కడో ఉంటుందది. అటూ ఇటూ కాని ఉన్న మనం ఈ అదనపు మానవశక్తిని ఏమి చెయ్యాలో ఇంతవరకూ తెలియని స్థితిలోనే ఉన్నాము. ప్రతిదీ మనం ప్రభుత్వానికే అంటగట్టి మన కష్టాలన్నిటికీ దానిదే బాధ్యత అన్నట్లుగా ఉంటాము. లేదా మనకి మనమే శిక్ష విధించుకునే రీతిలో ప్రవర్తిస్తాము. పంజాబ్‌లో మన మిత్రులు కొందరు ఇప్పుడు స్వయం నిర్ణయాధికారం పేర చేస్తున్నది అదే.

పాలకుల లోపాలని విమర్శించటం అన్నది చాలా తేలిక. ఉదాహరణకి భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుపై విమర్శనే తీసుకోవచ్చు. నా దృష్టిలో భాషా ప్రయుక్త రాష్ట్రాలని ఏర్పాటు చెయ్యటంలో తప్పేమీ లేదు. ప్రపంచంలో అన్నిచోట్లా రాష్ట్రాలు భాష ప్రాతిపదికగానే ఉన్నాయి. అది సహజం. రాష్ట్రాలే కాకుండా దేశాలే అవి మాట్లాడే భాష పేరు మీదే ఉన్నాయి. ఫ్రెంచి వారు ఫ్రెంచి మాట్లాడతారు. ప్రపంచంలో అత్యంత అందమైన భాషగా దానిని వారు భావిస్తారు అన్నది వేరే విషయం. డచ్చివారు డచ్చిభాష, పోర్చుగీసు వారు పోర్చుగీసు భాష మాట్లాడతారు. యూరోప్‌లోని ఈ భాషాపరమైన తేడాలే ఆ ఖండంలో వరుసగా జరిగిన యుద్ధాలకి కారణం అని మీరు అనవచ్చు కానీ దానికి అర్థం లేదు. హిట్లర్ పాలనలో 'జర్మన్‌లు సోవియట్ రష్యాపై దండెత్తింది వాళ్లు రష్యన్ భాష మాట్లాడుతారని కాదు. అలాగే ఫ్రెంచి వాళ్లపై దండెత్తింది వాళ్లు ఫ్రెంచి భాష మాట్లాడుతారని కాదు. యూరోప్‌లో జరిగిన యుద్ధానికి కారణాలు పూర్తిగా భిన్నమైనటువంటివి. భాషకీ వాటికీ సంబంధం లేదు. ఇప్పటికీ యూరోప్‌లో ఒకే భాష మాట్లాడే దేశాలు ఉన్నాయి. కానీ రెండవ ప్రపంచ యుద్ధానంతరం యూరోప్‌లో యుద్ధాలు లేవు. పశ్చిమాసియాలో అక్కడ అరబ్బులంతా ఒకే భాష మాట్లాడినా, వాళ్లు చెపుతున్నట్లు ఒకే రకమైన సాంస్కృతిక సంప్రదాయం ఉన్నప్పటికీ రక్తపాతంతో కూడిన ఎన్నో యుద్ధాలు జరిగాయి.

భారతదేశానికీ యూరోప్‌కీ ఎన్నో విధాలుగా పోలికలు ఉన్నాయి. యూరోప్ లాగే భారతదేశం కూడా ఒక దేశం కాదు, ఒక నాగరికత. ఎంతో కాలంగా, ముఖ్యంగా ఈ శీర్షికలో, నేను ఆ విషయాన్ని చెపుతూనే ఉన్నాను. ఆ వాస్తవం ఇప్పటికి అర్థం అవుతున్నట్లు కనిపిస్తున్నందుకు నాకు ఎంతో సంతోషంగా ఉన్నది. ఒకే నాగరికత నీడ కింద ఎన్నో దేశాలు ఉండవచ్చు యూరోప్‌లో లాగా. [illegible]






కూడా ఎన్నో రాజ్యాలు ఉండేవి యూరోప్ కూడా అదే విదేశీ శక్తుల దాడుల తాకిడికి గురైంది కానీ తట్టుకుని నిలవగలిగింది మనం నిలవలేకపోయాము కారణాల జోలికి ఇప్పుడు మన వెళ్ళటం అనవసరం అందువలనే మనం దాదాపు ఎనిమిది శతాబ్దాల పాటు వివిధ విదేశీ పాలనల క్రింద నలిగిపోయి ఆ పరిణామ క్రమంలో ఎన్నో మార్పులకి లోనైనాము మన నాగరికత అదే కానీ దేశం అది కాదు ది యూరోప్‌లో కూడా సంభవించింది కానీ ఇక్కడిలా కాదు యూరోప్ రెండు ప్రపంచ యుద్ధాలతో సహా ఎన్నో యుద్ధాలని చవిచూసింది యూరోపియన్‌లు తాము జర్మనీ వారుగా ఫ్రెంచి వారిగా ఇటలియన్‌లుగా ఉంటూనే అదే సమయంలో యూరోపియన్‌లుగా కూడా ఉండవచ్చుని తెలుసుకోటానికి వారికి అంత కాలం పట్టింది కొందరు తెలిసీ తెలియని ఆర్థికవేత్తలు చెప్పినట్లు యూరోపియన్ సమాజానికి ప్రధానమైన ప్రాతిపదిక ఆర్థిక సంబంధమైనది కాదు సంస్కృతికి రాజకీయాలకి సంబంధించినది యూరోపియన్ ఆర్థిక సమాజం కాదది యూరోపియన్ సమాజం మాత్రమే మీరు కొంత తీరుబడిగా యూరోప్ తిరిగి వస్తే ఆ విషయం తెలుస్తుంది వాళ్ళ యూరోపియన్నెస్ దాదాపుగా ఒకే జాతి అందులో ఎన్నో రాజ్యాలు దేశాలు ఉండవచ్చు ఇప్పటి నుంచి బహుశ ఒక శతాబ్దంలోగానే యూరోప్ ఒకే దేశంగా రూపొంది అందులో ఉన్న వివిధ దేశాలు మనదేశంలోని రాష్ట్రాల లాగా మారిపోవచ్చు దాన తట అది సహజంగా సర్దుకునే వ్యవధిని ఇవ్వకుండా త్వరత్వరగా ఏదో సాధించాలన్న తపనతో మన వ్యవహరిస్తున్నట్లు నాకు అనిపిస్తున్నది రాజకీయంగా ప్రస్తుతం ఉన్నటువంటి స్థితికి చేరుకోటానికి యూరోప్‌కి ఎన్ని శతాబ్దాలు పట్టిందో నాకు తెలియదు అంతటి ప్రగతి పరంతు సమయంలోనే మన ఆ స్థితికి చేరుకోవాలని ప్రయత్నిస్తున్నాము అందుకే మనకు ఈ ఇబ్బందులు యూరోప్ లాగే మనదేశం కూడా వివిధ భాషలు సంస్కృతులతో కూడినటువంటిదిగానే మనం భావించాలి కానీ మన నాగరికత మాత్రం ఒక్కటే దానిని హిందూ అనండి లేదా భారతీయత అనండి మన కోసం మనమంతా ఏకం కావాలి అన తరం ప్రస్తుత ఆర్థిక సాంస్కృతిక పునాదులపై బలమైన భారీ రాజకీయ నిర్మాణం జరగాలి యూరోపియన్‌లు ప్రస్తుతం అదే చేస్తున్నారు మనని విడదీసే శక్తుల కన్నా సంఘటిత చేసే శక్తులే బలంగా ఉన్నాయి కాబట్టి మన అనవసరమైనటువంటి విభేదాలని విద్వేషాలని రెచ్చగొట్టకుండా మనని ఐక్యం చేసే శక్తులకి ఊతం ఇవ్వాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది □

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## పాఠకులకి అవకాశం

గర్భస్థ శిశువు చెప్పిన కథలు శీర్షిక క్రింద పాఠకులెవరైనా తమ రచనలని కథారూపంగా కానీ వ్యాసంగా కానీ వ్రాసి పరిశీలనకి పంపవచ్చు తమ రచనతో పాటు ఈ క్రింద ఇచ్చిన కూపన్‌ని జతపరచి పంపవలసిందిగా కోరుతున్నాము రచనలు తమ స్వంత ఊహాలేనని ఎవరినీ ఉద్దేశించినవి కావని దేనికీ అనువాదం అనుకరణ కాపీ కాదని హామీ వ్రాసి పంపాలి రచన వ్రాత ప్రతిపై వ్రాసినవారిపేరు పూర్తి చిరునామా స్పష్టంగా రాయాలి రచనతో పాటు దానిని వ్రాసిన వారి ఫోటో కూడా జతపరిచి పంపవచ్చు ప్రచురణకి స్వీకరించిన రచనలని అవి వ్రాసినవారి ఫోటోలతో సహా ప్రచురిస్తాము

రచనలు ఒక అరఠావు పేజీకి మించరాదు కాగితానికి ఒకవైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి

ప్రచురణార్హంకాని రచనలని తిప్పి పంపగోరేవారు తమ రచనలతో పాటు తగినన్ని స్టాంపులు అతికించిన స్వంత చిరునామా కల కవరు జతపరచి పంపాలి లేకపోతే వాటిని తిప్పి పంపటం జరగదు వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదు

ఈ శీర్షికకి పంపే రచనలని సంపాదకుడు ఆంధ్ర సచిత్ర వారపత్రిక గాంధీనగరం విజయవాడ-520003 అన్న చిరునామాకి పంపాలి కవరు పైభాగంలో గర్భస్థ శిశువు చెప్పిన కథలు శీర్షికకి అని స్పష్టంగా రాయాలి

ప్రచురించిన ప్రతి రచనకీ పారితోషికం ఉంటుంది పాఠకులందరూ ఈ అవకాశాన్ని వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము

–సంపాదకుడు

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్యాసం రాసిన పూర్తి పేరు ____________________

పూర్తి చిరునామా ____________________

____________________

____________________

పిన్ కోడ్ ____________________

సీరియల్

# కరిగినశిల

రావినూతల సువర్ణకన్నన్

(గత సంచిక తరువాయి)

తండ్రి మండిపడుతూ చెప్పిన విషయాలు విన్న శ్యామల నిర్ఘాంతపోయింది

'నిజంగా ప్రభు అంత మాటన్నాడా? అవసరం అయితే దాన్నే చేసుకుంటానన్నాడా! అంటే ఈ నాటకం చాలా రోజుల్నించి జరుగుతోందన్నమాట! ఎంత మోసం!

అవును! తను గుడ్డిగా నమ్మింది గానీ తల్చుకుంటే ప్రభాకర్ చేసే ప్రతి పనీ – ఓ ప్లాన్ ప్రకారమే జరుగుతోందనిపిస్తోంది

అయినా నేనెంత పిచ్చిదాన్ని! హాస్పటల్‌లో ఆమె మీద ఎంతో మంది, ఎన్నో విధాలుగా చెప్పారు వాళ్ళిద్దరూ కలిసి ఇంత ఘోరంగా వెన్నుపోటు పొడుస్తారని గ్రహించని తాను వాళ్ళవతి మాటలూ నమ్మక పోగా కొట్టినంత పని చేసింది. 'సరయుని ఏవన్నా అన్నారంటే మర్యాదక్కదు అంటూ నానా చివాట్లూ వేసింది ఛ! అనాడే ఆమెని పంపేస్తే ఈనాడు నాకీ మనస్తాపం వుండేది కాదు.'

తల్చుకున్న కొద్దీ ఆమెకి దుఃఖం వచ్చేస్తోంది

"ఇద్దరంతా కల్సితే ఎంత బావుండు అనుకుంది

'సారీ శ్యామూ! , సరయుని పంపేశాను జరిగిందానికి నన్ను క్షమించవూ అంటే భర్తని క్షమించేసి అతని ఎద మీదికి ఒరిగి పోవడానికి సిద్ధంగా వుంది శ్యామల

ఒంటరిగా తన గదిలో పడుకుని శూన్యంలోకి చూస్తున్న శ్యామలకి తన స్నేహితురాలు సుగుణ రాక ఎంతో ఆనందాన్నిచ్చింది చటుక్కున లేచి ఆమెని ఆహ్వానించింది

శ్యామలని చూసిన సుగుణ తెల్లబోయింది.

'అదేవిటి శ్యామూ! అలా అయిపోయావేవిటి? ఆశ్చర్యంగా అంది.

'ఎలా అయిపోయాను?' బలవంతంగా నవ్వింది శ్యామల

మునుపటి కళ గానీ, ఉత్సాహంగానీ మచ్చుకైనా నీలో లేవు! అమ్మపోతే మాత్రం మరీ ఇలా అయిపోతే ఎలా చెప్పు!' ఆప్యాయంగా ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంది సుగుణ

ఈ మాత్రపు ఆదరణకే కరిగిపోయిన శ్యామల స్నేహితురాల్ని చుట్టేసి బావురుమంది

బిత్తరపోయింది సుగుణ

తర్వాత మెల్లగా బుజ్జగించి శ్యామల నించి విషయాన్ని రాబట్టింది

నువ్వు చెప్పే ఆ అమ్మాయి ఎలా వుంటుంది?' కాస్సేపు మాటల తర్వాత అడిగింది

అయిష్టంగానే సరయుని వర్ణించింది శ్యామల

ఆమె ఇంతకు ముందే నీకు తెలుసా?

ఆ! అనాసక్తిగా అంది శ్యామల

ఎలా తెలుసు?'

అదిగో! ఆ కనిపించే మేడ లేదూ? ఆ స్థలం ఒకప్పుడు ఆ సరయు వాళ్ళదే ఎవరో కొనుక్కుని పాత ఇంటిని పడగొట్టి మేడ కట్టుకున్నారు సరయూ వాళ్ళింటి కేసి చూపిస్తూ అంది శ్యామల

మైగాడ్!" అప్రయత్నంగా అంది సుగుణ

ఏవిటి సుగుణా?" తెల్లబోయింది శ్యామల

'ఆ అమ్మాయికి పెళ్ళి కాలేదూ? శ్యామల మాటకి జవాబు చెప్పకుండానే ఆతృతగా అడిగింది సుగుణ

లేదు! అయినా బావుండేది! నిరసనగా అంది శ్యామల

చటుక్కున లేచి నిల్చుంది సుగుణ

ఏవిటి అప్పుడే లేచావ్? తెల్లబోయింది శ్యామల

సారీ! శ్యామలా! వివరాలన్నీ తర్వాత చెప్తాను ఒక్కసారి నన్నామె దగ్గరికి తీసికెళ్ళగలవా? ప్లీజ్! అభ్యర్థనగా అంది సుగుణ

నేనా? దాని దగ్గరికా? ఛీ!

పోనీ యడ్రస్ చెప్పు!

ఆ అమ్మాయి యడ్రస్ నీ కెందుకు?'

'చెప్తానుగా ముందు యడ్రస్ చెప్పు!' అంటూ ఆమె దగ్గర సరయు యడ్రస్ తీసుకుని థ్యాంక్స్ చెప్పి హడావిడిగా వెళ్ళిపోయింది సుగుణ

విషయం అర్థంకాని శ్యామల బిత్తరపోయి అలా చూస్తూండి పోయింది

* * * *

మిస్టర్ రమణా! గుడ్ న్యూస్' వురుకుల పరుగులతో వచ్చిన సుగుణని చూసి ఆశ్చర్యపోయాడు రమణ

"ఏవిటి మరో పెళ్ళికూతుర్ని చూశారా" అన్నాడు నవ్వుతూ.

'అవును . కానీ మీకు నచ్చే పెళ్ళికూతురు ఈ అమ్మాయి! గంభీరంగా అంది సుగుణ.

**జరిగిన కథ-16** సరయు అడ్రసు కావాలంటూ వనజ ఇంటికి వస్తాడు రమణ సరయుకి వివాహం అయ్యిందని, ఆమె ఇప్పుడు ఎక్కడున్నది తనకి తెలీదని చెపుతుంది వనజ ప్రభాకర్, సరయూలను అనుమానిస్తుంది శ్యామల. రమణ చిన్నా పేరిట చిన్నా శాంతి హోమ్ స్థాపిస్తాడు. డా. సుగుణ రమణకి చేరువయి ప్రాణ స్నేహితురాలైంది. శ్యామల తల్లి చనిపోయింది. డా. సుగుణ బలవంతం వల్ల పెళ్ళికి అంగీకరిస్తాడు రమణ. మామగారు అన్న మాటలకు ఆవేశంగా జవాబిస్తాడు ప్రభాకర్

ఏమిటి సుగుణా?

సరయు జాడ తెలిసి పోయింది!

ఏమిటి? ఆమెని పట్టి కుదిపేశాడు రమణ

ఆగండాగండి! నేను సుగుణని! సరయుని కాదు! సున్నితంగా అతని చేతులు తప్పిస్తూ అంది సుగుణ

ఓ! సారీ! సిగ్గుపడి పోయాడతను

పరవాలేదు ఇంతకీ నేను చెప్పింది అర్థం అయిందిగా?

ఆ! సరయు జాడ తెలిసిందన్నారు ఎక్కడా? ఎంత మామూలుగా అడగాలన్నా అతని గొంతులో ఉద్వేగం తొంగి చూస్తూనే వుంది

అత్తవారింట్లో! అల్లరిగా నవ్వింది సుగుణ

ఓ! బాధగా నిట్టూర్చాడు రమణ

ఏవూరని అడగరేం?

మీరు చెప్తారుగా?

అయితే వినండి మా ఫ్రెండ్ శ్యామలగారి వూరు

ఊహూఁ!

ఇంకో సంగతి చెప్పనా?

చెప్పండి! నిరాసక్తిగా అడిగాడు రమణ

సరయు కింకా పెళ్ళి కాలేదు!

ఏమిటి? త్రుళ్ళి పడ్డాడు రమణ

అతని ఎదలో కోటి వీణియలు మ్రోగినట్టు ఆనందం సముద్ర తరంగాల్లా ఎగసి పడుతున్నట్టు అనిపించింది

అవును! ఇంకా సరయు పెళ్ళి చేసుకోలేదు!

ఎంత చల్లని మాట చెప్పారు సుగుణా! తననితాను మరచి అన్నాడు రమణ

అప్పుడే అంతలా పొంగిపోకండి! అంటూ శ్యామల చెప్పిన విషయాన్ని చెప్పింది సుగుణ



## కరిగిన శిల

చ! చ! సరయు అలాంటిదికాదు! ఆమె గురించి నాకు బాగా తెలుసు! అంటూ ఆమె వ్యక్తిత్వం స్వభావం అన్నీ చెప్పాడు రమణ ప్రభాకర్‌తో ఆమె తొలి పరిచయం కూడా చెప్పాడు

సుగుణ ఆలోచనలో పడింది

మరి శ్యామల క్షణం తర్వాత మెల్లగా అంది

ఆవిడేదో పొరపడ్డారు నాకు తెలిసినంతవరకు ప్రభాకర్ కూడా చాలా మంచి వ్యక్తి!

అలా అయితే మంచిదే! ఏదైనా ఒకసారి మనం అక్కడికెళ్తేగానీ నిజానిజాలు తెలియవు మీరు బయల్దేరండి! వాచ్ చూసుకుంటూ అంది సుగుణ

పది నిమిషాల్లో ఇద్దరూ కార్లో వున్నారు

* * * *

హాస్పటలంతా హడావిడిగావుంది ఏదో యమర్జన్సీ ఆపరేషనై అప్పుడే బైటకొచ్చాడు ప్రభాకర్

ఎందుకో అతని మనసంతా చికాగ్గావుంది

ఒక ఆడదాని అసూయకి మరో ఆడది బలి అవడం అతను సహించలేకపోతున్నాడు

జరిగిన సంఘటనలతో శ్యామలంటే ఒక విధమైన అసహ్యం కూడా బయల్దేరిందతనిలో

గుడ్‌మాణింగ్ డాక్టర్! చిరునవ్వుతో విష్ చేసిందా సుగుణ

ఓ! గుడ్‌మార్నింగ్! మీరు శ్యామల ఫ్రెండ్ సుగుణగారు కదూ? ఆహ్వానిస్తూ అన్నాడు ప్రభాకర్

గుర్తించారే ఈయన రమణగారు అంటూ రమణని పరిచయం చేసింది సుగుణ

ఓ! రమణగారు నాకు తెలియక పోవడం ఏవిటి కానీ చాలా మారిపోయారు! అంటూ వాళ్ళిద్దరికీ సీట్లు చూపించాడు ప్రభాకర్

మనసులో మాత్రం–

వీళ్లెందుకొచ్చారు? శ్యామల రాయబారం పంపివుంటుందా? అనుకున్నాడు

ఇద్దరికీ కాఫీలు తెప్పించి ఇచ్చాడు

మీరు చేసిన వన్నన్నీ పేపర్లో చూశాను నిజంగా యావార్ గ్రేట్! కానీ పాపం మీ బ్రదర్ పరామర్శించబోయాడు ప్రభాకర్

వీరు సరయుగారికోసం వచ్చారు! మాటమారుస్తూ విషయాన్ని సూటిగా చెప్పింది సుగుణ

తుళ్ళిపడ్డాడు ప్రభాకర్ అతని ముఖం తెల్లగా పాలిపోయింది

సారీ! లోగొంతుతో అన్నాడు

అదేవిటి సరయు ఇక్కడే వుందిగా? ఇద్దరూ ఏకకంఠాన అడిగారు

వుండేది!

అంటే? ఆతృతగా అడిగింది సుగుణ

ప్రస్తుతం లేదు

రమణ గుండె వేగంగా కొట్టుకుంది

లేదా? ఎక్కడి కెళ్ళింది?

తెలియదు! కానీ

చెప్పండి! ప్లీజ్!

జీవంలేనట్టు ఓ నవ్వు నవ్వి–

సంగతి తెలిసి, నన్ను నిందించకండి! అంటూ డ్రాయర్‌లోంచి ఓ లెటర్ సుగుణ చేతికందించాడు ప్రభాకర్

ఆతృతగా తెరిచింది సుగుణ

డాక్టర్ ప్రభాకర్‌గారికి నమస్తే!

అయిన వాళ్ళెవరూ లేని నన్ను ఓ తోబుట్టువుగా తలచి ఆదరించారు ఆశ్రయం ఇచ్చారు కానీ ఆ ఆశ్రయాన్ని నేను నిలుపుకోలేని దురదృష్టవంతురాల్ని!

ఆ రోజు మీ మామగారొచ్చినప్పుడు మీతో చెప్పి వెళ్ళిపోయాను అయితే ఓ పేషెంటుని గురించి మీకు చెప్పాలని తిరిగి వచ్చాను అప్పుడు మీ ఇద్దరి సంభాషణా వినడం జరిగింది

శ్యామలగారికి ఈవూరి మీద ఎందుకు విముఖత కలిగిందో ఆవిడ ఎందుకు రానన్నదో తెలిసింది నేను నిర్ఘాంతపోయాను బాధపడ్డాను సిగ్గుపడ్డాను నాకు తెలియకుండానే నన్నాదరించిన వారికి అపకారం చేశాను అందుకే నాతప్పు నేను తెలుసుకుని ఇక్కణ్ణుంచి వెళ్ళిపోతున్నాను మీరు శ్యామలగార్ని తీసుకురండి

నిజానికావిడ చాలామంచివారు ఆవిణ్ని తప్పుపట్టకండి ఆ పరిస్థితిలో ఎవరున్నా అలాగే ప్రవర్తిస్తారు! అంతేకాదు నా ప్రాణదాతగా కూడా మీకు నేను కృతజ్ఞతలు చెప్పుకోవాలి! అందుకే వెళ్ళిపోతున్నాను మీతో చెప్పకుండా వెళ్తున్నందుకు మన్నించండి

శలవు సరయు

ఉత్తరం పూర్తిచేసిన సుగుణ మొహం వాడిపోయింది భారంగా ఆ లెటర్ రమణ కందించింది రమణ కూడా చదివి భారంగా నిట్టూర్చి తిరిగి ఆ లెటర్ ప్రభాకర్‌కి ఇచ్చి లేచాడు

ప్రభాకర్‌కి థాంక్స్ చెప్పి ఇద్దరూ తిరుగుముఖం పట్టారు వెళ్ళేటప్పుడున్నంత వుత్సాహం మచ్చుకైనా లేదు

అయామ్ సారీ రమణా! ఇలా అవుతుందని నేను వూహించలేదు! మెల్లగా అంది సుగుణ

చ! ఇది ఎవరుమటుకు వూహిస్తారు సుగుణా! పేలవంగా నవ్వాడతను

కానీ శ్యామల ఇలా చేసిందంటే నాకు ఆశ్చర్యంగా వుంది కాస్త గారాబంగా పెరిగింది కాబట్టి అలా వుంటుందిగానీ నిజానికి అంత చెడ్డదికాదు ఏదో ఆలోచిస్తూ అంది సుగుణ

కారు సెంటర్లోకి రాగానే సడన్‌గా ఆగిపోయింది ఏవిటి అన్నట్టు చూశాడు రమణ

'అటు చూడండి! ఓ షాపుకేసి చూపించింది సుగుణ

అక్కడ రామారావు కొన్ని సామాన్లు కార్లో పెట్టిస్తున్నాడు మనసు బావుండనప్పుడల్లా స్వయంగా షాపింగ్ చెయ్యడం అలవాటాయనకి

గుడ్‌మాణింగ్ అంకుల్! కారు దిగి విష్ చేసింది సుగుణ

ఓ! సుగుణా! ఎక్కణ్ణుంచమ్మా?' చిన్నగా నవ్వుతూ అన్నాడాయన

# శివోక్తం

(ప్రఖ్యాత కన్నడకవి సర్వజ్ఞ వచనాలు ఆధారంగా)

బందుగుల్ జేరి నీ యిల్లు డెందమలర
వుప్పి గడుపార చేతురు భోజనముల
పాప జాలరు సంసార బంధములను
సుప్రతాచార్యు మించిన చుట్ట మెవరు?

'పంచలో నున్న ఎద్దురూపాన లేక
పసుల జోసెడి లెంకరూపాన పెరటి
చెట్టురూపాన లేకున్న చెప్పు గానొ
ఉత్తమాచార్యు సన్నిధి నుండుమయ్య

నిమ్న కులముల వారింట నెగడు జ్యోతి
హీనమగును కాదేయని ఎవడు పల్కు?
అదియ నా జాతి నీ జాతి అనకుమయ్య
శంభుదయ ఉన్న వ్వాని వంశమ్మె గొప్ప

–కనమలూరు వెంకటశివయ్య

# కరిగిన శిల

శ్యామల అత్తవారింటినించి అంకుల్!"

ఏం పల్లెటూళ్ళు చూడాలని మనసైందా?' నవ్వుతూ అడిగాడు రామారావు

నో! నో! పల్లెకాదు మేం వెళ్ళింది డాక్టర్ ప్రభాకర్ దగ్గరికి!" ఆయిన మొహంలో మారుతున్న భావాలని చదవడానికి ప్రయత్నిస్తూ అంది సుగుణ

ఆయన కనుబొమలు ముడివడ్డాయి

అక్కడికా? ఎందుకు?" ఎంత సౌమ్యంగా అడగాలనుకున్నా ఆయన గొంతులో కఠినత్వమే ఎక్కువగా వుంది

'మరేం లేదంకుల్! అక్కడ సరయు అనే అమ్మాయి పనిచేస్తుందట ఆవిడకోసం ఆవిడ కజిన్ వచ్చారు " అంటూ రమణని పరిచయం చేసింది సుగుణ అమాయకంగా

'అలాగా? పాపం! శ్రమతీసుకున్నారు!" రమణ నమస్కారం అందుకోకుండానే హేళనగా అన్నాడాయన రమణని ఆయన గుర్తించలేదు

అదేవిఁటి?' ఆశ్చర్యంగా అంది సుగుణ

'ఆ పిల్ల అక్కడ లేదు! అవునా?"

శ్రోతలిద్దరూ ముఖాలు చూసుకున్నారు

'అక్కడ లేదా?" మీకెలా తెలుసు? అంది సుగుణ

"ఇంతకుముందే మా ఇంటికొచ్చిందా అమ్మాయి!" తాపీగా అన్నాడు రామారావు

'మీ ఇంటి కొచ్చిందా? ఎప్పుడు?" ఆతృతగా అడిగాడు రమణ

ఇంతకు ముందే! గెటవుట్! అందామనుకున్నాను కానీ ప్రభాకర్ దగ్గర పని మానేసి వెళ్ళిపోతున్నాననీ, శ్యామలతో నాలుగు మాటలు మాట్లాడాలనీ బ్రతిమాలే పోన్లే పోతోంది కదా అని. లోపలికి పంపాను!" దర్పంగా అన్నాడాయన

"థాంక్సు అంకుల్!" అంటూ కారెక్కింది సుగుణ రమణ కూడా ఎక్కగానే కారు వేగంగా పోతుంటే అయోమయంగా చూస్తుండిపోయాడు రామారావు

కారు వంశధార కాంపౌండ్‌లోకి దూసుకుపోయింది వాళ్ళని చూసిన శ్యామల పరిగెత్తుకొచ్చి–

'ఏవిఁటి హడావిడి?' అంది నవ్వుతూ

"సరయు ఇక్కడి కొచ్చిందా?" సూటిగా అడిగింది సుగుణ

ఒచ్చిందిఁ ఏం? "

"ఏది?" ఇద్దరూ ఒకేసారి అడిగారు

వెళ్ళిపోయింది!"

'వెళ్ళిపోయిందా?" ఎక్కడికి? నీరసంగా అడిగాడు రమణ

"తెలియదు! అయినా ఆవిడతో మీకేం పని?" ఇదర్నీ అనుమానంగా చూస్తూ అంది శ్యామల

'పనుందితే! అవును ఆవిణ్ణేమైనా అన్నావా? కంగారుగా అడిగింది సుగుణ

అన్నావా అని మెల్లగా అడుగుతున్నావా? కడిగిపారేశాను పిచ్చి పిచ్చి వేషాలేస్తే నామరూపాల్లేకుండా నాశనం అయిపోతావని హెచ్చరించాను!" గర్వంగా అంది శ్యామల

రమణ మనసు బాధతో మూలిగింది

'అసలు ఆవిడ నీ దగ్గరి కెందుకొచ్చింది?' తీక్షణంగా అంది సుగుణ

ఆయనగారు తనకి బహూకరించిన చీర ఇచ్చేసి ఏదో కథ చెప్పబోయింది ఇలాంటి కట్టుకథలు వినడానికి నేను సిద్ధంగా లేను అందుకే ఆమె నోరెత్తకుండానే–

'గెటవుట్!' అంటూ తరిమేశాను! కసిగా అంది శ్యామల

'ఎంత పన్చేశావు శ్యామలా!" అని సీరియస్‌గా అనేసి–

'రండి రమణా! సరయు బహుశా ఆమె ఫ్రెండ్ ఇంటికెళ్ళచ్చు!' అంటూ నాలుగడుగు లేసింది సుగుణ

'సుగుణా! అయోమయంగా అంది శ్యామల

'సారీ శ్యామలా! మళ్ళీ కలుద్దాం!' అంటూ నడిచిపోతున్న సుగుణనీ, ఆమె ననుసరిస్తున్న రమణనీ చూస్తూ అలాగే నిల్చుండి పోయింది శ్యామల

సుగుణ, రమణ వనజా వాళ్ళింటి కెళ్ళేసరికి ఆమె వీధిలోనే వుంది రమణని చూసి నవ్వుతూ ఆహ్వానించింది

సుగుణని ఆమెకి పరిచయంచేసి–

"సరయు వచ్చిందా?' ఆతృతగా అడిగాడు రమణ

ఆ! వచ్చింది!"

ఏది?"

"ఇప్పుడే వెళ్ళింది! ఆమెని పంపడానికే నేను వీధిలో కెళ్ళాను! అదలా వెళ్ళింది మీరొచ్చారు!

"మైగాడ్!' అప్రయత్నంగా అన్నాడు రమణ

'ఏమైంది?" కంగారుగా అడిగింది వనజ

ఆమె ఎక్కడి కెళ్ళిందో తెలుసా?" అంది సుగుణ

తెలియదు!"

వనజగారూ! నిజంగానే మీకు తెలియదా?" సూటిగా చూస్తూ అడిగాడు రమణ

'సారీ మిస్టర్ రమణా! నాకు నిజంగానే తెలియదు క్రితంసారి మీతో అబద్ధం చెప్పిన మాట నిజమే! కానీ అలా చెప్పమని సరయే చెప్పింది

చాలా రోజుల తర్వాత ఇంతకు ముందు వచ్చి పదే పది నిమిషాలు కూర్చుని–

ఇంక తను కనిపించననీ, చిన్నతనంలో తమని ఆదుకున్న మేరీ కుటుంబం అమెరికానించి వచ్చిందనీ, వాళ్ళతోపాటు తనూ అక్కడే స్థిరపడతాననీ చెప్పింది ఎంత బతిమాలినా కనీసం భోజనమైనా చెయ్యకుండా వెళ్ళిపోయింది!

అసలు సరయుకి లోకజ్ఞానం తక్కువ రమణగారూ! ప్రతి చిన్న విషయాన్నీ లెన్స్‌లోపెట్టి చూసి మరీ బాధపడుతుంది " స్నేహితురాలి గురించి చెప్తుంటే వనజ కళ్ళనించి నీటిచుక్కలు రాలాయి

ఉసూరుమన్నారు సుగుణ, రమణా కూడా

ఇంక ఈ టాపిక్ వదిలేద్దాం సుగుణా" తిరిగి వచ్చేటప్పుడు కార్లో అన్నాడు రమణ

"అదేం?"

"సరయుకి నామీద ఇంకా కోపం పోలేదని తెలుస్తూనే వుంది నేనంటే అసహ్యించుకునే ఆమెని ఎలా ప్రసన్నం చేసుకోను? మనసులోని మాటని ఎలా బైటపెట్టుకోను ఆమెని వెంటాడి, ఇంకా బాధపెట్టడం ఎందుకు!

దేశమే వదిలిపోతున్న ఆమెని ఎలా కలుసుకోను. పోనీండి సుగుణా!. నిజమైన ప్రేమ త్యాగాన్నే కోరుతుందంటారు అందుకే నేనూ ఆమె సుఖాన్నే కోరుతున్నాను

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారి చేత 1986-87 సం నకు ఉత్తమ చిత్ర కళోపాధ్యాయుడుగా ఎన్నికై "స్టేట్ టీచర్స్ అవార్డు" అందుకున్న ప్రముఖ చిత్రకారుడు శ్రీ వెల్లటూరు పూర్ణానంద శర్మ (52)



# సిబాకా టూత్‌బ్రష్ మరే యితర సాధారణమైన టూత్‌బ్రష్‌కన్నా మరింత సురక్షితమైనది.

## మీరే చూడచ్చిక మరెందుకో!

కేవలం సిబాకా మాత్రమే
సురక్షితమైన గుండ్రటి
కొసలుగలది

సాధారణమైన బ్రష్‌ల
కొసలైతే ఇగుళ్ళను
గాయపరుస్తాయి

సిబాకా బేబి

సిబాకా జూనియర్

సిబాకా స్టాండర్డ్

సిబాకా ఏంగ్యులర్ డీలక్స్

సిబాకా ట్రాన్స్‌పెరెంట్ ఏంగ్యులర్ డీలక్స్

ఎన్ని రంగుల్లో!
ఎంచుకునేందుకెన్నెన్నో!

**సిబాకా**

భారతదేశంలో అత్యధికంగా అమ్ముడయ్యే టూత్‌బ్రష్

ULKA-HCG-CT-1-86 TEL

# కరిగిన శిల

కానీ తుది శ్వాస తీసేలోగా అయినా సరే ఒక్కసారి ఆమెని చూడాలి! ఆ ఆశతో నే జీవిస్తాను! ఆ ఘడియకోసం చకోం పక్షిలా ఎదురుచూస్తాను!" అతని గొంతులో దుఃఖం సుళ్ళు తిరిగింది

అతనికేసి బాధగా చూసింది సుగుణ

* * * *

తండ్రి బైటికెళ్ళిపోయాక తీరిగ్గా పేపర్ చూస్తూ కూర్చున్న శ్యామల గేటు చప్పుడు, కుక్క అరుపు వినగానే కిటికీలోంచి తొంగిచూసింది

వాళ్ళ వంటావిడ కాంతమ్మని అర్దర్లీ లోపలికి తీసుకొస్తున్నాడు

ఆవిణ్ణి చూడగానే శ్యామల ముఖంలోకి వెలుగొచ్చింది ఒక్క అంగలో ఆవిడ దగ్గరి కెళ్ళి చేతులు పట్టుకు తీసుకొచ్చి, ఆమె ఒద్దన్నా వినకుండా సోఫాలో కూలేసింది

ఆవిడ ఇప్పుడు శ్యామల కళ్ళకి వంటావిడలా కనిపించడం లేదు ప్రభాకర్ పంపిన దూతలా కనిపిస్తోంది

"బహుశా ప్రభు తనని బతిమాలి తీసుకురమ్మని పంపివుంటాడు!' గర్వంగా అనుకుంది

బావున్నారా?" అంది చిన్నగా నవ్వుతూ–

ఆవిడ నవ్వలేదు ఎప్పటిలా ఆప్యాయంగా పలకరించనూ లేదు ముళ్ళమీదున్నట్టు మౌనంగా కూర్చుంది

ఏదో చెప్పడానికి సందేహిస్తోందని గ్రహించి శ్యామల–

'చెప్పండి! ఏవిఁటిలా వచ్చారు? అంది

'అయ్యగారు సరయుని పంపేశారు ఎలాగైనా మీకు నచ్చచెప్పి మిమ్మల్ని వెంటబెట్టుకుని రమ్మన్నారు! ఇంక మీరు రాకపోతే నామీద ఒట్టే!' లాంటి మాటలు ఆమె నోట్నించి ఎదురు చూసింది శ్యామల అయితే కాంతమ్మ అలా అడగలేదు, పైగా–

అమ్మగారూ! నాగురించి మీరేవఁనుకుంటున్నారు! అంది గంబీరంగా

ఆవిడ ప్రశ్నకి తెల్లబోయింది శ్యామల.

'చెప్పండమ్మా! నేనెలా కనిపిస్తున్నాను మీకు?' రెట్టించింది కాంతమ్మ

'ఏం జరిగింది కాంతమ్మగారూ?" అయోమయంగా అంది శ్యామల

'సరయమ్మని గురించి, బాబుగారి గురించి నేనేదో చెడుగా మీకు చెప్పానని మీ నాన్నగారికి మీరు చెప్పారట కదూ?

'అవును! అయితే?

అయితే ఏం వుందీ మీ మాట పుచ్చుకుని మీ నాన్నగారు బాబుగార్ని నానా మాటలూ అన్నారు ఆ సరయమ్మ విని ఎటో వెళ్ళిపోయింది ఇప్పుడు బాబుగారేమో నన్నో దోషిలా చూస్తున్నారు! బాదగా అంది కాంతమ్మ

విషయం అర్థమైంది శ్యామలకి

'అంటే ఈవిడ తనని తీసికెళ్ళడానికి రాలేదన్నమాట! వాళ్లాడే నాటకాలు నాతో చెప్పిందని ప్రభాకర్ ఈవిణ్ణి హడలగొడితే భయంతో పరిగెత్తుకొచ్చిందన్నమాట!" ఆవేశంతో అనుకుంది

'ఓ! అదా సంగతి . వాళ్ళు తప్పుడు పన్లు చెయ్యగా లేంది, మీరు చెప్తే తప్పయిందటా? మీరేం బాధ పడకండి కాంతమ్మగారూ! ఆయనగారు పంపేస్తే నేను మిమ్మల్ని ఆదుకుంటాను! మండిపడుతూ అంది

"అయ్యో! తల్లీ! వాళ్ళు తప్పుడు పన్లు చెయ్యడమేవిఁటి నేను మీతో చెప్పడం ఏవిఁటి లబలబలాడింది కాంతమ్మ

మీరు చెప్పలేదూ?

'ఏవఁని?

"అదే ఆరోజు మీరు ఫోన్లో చెప్పి

ఏం చెప్పాను!

"మా అమ్మగారు పోయిన రోజున నేను ఫోన్‌చేస్తే మీరేం చెప్పారు? రాత్రినించి ఆయన సరయు దగ్గరే వున్నారని చెప్పలేదూ? కాఫీ, భోజనాలు కూడా అక్కడికే పంపుతున్నానని చెప్పలేదూ?" తీక్షణంగా అంది శ్యామల.

తెల్లబోయింది కాంతమ్మ

'అయితే దీనికేనా మీరు ఇంత గొడవ, ఇన్ని కథలల్లింది' అంది పూడిపోతున్న గొంతుతో

'అంటే అది మీకంత చిన్న విషయంలా కనిపిస్తోందా?

అయ్యో! నేను తెలిషి తక్కువగా చెప్పిన రెండు మాటలు పట్టుకుని మీరింత రాద్ధాంతం చేశారా? విస్తుపోయిందావిడ

రాద్ధాంతమో సిద్ధాంతమో నా మనసు మాత్రం విరిగిపోయింది! చిరాగ్గా అంది శ్యామల

మీరు చాలా పొరపడ్డారమ్మా! బాధగా అంది కాంతమ్మ

అంటే?'

మీరు సరయుని గురించి ఒక్కసారి అయ్యగార్నడిగితే "

అడిగాను!'

ఏవఁన్నారు?"

సరయు గురించి సీదాకా వచ్చిందా ఆవిడకేం అదృష్టవంతురాలు, పెళ్ళికూతుర్లా వుంది, అంటూ చాలా ఎగ్జైట్ అయిపోయారు! ' ఆవేశంగా అంది శ్యామల

"అయ్యో! . అయ్యగారు కూడా దూరం ఆలోచించకుండా అమాయకంగానే మాట్లాడారు జాలిగా అంది కాంతమ్మ

మీ వుద్దేశం ఏవిఁటి? మండి పడింది శ్యామల

అయితే జరిగింది వివరంగా చెప్తాను వినండి! తప్పెవరిదో నిర్ణయించండి ' అంటూ జరిగిందంతా వివరించింది కాంతమ్మ

(ఇంకా ఉంది)






# పండుగ కానుక

క్వార్ట్జ్
గోడ గడియారం




ఉచితం !
ప్రతి

# యూనిమిక్స్

## కిచెన్-మెషిన్‌తో

**త్వరపడండీ!**
ఈ అవకాశము
కొన్ని రోజుల వరకే




**Unimix**
KITCHEN MACHINE

ఆంధ్రప్రదేశ్ పంపిణీదారులు.

**ELITE AGENCIES** : నాంపల్లి, హైదరాబాద్-1. ఫోన్ నెం. 46150

దుర్గయ్య వీధి, ఏలూరు రోడ్డు, అరండల్ పేట, విజయవాడ-2

పులిగడ్డ విశ్వనాథరావు



1912లో జలసమాధి ఐన "టిటానిక్" ఓడ.

# యథార్థంగా మారిన కల్పన

ఈ ప్రపంచంలో చిత్ర విచిత్రమైన సంఘటనలు జరుగుతూ ఉంటాయి. వాటిలో కొన్ని ఎందుకు జరిగాయో, ఎలా జరిగాయో హేతుబద్ధంగా చెప్పలేం. వాటిని మనం శాస్త్రీయపరంగా చూసినంతవరకు అవి ప్రశ్నలగానే మిగిలి పోతాయి. ఇంద్రియ శక్తులకు అతీతంగా అన్వేషిస్తేనే ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరుకుతాయి. ఇంగ్లండు, అమెరికాలో జరిగిన రెండు, మూడు అపూర్వ సంఘటనలు ఇటువంటివే.

1898లో ఇంగ్లండులో సౌథంప్టన్ రేవు నుంచి "టీటాన్" అనే రమ్యమైన ఒక ఓడ అమెరికాకు బైలు దేరింది. ఆ విశాలమైన సముద్రయానం పెద్ద రాజప్రాసాదంలా ఉంది. దాంట్లో అన్ని భోగభాగ్యాలు ఉన్నాయి. ఆ విలాస సౌకర్యాలను అనుభవిస్తూ దాదాపు 3000 శ్రీమంతులైన ప్రయాణీకులు ప్రయాణం సాగిస్తున్నారు. ఐతే ఆ ఓడ అమెరికాకు చేరలేదు. సముద్ర మధ్యలో ఒక మంచు దిబ్బని ఢీకొని జల సమాధి అయింది. దాదాపు సగం మంది ప్రయాణీకులు దాంతో సహా మునిగి ప్రాణాలు కోల్పోయారు. దాంట్లో ప్రాణ రక్షక నౌకలు (లైఫ్ బోట్స్) కూడా లేవు.

ఐతే ఈ ఓడ యథార్థమైనది కాదు ఊహాజనితమైనది. మార్గన్ రాబర్ట్‌సన్ అనే నవలాకారుడు రాసిన "ఫ్యుటిలిటీ" అనే నవలలో ఈ ఓడ ప్రసక్తి ఉంది. ఈ ఓడ కల్పనా లోకానికి మాత్రమే పరిమితమైతే ఏ గొడవా లేకపోను. ఇది జరిగిన 14 ఏళ్ళ తర్వాత అచ్చం అలాంటి దుర్ఘటనే యథార్థంగా జరిగింది.

ఏప్రిల్ 10, 1912 తేదీన సరికొత్తగా నిర్మితమైన ఒక విలాస సముద్రయానం మొదటిసారిగా అమెరికాకు బైలు దేరింది. ఆ ఓడలో అతి సంపన్నులైన మూడు వేల మంది యాత్రికులు ప్రయాణం చేస్తున్నారు. అది కూడా మంచు దిబ్బకు ఢీకొని సముద్రంలో మునిగి పోయింది. దాంట్లో కూడ ప్రాణరక్షక నౌకలు లేవు కాబట్టి ప్రయాణీకులలో దాదాపు సగం మంది ప్రాణాలు కోల్పోయారు. సముద్రంలో మునిగి చనిపోయిన వారి సంఖ్య 1513. ఆ ఓడ పేరు కూడా ఇంచుమించు నవలలో 'ఓడపేరు (టీటాన్) లాంటిదే– టిటానిక్.

పేరే కాదు ఇతర విషయాలలో కూడ రెండు ఓడల మధ్య చాలా పోలికలు ఉన్నాయి. వాటి సైజు, ప్రయాణం చేసే వేగం ఒకటే. అవి మునుగుతాయని ఎవరూ ఊహించలేదు రెండు ఓడలు ఉత్తర అట్లాంటిక్ మహాసముద్రంలో ఒకే చోట మునిగాయి.

టిటానిక్ జల సమాధయిన 23 ఏళ్ళ తర్వాత అటువంటి పరిస్థితిలోనే చిక్కుకున్న ఒక ఓడను టిటానిక్ ప్రమాదం స్మృతి రక్షించగలిగింది. ఏప్రిల్ 1935 లో విలియమ్ రీవ్స్ అనే నావికుడు తన స్టీమరు ముఖభాగంలో కాపలా కాస్తున్నాడు. ఆ స్టీమరు ఇంగ్లండులో టైన్ సైడ్ నుంచి కెనెడాకు వెళుతోంది. ఏప్రిల్ నెలలో ఓడలు ఎక్కువగా మంచు దిబ్బలను ఢీకొనే సంఘటనలు జరుగుతూ ఉంటాయి. రీవ్స్ అదే ఆలోచిస్తున్నాడు. అర్ధరాత్రికి అతడి కాపలా ముగుస్తుంది. ఆ సమయమప్పుడే టిటానిక్ మంచు దిబ్బని ఢీకొన్నదని అతడు గుర్తు తెచ్చుకున్నాడు. అతడి కళ్ళు అపాయం కోసం చీకటిలోకి గాలించ సాగాయి. పోనీ అరిచి అందరినీ హెచ్చరిద్దామంటే తీరా ఏమి జరగకపోతే అంతా తనను ఎగతాళి చేస్తారని రీవ్స్ ఊరుకున్నాడు.

రీవ్స్‌కి అకస్మాత్తుగా ఒక విషయం జ్ఞాపకం వచ్చింది. ఔను ఈ రోజే అనగా ఏప్రిల్ 10 తేదీనే కదా టిటానిక్ మునిగిపోయింది. ఏదో ప్రమాదం జరుగబోతున్నదనే అతడి అనుమానం వెంటనే

విశ్వాసం క్రింద మారింది అతడు కంగారు చెంది అపాయం ఉందని బిగ్గరగా అరిచాడు చుక్కాని త్రిప్పి మనుషులు ప్రమాదాన్ని సూచించే గంట మ్రోగించారు స్టీమరు ఇంజన్లు ఆగిపోయాయి స్టీమరు నిలిచిపోయింది కొన్ని గజాల దూరంలో చీకటిలో ఒక మంచు దిబ్బ తేలుతూ కనబడింది అది ఒక్కటే కాదు, ఇంకా ఎన్నో మంచు దిబ్బలు స్టీమరును చుట్టుముట్టి ఉన్నాయి వాటిలో దేనికి ఢీకొన్నా స్టీమరు మునిగిపోయి ఉండును మంచుని చెక్కి ఆ మంచు దిబ్బల మధ్య దారి చేసి బైటపడడానికి ఆ స్టీమరుకు తొమ్మిది రోజులు పట్టింది ఈ స్టీమర్ పేరు కూడా టిటానిక్ లాగే ఉంది దాని పేరు టిటానియన్

అమెరికాలో ఒక రచయిత్రి తనతో కలుసుకోడానికి వచ్చిన ఒక నవోదిత రచయిత్రికి తీరని నష్టం కలుగబోతోందని ఎలా ఊహించగలిగిందో ఏ శాస్త్రవేత్త చెప్పలేడు 1966 లో విల్మాయెట్జ్ అనే నవోదిత రచయిత్రి ఇండియానా విశ్వవిద్యాలయంలో జరుగుతున్న నవోదిత రచయిత్రుల వార్షిక మహాసభకు వెళ్ళింది నవోదిత రచయిత్రులంతా ఇదివరకే పంపిన వారి రచనల వ్రాతప్రతులను పరీక్షించి ఎంపిక చేసి మహాసభకు ఆహ్వానాలు పంపారు ఈ మహాసభ వివిధ సమావేశాలకు దీర్ఘానుభవం ఖ్యాతి గాంచిన రచయిత్రులు అధ్యక్షత వహించనున్నారు సమావేశాల తర్వాత ప్రతి నవోదిత రచయిత్రికి ప్రత్యేక అధ్యక్షురాలితో ముఖాముఖి కూడా ఏర్పాటు చేశారు ఆ రోజు సమావేశం ముగియగానే విల్మా ముఖాముఖి కోసం తాను కలుసుకోవలసిన రచయిత్రి గదికి వెళ్ళింది

ఆ రచయిత్రి ఆమె రచనని చూసి నీతో ఏమనాలో తెలియదు అంది దానికి విల్మా ఫర్వా లేదులెండి నేను విమర్శ సహించగలను అంది అది కాదు దాని గురించి ఎలా చెప్పాలో కష్టంగా ఉంది తర్వాత చెబుతాలే అంది ఆ రచయిత్రి లేని చిరునవ్వు తెచ్చిపెట్టుకుంటూ నేను ఏమైనా




సాయం చేయగలిగితే చెప్పండి చేస్తా అంది విల్మా ఆమె ఘాబరా చూస్తూ నిజంగా ఏమి చెప్పాలో నాకే తెలియడం లేదు అంది ఆ రచయిత్రి

తన రచన ఆమెకు నచ్చలేదు కాబోలు అందువలన ఆమె ఎలా చెప్పాలో తెలియక బాధ పడుతోందని విల్మా ఊహించి ఇలా అంది, నా రచనలు ఎన్నో తిరిగి వచ్చాయి. అందువలన దానికి ఆ రచయిత్రి, తర్వాత ఎప్పుడైనా మాట్లాడుదాంలే అని చెప్పి ముఖాముఖిని ముగించింది

విల్మా ఆమెకు గుడ్‌బై చెప్పి తన గది ద్వారం వద్దకు వచ్చి తాళం చెవి కోసం చేతి సంచిలో వెతుకుతూండగా ఆ రచయిత్రి మెట్లెక్కి తన వద్దకు వచ్చి, ఐతే అది నువ్వేనన్నమాట అని చెప్పి చకచకా మెట్లు దిగిపోయింది విల్మాకు ఇది మంత రహస్యమయం అనిపించింది రాత్రి భోజనం దగ్గర తన ముఖాముఖి గురించి ఇతరులకు చెప్పవలసి వస్తుందని విల్మా భోజనం చేయకుండా గదిలోనే ఉండిపోయింది

రాత్రి భోజనం తర్వాత సమావేశం ఉంది ఆమె హాల్లోకి వెళ్ళి సీటులో కూర్చోగానే ఒకతను ఆమె భుజం తట్టి తనతో సహా బైటకు తీసుకెళ్ళాడు అక్కడ ఇంకా మిత్రురాళ్ళు గుమికూడి ఉన్నారు వాళ్ళ మొహాలు చూడగానే ఏదో విషాద వార్త ఉందని ఆమెకు అనిపించింది వాళ్ళు నెమ్మదిగా విల్మా భర్త విమాన దుర్ఘటనలో పోయినట్లు ఆమెకు చెప్పారు

కాని విల్మాకు తెలిసినంత మట్టుకు ఆమె భర్తకు ఆ రోజు ప్రయాణం చేసే యోచన లేదు అతడు ఆఫీసులోనే ఉండాలి. మరి ఇదెలా జరిగింది? అసలు జరిగిందేమిటంటే విల్మా భర్త ఆఫీసు పని మీద హఠాత్తుగా టెక్సాస్‌కు వెళ్ళవలసి వచ్చింది అతడు విమానంలో తిరిగి వస్తూండగా విమానం చెడిపోవడం వలన దాన్ని అర్కాన్సాస్‌లో బలవంతాన దింపవలసి వచ్చింది ఆ దింపడంలో విల్మా భర్త ఒక్కడూ మాత్రం చనిపోయాడు

ఇది జరిగిన కొన్ని రోజులకు విల్మాకు ఆ రచయిత్రి నుంచి ఒక ఉత్తరం వచ్చింది దాంట్లో ఈ విధంగా ఉంది నువ్వు నా గదిలో ప్రవేశించగానే ఏదో ఆపద రాబోతోందని నాకు పూర్వానుభూతి కలిగింది ఓడ దుర్ఘటనలో నా భర్త పోయే ముందు కూడా నాకు ఆ విధంగానే అనిపించింది ఐతే ఆ రాబోయే ఆపద నీకు సంబంధించిందో లేక నాకు సంబంధించిందో నాకు ముందుగా తెలియలేదు కాని నీ గది ముందు చేతి సంచిలో తాళం చెవి వెతుకుతూండగా నిన్ను చూసి ఆ పూర్వానుభూతి నీకు వర్తిస్తుందని నాకు స్ఫురించింది వెంటనే మా ఇంటికి ఫోను చేసి కనుక్కోగా అక్కడ అంతా సవ్యంగా ఉందని తెలిసింది తర్వాతే నీ భర్త విమాన ప్రమాదంలో పోయినట్లు తెలిసింది □





# ప్రేమలోని నీతి

## విన్నకోట సుశీలాదేవి

"మూర్తిగారూ! మీకొక విషయం చెప్పాలనుకుంటున్నాను అంది సంధ్య హఠాత్తుగా!

సంధ్యాదేవి ఒడిలో విశ్రాంతి తీసుకుంటున్న సూర్యుడిని చూస్తున్న కృష్ణమూర్తి ఆ మాటలకు తల త్రిప్పి ఆమె వేపు చెప్పమన్నట్టుగా చూశాడు

ఈ విషయం చెప్పాలనే మిమ్మల్ని రమ్మన్నాను అందులోనూ రవి ప్రక్కనుండగా చెప్పామని

నవ్వింది సంధ్య అసలు విషయం చెప్పకుండా?

కృష్ణమూర్తికి అర్థం కాలేదు!

ఈరోజు ఆకాశంలోని సంధ్యాకాలం లానే ఎదురుగా వున్న సంధ్య కూడా కొత్తగా కనబడుతోంది!

ఈ మార్పుకి కారణం ఏమిటో! అనుకున్నాడు!

సంధ్య మాటి మాటికీ రవి వేపు చూస్తోంది! బావ గర్వితంగా నవ్వుతోంది!

కృష్ణమూర్తి రవి వేపు చూశాడు! ఆకాశంలోని ఎర్రదనం ఎదురుగా వున్న సముద్రపు నీటిలో పడి అతని ముఖంలోకి వ్యాపించి అంతమవుతున్నాయి పచ్చని అతని ముఖం ఎర్రగా వుంది!

సంధ్యా! అదేమిటో త్వరగా చెప్పు అన్నాడు కృష్ణమూర్తి!

నేను రవిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను

మెల్లగా చెప్పింది!

కృష్ణమూర్తి బిత్తరపోయాడు!

నిజంగానా

అవును మేము నిర్ణయించుకున్నాం అంది

కృష్ణమూర్తి ముఖం వెలవెలబోయింది

ఎదురుగా సముద్రంలో ఉవ్వెత్తుగా ఎగసే అలల్లా అతని మనస్సులో ఒక బాధాకెరటం ఉవ్వెత్తున ఎగసి పడింది!

సంధ్య చెప్పున్నది నిజమేనా! ఆమె వేపే పరిశీలనగా చూశాడు!

సంధ్య రవిని చూస్తోంది!

ఆమె కళ్ళల్లో అనురాగపు రాగ ఛ్చాయలు కనబడ్డాయి ఉదయం తనకు ఫోను చేసి సాయంత్రం బీచికి రండి మీతో ఒక విషయం మాట్లాడాలి అంటే ఏదో అనుకున్నాడు కానీ ఈ దారుణమైన వార్త వినిపిస్తుందనుకోలేదు!

తననెందుకు ఆటబొమ్మని చేసింది?

సంధ్యనే ప్రశ్నించాలని ఆవేశం కలిగింది! సముద్రం వేపు చూస్తున్న కృష్ణమూర్తి విసురుగా సంధ్య వేపు చూశాడు!

అక్కడ కనబడ్డ దృశ్యం అతని ఆవేశానికి అడ్డుకట్ట వేసింది! అతని నోటికితాళం వేసింది!

సంధ్య — పల్లీలు కొన్నట్టుంది వాటిని కర్చీఫ్‌లో పోసింది! పొట్టు ఊది రవి చేతికిస్తోంది!

ఆ ఇవ్వడంలో ఆప్యాయత కనబడింది కృష్ణమూర్తికి ఆ దృశ్యం ఇంకెవరికైనా అయితే మనోహరంగా వుండేదే కానీ కృష్ణమూర్తి గుండెల్ని భగ్గున మండించింది!

ఇది వరకు బీచికి వచ్చినప్పుడల్లా సంధ్య తనకి అలా అందించేది

కానీ ఈ నాడు తను పరాయివాడయ్యాడు! మధ్యలో వచ్చిన రవి స్వంతమనిషయ్యాడు

ఆ పాత సంఘటనలు సంధ్య ఎలా మర్చిపోయిందో! ఎంత నటన! ఎంత ద్రోహం

ఛ ఇక ఇక్కడ ఈమె దగ్గర కూర్చోడం కూడా, మరోపాపం

మీరు కూడా తింటారా!

ఎంత మోసం

ఇన్నాళ్ళు తనని కవ్వించి మాటలతో మైమరపించి ఇవ్వాళ ఇంకొడిని చేసుకుంటుందా!

సంధ్య ఇంత దుర్మార్గురాలను కోలేదు

'సంధ్యా! బాగా ఆలోచించే నిర్ణయం తీసుకున్నావా? పైకి పొంగుతున్న కోపాన్ని అతి కష్టం మీద అపుకుంటూ అడిగాడు కృష్ణమూర్తి!

సంధ్య నవ్వింది!

'ఇందులో అంత ఆలోచించడానికేముంది? రవికేం తక్కువ? అందం వయసు బ్యాంకు వుద్యోగం వున్నాయి! ఇంతకంటే ఏం కావాలి! అంది

ఛెళ్ళున కొరడా దెబ్బలా తాకాయి ఆ మాటలు బాధగా తలత్రిప్పుకున్నాడు!

అవును సంధ్య అన్నట్టు రవికేం తక్కువ! తనకంటె అన్ని విధాలా ఉన్నతుడు!

తను అందగాడు కాడు వయసులో సంధ్యకీ తనకీ పదేళ్ళ అంతరం వుంది! రవిలా తను బ్యాంకు ఆఫీసరు కాడు వ్యాపారస్తుడు అంతే సంధ్య నిర్ణయం మంచిదే హర్షించ తగ్గదే

కానీ తనతో ఎందుకంత చనువుగా తిరిగింది!

నవ్వుతూ అడిగింది సంధ్య కృష్ణమూర్తిని

ఆ నవ్వులో హేళన కనబడింది!

ఆ మాటలు కృత్రిమంగా తోచాయి

భరించలేక పోయాడు కృష్ణమూర్తి

చటుక్కున లేచాడు

నేను వెడుతున్నా

అదే, అప్పుడేనా సంధ్య ఆదుర్దాగా అంది

అవును అర్జంటు పని వుంది! వేరే మాటకు ఆస్కారం ఇవ్వకుండా చకచకా తన కారు దగ్గరకు నడిచాడు

వెనకాల సన్నగా నవ్వు విన్పించింది

అది సంధ్య నవ్వు

తనను తోలు బొమ్మలా ఆడించానని గర్వంగా నవ్వుకుంటోందేమో!

'రాక్షసి ఇటువంటి స్త్రీ కోసం తపించి నేను ఫూల్‌నయ్యాను అనుకుంటూ విసురుగా తలుపు తీసి కారులో కూర్చున్నాడు

కోపమంతా కారు మీద చూపుతూ వేగంగా నడపసాగాడు!

* * * * *

ఆ రాత్రి కృష్ణమూర్తి భోజనం చెయ్యలేదు! నిద్రపోలేదు

ఎంత వద్దనుకున్నా సంధ్య కళ్ళముందు నిలుస్తూనే వుంది! మనస్సుని బాధిస్తూనే వుంది!

సంధ్య పరిచయ మైనప్పటి నుండీ, ఆమెతో గడిపిన క్షణాలు గుర్తుకు రాసాగాయి!

అసలు సంధ్యతో పరిచయమే చాలా చిత్రంగా జరిగింది!

ఆరు నెలల క్రితం

కృష్ణమూర్తి కారులో తన ఆఫీసుకెడుతున్నాడు!

బయట జోరున వర్షం కురుస్తోంది!

వెచ్చగా కారులో కూర్చుని బయట గొడుగుల క్రింద తడుస్తూ వెళ్ళే మనుషులని చూస్తున్నాడు! సరిగ్గా అప్పుడే సంధ్య అతని కళ్ళబడింది!

ఒక బస్‌స్టాప్‌లో ఒంటరిగా వర్షంలో తడిచే కమలంలా నిలువునా తడుస్తూ నిలబడివుంది! చుట్టూ చూశాడు కృష్ణమూర్తి మగాళ్ళందరూ ఏ కాస్త పొడిస్థలమున్నా దానిని ఆక్రమించుకుని నిలబడి వున్నారు! వర్షంలో తడుస్తున్న ఆమెని విలాసంగా, వెకిలిగా చూస్తున్నారు!

కృష్ణమూర్తి ఆదృశ్యాన్ని చూడలేక పోయాడు! చటుక్కున ఆమె ముందు కారు ఆపాడు డోర్ తీసి పట్టుకుని రండి తడిసి పోతున్నారు అన్నాడు

ఆమె రెండు నిముషాలు సంకోచించింది! కృష్ణమూర్తి మరోసారి గట్టిగా అడిగేసరికి వెంటనే ఎక్కి కూర్చుంది!

సీటు వెనకాల టవల్ వుంది తల తడుచుకోండి ఇప్పటికే చిన్న సెలయేరులా వుందది అన్నాడు

సంధ్య తుడుచుకుంది!

మిమ్మల్ని ఒకటి రెండు సార్లు ఇదే బస్సుస్టాపులో చూశాను 'అన్నాడు కృష్ణమూర్తి

"నా ఆఫీసు టైము ఇదే...." అంది నవ్వేస్తూ!
"ఎక్కడ మీరు పని చేసేది...."
"ప్రైవేటు కంపెనీలో స్టెనో ని...."
"ఐ. సీ....."
కారుని ఒక హోటల్ ముందు ఆపాడు కృష్ణమూర్తి!
"జస్ట్ ఒన్ మినిట్....."
వెనకడోర్ తీసి ఫ్లాస్కు తీసుకున్నాడు! రెండు కప్పుల వేడి వేడి కాఫీ పోయించుకొచ్చాడు!
రెండు గ్లాసుల్లోకి దాన్ని ఒంపి ఆమె కొకటి ఇచ్చాడు!
"తీసుకోండి.... ఈ చలి తగ్గడానికి మందు...."
సంధ్య త్రాగసాగింది!
బయట వర్షం కొద్దిగా తగ్గింది. చల్లగాలికి తడి ఆరిన సంధ్య వెంట్రుకలు... నుదుటి మీద అందంగా కదలాడుతున్నాయి. తల వొంచుకుని త్రాగుతోంది! పొగల మధ్య అందంగా మెరుస్తున్న ఆమె ముఖం అతని మనసులో క్షణకాలం సంచలనాన్ని రేపింది!
గ్లాసుని వర్షం నీటితో కడిగి... అతని కిచ్చేస్తూ.....
"చాలా థాంక్సండీ" అంది నవ్వుతూ....
"ఈ మాత్రాని కేనా...." అన్నాడు...
"ఇది ... చాలా పెద్ద సహాయం. ఎన్నటికీ మరువలేనిది..."
నవ్వింది....
ఆ నవ్వుని.... ఆ రోజల్లా తలుచుకుంటూనే వున్నాడు!
ఆమెని ఆఫీసు దగ్గర దింపేశాక.... సంధ్య మళ్ళీ కృతజ్ఞతలు చెప్పింది.
"థాంక్స్ వద్దు! మళ్ళీ కనిపించండి... చాలు..." అన్నాడు.
"అలాగే మళ్ళీ నవ్వింది.
ఆ రాత్రి అతనిని నిద్రపోనివ్వ కుండా చేసిందా నవ్వు!

* * * * *

ఆ తర్వాత సంధ్య చాలా సార్లు కన్పించింది!
ఆమెను గురించిన వివరాలన్నీ తెలుసుకున్నాడు. సంధ్యకు తల్లీ దండ్రీ లేరు. మేనమామ దగ్గర పెరిగింది! అతను... డిగ్రీ చదివించి... వుద్యోగం చూపించి చేతులు దులుపు కున్నాడు! సంధ్య ఇప్పుడు ఆఫీసులో వుద్యోగం చేస్తూ.... వర్కింగ్ వుమన్ హాస్టల్లో వుంటోంది!
సంధ్య కథ తెలిశాక ఆమె పై అభిమానం రెట్టింపయింది!
ఒక్క రోజు సంధ్య కనబడక పోతే తోచేదికాదు....! తన స్థితి చూసి ఆశ్చర్యపడే వాడు కృష్ణమూర్తి. ముప్పై అయిదేళ్ళు వచ్చినా వరాయిస్త్రీ వేపు చూడకుండా గడిపాడు...
అతనికి తల్లి తప్ప.... మరే వ్యక్తితోనూ... సన్నిహిత పరిచయం లేదు. తల్లి పెళ్ళి చేసుకోమని ఎన్నోసార్లు పోరింది! ఎందరో అందమైన అమ్మాయిలను చూపింది... అయినా కృష్ణమూర్తి చలించలేదు... బింకంగానే వుండిపోయాడు!

పెళ్ళి మీదకు అతని మనస్సు పోయేది కాదు. తల్లికి ఇక విసుగొచ్చి చెప్పడం మానుకుంది.
ఇప్పుడు ప్రతిక్షణం సంధ్యతో గడపాలని పిస్తోంది! తనలోని మార్పుకు నవ్వుకున్నాడు కృష్ణమూర్తి!
"సంధ్యా, వచ్చే ఆదివారం మా ఇంటికిరా" సంధ్యతో పరిచయమైన నెలరోజుల తర్వాత అడిగాడు.
"ఎందుకు?"
"మా అమ్మకి పరిచయం చేస్తాను..." పైకి అని – మనసులో – 'కాబోయే కోడలుగా' అనుకున్నాడు!
"అలాగే....."
ఆదివారం పదిగంటలకు వచ్చింది. నీలం పట్టుచీర నీలం జాకట్టు – మెడలో ముత్యాలహారం .... నుదుటిపై ఎర్రబొట్టు.
అసలే అందమైన సంధ్య – ఆ రోజు... అద్భుతంగా కనబడింది!



"అమ్మా! ఈ అమ్మాయి నా స్నేహితురాలు.... పేరు సంధ్య...."అంటూ పరిచయం చేశాడు!

తల్లి ఆశ్చర్యంగా చూసింది.

ఆడపిల్ల పేరు చెప్తే ఆమడదూరం పారి పోయే కొడుక్కి అడ స్నేహితురాలా.... అనుకుంటూ కొడుకు వేపు గుచ్చి గుచ్చి చూసింది. కృష్ణమూర్తి సంధ్యవేపు ఆరాధనా పూర్వకంగా చూస్తున్నాడు.....

ఆమెకి సర్వం అర్థమైంది!

ఇన్నాళ్ళకి ... తన కొడుకు హృదయాన్ని కదిలించిన కరిగించిన సంధ్యపై అభిమానం కలిగింది!

ఆ రోజు సంధ్య అక్కడే భోజనం చేసింది. సాయంత్రం వరకూ ముగ్గురూ ఆనందంగా గడిపారు.

సంధ్య వెళ్ళాక తల్లి అంది....

"చాలా మంచి పిల్లరా! వుద్యోగం చేస్తున్నా గర్వం లేదు. పైగా చక్కటి చుక్క. ఎవరింటి కెడుతుందో గానీ.... ఆ చేసుకున్న వాడు చాలా అదృష్ట వంతుడు" అంది.... కొడుక్కి తన అభిప్రాయాన్ని సూచనగా అందిస్తూ!

కృష్ణమూర్తి తల్లికి సంధ్య నచ్చినందుకు ఆనందించాడు!

"అమ్మా నేనే ఆ అదృష్ట వంతుడిని" అని చెప్పాలన్పించింది!

కానీ సంధ్య మనసు తెలుసుకుంటే గానీ.... నిర్ణయాలకు రాకూడదని ఆగాడు!

సంధ్యతో సినిమాలు. షికార్లు... హోటల్లో డిన్నర్లు... ఆరు నెలలు . ఆరు క్షణాల్లా గడిచాయి.

ఒకరోజు సంధ్య ... రవిని తీసుకొచ్చి పరిచయం చేసింది.... 'మా దూరపు బంధు వండీ' అంటూ....

కృష్ణమూర్తికి ఆశ్చర్యం కలిగించింది.... 'సంధ్య తన కెవరూ లేరని చెప్పింది కదా! ఇతడెక్కడ నుండి వూడి పడ్డాడు....' అనుకున్నాడు.

కానీ సంధ్యనేం అడగలేదు.

వారం రోజులూ ముగ్గురూ కలిసి తిరిగారు.

'రవి శెలవు పెట్టి వచ్చాడు... ఇవ్వాళో రేపో

## రైతు

పొట్ట చేత పట్టుకొని
ఎటో పోదామంటే
పొలం వుంది!
పొలం పండించి
పొట్ట నింపుకొందామంటే
ప్రక్కనే
తుఫాను పొంచి వుంది!

—అడిగోపుల వెంకటరత్నమ్

# ప్రేమ లోని నీతి

వెడతాడని' చెప్పింది రెండురోజుల క్రితం....

బహుశా రవి ఈ రోజు వెడతాడేమో! అనుకుంటుండగా... సంధ్య తన నిర్ణయ మంటూ భయంకరమైన వార్త ను విన్పించింది!

ఈ మధ్య అమ్మ మళ్ళీ పెళ్ళి గొడవ మొదలు పెట్టడంతో – సంధ్యని వీలైనంత త్వరలో అడగాలను కుంటున్నాడు.

'సంధ్యతో పెళ్ళి విషయం ప్రస్తావించాలి. అది వినగానే సిగ్గుతో ఎర్రబడే ఆమె బుగ్గల్ని చూడాలి..." అని ఆశపడుతున్నాడు!

ప్రతిరోజూ వుదయం లేవగానే ఈ రోజైనా సంధ్యని అడగాలి' అనుకోవడం.... తీరా ఆమె ఎదుట నిలిచాక నోరు పెగలక అడగ లేక పోవడం జరుగు తోంది.

రవి వెళ్ళాక.... అడగాలి.... అనుకుంటుండగా ఈ పిడుగు పాటు..... ఆవేదనతో కృష్ణమూర్తి మనస్సు రగులుకు పోతోంది!

తన మనసుకు నచ్చిన స్త్రీని వివాహం చేసుకో లేక పోయానే అనే నిరాశ.... దిగులు.....

సంధ్య తనని మోసం చేసిందనే .... బాధ.... ఆ రాత్రి .. అతని మనస్సుని ముక్కలు చేశాయి... ఆ మానసిక బాధ... శారీరక జబ్బుగా పరిణమించింది....

తీవ్రమైన జ్వరంతో... మూసిన కన్ను తెరవకుండా మంచాన పడ్డాడు కృష్ణమూర్తి!

వారం రోజుల తర్వాత.... జ్వరం తగ్గింది....

"పుట్టినప్పటి నుండీ చిన్న రోగం కూడా ఎరగవు. నీకీ మాయదారి జ్వరం ఎలా వచ్చిందిరా.... " గ్లూకోజు త్రాగిస్తూ తల్లి అంది....

'దీనికి కారణం ... సంధ్య' అనుకున్నాడు!

గ్లూకోజు త్రాగాక.... కృష్ణమూర్తి పడుకున్నాడు!

తల్లి మంచం మీదే – ప్రక్కన కూర్చుంది.

"ఈ రోజు జ్వరం లేకపోతే రేపు పథ్యం పెట్టమన్నాడు డాక్టర్. ఈ రోజు ఎలా వుంది.... " నుదుటి మీద చెయ్యి వేసింది!

చల్లగా వుంది!

"ఈ వారం రోజులూ ఎంత గాబరా పడ్డానో తెలుసా. సంధ్య ప్రక్కన లేకపోతే నేనేమయ్యే దాన్నో?" అంది.

కృష్ణమూర్తి వులిక్కిపడ్డాడు!

"సంధ్యా!" అన్నాడు!

"అవున్రా! ఈ వారం రోజులూ శెలవు పెట్టింది! పిచ్చి పిల్ల.... నీ స్థితి చూసి ఏడ్చేసిందనుకో! .... " అంది.

సంధ్య పేరెత్తగానే అతని ఒళ్ళు భగభగ మండింది.

ఏడ్చిందిట..... ఏమి నటన? అనుకున్నాడు!

"ఈ వారం రోజులూ తిండీ నిద్రా లేకుండా నీకెంతో సేవ చేసిందిరా. ఇంక శెలవు లేదంటే.... నీకు కొద్దిగా తగ్గింది కదాని ఆఫీసుకెళ్ళమని నేనే బలవంతాన పంపాను. సంధ్యకి నువ్వంటే చాలా ప్రేమరా! తొందరలో ఆ పెళ్ళి కాస్తా జరిపిస్తే నా బరువు తీరుతుంది....." అంది!

తల్లి మాటలకు నవ్వాలో ఏడవాలో తెలీలేదు! అమ్మ ఇంకా అదే భ్రమలో వుందన్నమాట.... రవి– సంధ్యా పెళ్ళి చేసుకో బోతున్నారని తెలిస్తే.... అమ్మ ఏమంటుంది?...సంధ్యని ఎంత అసహ్యించు కుంటుందో....

"కాస్సేపు పడుకో బాబూ...."

సంధ్య తనని మోసం చెయ్యడమే కాదు.... అమ్మనీ మోసం చేస్తోంది! సంధ్య చేసే ఈ పాపానికి నిష్కృతి లేదు.... ఈ సారి తన కళ్ళబడనీ.... ఆమెని కరువుతీరా తిట్టి మనసులోని భారాన్ని దించుకోవాలి. అనుకుంటూ కళ్ళు మూసుకున్నాడు కృష్ణమూర్తి.

* * * * *

మర్నాడు – పథ్యం తిన్నాడు!

పగలు నిద్రపోకూడదని తల్లి చెప్తే.... నవల చదువుకుంటూ వచ్చే నిద్రని ఆపుకుంటూ..... అవస్థ పడుతున్నాడు.

అతనికి తెలీకుండానే కళ్ళు మూతలు పడుతున్నాయి.

గుమ్మందగ్గర అడుగుల చప్పుడు విన్పించింది!

"అమ్మ వస్తోందేమో! 'తను నిద్ర పోకూడదు.... అమ్మ వూరుకోదు.... ' అనుకుంటూ కళ్ళు విప్పాలని

ఇటీవల పర్లాకిమిడిలో జరిగిన కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ జయంత్యుత్సవంలో 'నీరాజనం' సంచికను ఆవిష్కరిస్తున్న భాస్కరరావు, కార్యనిర్వాహకులు రహంతుల్లా, అధ్యక్షులు శ్రీ దేవలపల్లి పార్థసారథిశర్మ, సంపాదకులు సామవేద రామమూర్తి శర్మ, షణ్ముఖశర్మ, కార్యదర్శి రమణమూర్తి చిత్రంలో ఉన్నారు.



# కోటయ్య అనుభవం- తన నోటనే విందాం.



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ల రైతులు.
ఎన్నాళ్లనుంచో మిత్రులు. ఒకసారి అనుకోకుండా కలిశారు...




























పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి.
లేదా ఏజెంటును కలవండి.



**న్యూ ఇండియా ఎష్యూరెన్స్**

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!

# ఇ·వేమన·పద్యాలు



కావి కోక గట్టి కడుయోగి వలె నుండి
వెనుక రాగరాగ విడిచిపెట్టి
తొడరి తిరుగువాడు దొంగ సన్యాసిరా
విశ్వదాభిరామ వినుర వేమ.

ప్రయత్నించాడు కానీ కళ్ళు విడివడలేదు

"అరె మేలుకుంటానని చెప్పి నిద్రపోతున్నారా! దొంగా–" వీణ మీటినట్లు సన్నగా మాటలు

ఆ వెనకే గలగలా నవ్వు విన్పించే సరికి చటుక్కున కళ్ళు తెరిచాడు!

ఎదురుగా సంధ్య!

అతని మత్తు పూర్తిగా విడిపోయింది!

ఆమె వేపు క్రోధంగా చూశాడు!

ఏదో అనబోయాడు కోపంగా

ఇంతలో సంధ్య చటుక్కున అతని పక్కలో కూర్చుని – అతని చేతిని పట్టుకుని చెంపకానించింది

## ప్రేమ లోని నీతి

కృష్ణమూర్తి చెయ్యి లాక్కోబోయాడు! కానీ ఆమె విడిచిపెట్టలేదు

ఇన్ని రోజులూ ఎంత కంగారు పడ్డానో! తెలుసా!

ఇవాళ నాకు కాస్త మనస్తిమితం చిక్కింది! అయినా ఒక్కసారిగా అంత జ్వరం ఎలా వచ్చిందబ్బా అంటూ నవ్వింది

ఆ మాటలు అమె చేతలు కృష్ణమూర్తికి కంపరం కలిగిస్తున్నాయి 'ఇన్నాళ్ళూ ఈ మాటలు విని మోస పోయాను... ఇంకానా ఈ మోసం 'అనుకున్నాడు!

సంధ్యా! అయిందా నీ నటన నువ్వు ఇంత బాగా నటిస్తావని తెలీదు! ఇన్నాళ్ళూ నన్ను ప్రేమించినట్లు నటించావు! నీ ప్రేమతో నన్ను పిచ్చివాడిని చేశావు నిన్ను చేసుకోవాలని కొండంత ఆశతో వున్న నన్ను ఆ కొండపైనుండి -- అగాధంలోకి తోసేశావు నీకెవురూ లేరని చెప్పి ఇప్పుడా రవిని తీసుకొచ్చి వాడిని చేసుకోబోతున్నావు. నన్ను సర్వనాశనం చేసి – నా మనస్సుని ముక్కలు చేసి మళ్ళీ – ఇప్పుడెందుకొచ్చావ్! మళ్ళీ మళ్ళీ మోసపోవడానికి నేనేం వెర్రివాడిని కాను దయచేసి ఇక – వెళ్ళు "

ఆవేశంతో వూగిపోయాడు!

అతని మాటలకు సంధ్య కోపగించుకోలేదు సిగ్గుతో తలొంచుకోలేదు!

కళ్ళు విప్పార్చుకుని ఆశ్చర్యంగా చూస్తోంది.

మధ్య మధ్య ఆనందంగా నవ్వుతోంది! అతని మాటలు విన్నాక – కృష్ణమూర్తి రెండు చేతులు పట్టుకుని హృదయానికి ఆనించుకుంది!

పరవశంగా కళ్ళు మూసుకుంది!

ఆమె చర్య అర్థం కాక తెల్లబోతు

"సంధ్యా" అన్నాడు కృష్ణమూర్తి.

"అమ్మయ్య చెప్పేశారు మీ నోటినుండి ఈ మాటలు వినాలని ఎన్నాళ్ళగానో ఎదురు చూశాను ఎంతగానో తపించాను ఇన్నాళ్ళకి నా కోరిక తీరింది. "

పారవశ్యంతో చెప్తోంది!

"సంధ్యా .'

"నన్ను చెప్పనివ్వండి 'మన మనస్సుల్లో ఒకరిపై ఒకరికి ప్రేమ వుంది! ఆడపిల్లని కాబట్టి సిగ్గుతో నేను బయట పడలేక పోయాను మీరు ప్రేమను వ్యక్తం చేస్తారేమో నని చూశాను కానీ ఇంత సన్నిహితంగా తిరుగుతున్నా ఒక రోజు కూడా నోరు విప్పలేదు చివరికిక లాభం లేదని – రవిని రప్పించాను రవి మా మామయ్య కొడుకు నాకంటి చిన్నవాడు– పైగా అతనికి పెళ్ళయింది కూడా. అతనిని చేసుకుంటానని చెప్పిన రోజయినా మీ మనస్సు బయట పెడ్తారనుకున్నాను. కానీ బయట పడలేదు మీలో మీరు మధనపడి జ్వరం తెచ్చుకున్నారు! పోనీ లెండి జరిగిందంతా మన మంచికే ఇప్పటికైనా మీ మనస్సు తెలియ చేశారు "

కృష్ణమూర్తి తెల్లబోయాడు!

అతనికంతా అయోమయంగా వుంది!

సంధ్య వేపే వెర్రిగా చూస్తున్నాడు!

సంధ్య అతని గుండెలపై తల పెట్టుకుంది!

దేవుడి దగ్గిరా! ప్రేయసి దగ్గిర మొహమాటం పనికిరాదు సార్ మొహమాట పడితే ఇదుగో ... ఇలాటి చిక్కులే వస్తాయి. తెలిసిందా... "

కిలకిలా నవ్వింది

ఆ నవ్వు అతనిపై టానిక్‌లా పనిచేసింది! జ్వరం – నీరసం ఆవేదనలూ– ఆవేశాలూ .. హరించి– అతనిలో మళ్ళీ ప్రేమను నింపింది! □

# నవనాగరికత నీడల్లో అండమానీయులు

మన దేశంలో జనాభా విపరీతంగా ఒక వైపు పెరిగిపోతూ ఉంటే అండమాన్ ద్వీప సముదాయంలో ఒకటైన "స్ట్రైట్ ఐలండ్"లో "గ్రేట్ అండమానీయులు" జాతి జనాభాను పెంచడానికి ప్రభుత్వం విపరీతంగా కృషి చేస్తూంది. శాస్త్రజ్ఞులు, వైద్యనిపుణులు, మానవ శాస్త్ర పరిశోధనా సంస్థ (ఆంత్రోపాలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా) వారు ఆ జాతి జనాభాను పెంచడానికి పరిశోధనలు మీద పరిశోధనలు చేస్తున్నారు.

## 20 వేల సంవత్సరాల చరిత్ర

"నీగ్రటో" జాతికి చెందిన వారని చరిత్ర చెపుతూంది. వీరికి ఇరవైవేల సంవత్సరాల చరిత్ర ఉందని శాస్త్రజ్ఞులు అంచనా.

బ్రౌ అన్న శాస్త్రవేత్త అండమానీయులు ఈ దీవులకు "అరకన్" ప్రాంతం నుంచి కాలి నడకన ప్రయాణంచేసి కానీ, చిన్న చిన్న పడవల్లో సముద్రం మీద ప్రయాణంచేసి కానీ ఈ దీవులకు చేరుకున్నారు" అని సిద్ధాంతీకరించారు.

వీరి ప్రశాంత జీవితాన్ని మొట్టమొదటసారిగా భంగపరిచిన వారు బ్రిటిషువారు. లెఫ్టినెంట్ బ్లెయిర్ ఇక్కడ మొట్టమొదటిసారిగా ఖైదీల స్థావరాన్ని ఏర్పాటుచేసినప్పుడు బయటివారు తమ ప్రాంతాన్ని ఆక్రమించడాన్ని సహజంగా భరించలేని అండమానీయులు బ్రిటిషు సైన్యాన్ని పురాతనమైన విల్లు, బాణాలు మొదలైన ఆయుధాలతో ఎదుర్కొన్నారు. బ్రిటిషువారు తుపాకీ గుళ్లతో సమాధానం చెప్పారు. ఆ తుపాకీ గుళ్లకి కొన్ని వేలమంది అండమానీయులు బలైపోయారు.

మిగిలిన అండమానీయులకు ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం నాగరికత నేర్పడానికి ప్రయత్నించండం మరొక ముఖ్య కారణం. వారు అడవుల మధ్య స్వేచ్ఛగా జీవనం గడిపేవారు. ఆ అడవుల్ని బ్రిటిషువారు నరికివేసారు. ఆ తర్వాత మలేరియా, మశూచి వంటి వ్యాధులు కూడా వీరికి ప్రాప్తించాయి. కంటిచూపు కూడా చాలామంది కోల్పోయారు. సిఫిలిస్‌లాంటి సుఖవ్యాధులు కూడా వీరికి ప్రాప్తించాయి. బ్రిటిషు సైనికులు వీరికి సారాయి, గంజాయి, నల్లమందులాంటి మత్తు పదార్థాలను అలవాటు చేశారు. పొగత్రాగడం అలవాటు నేర్పారు. వారి సహజ వాతావరణం, పరిసరాల్ని విడిచిపెట్టి ఎక్కడపడితే అక్కడ తిరిగి, ఏది దొరికితే అది తిని త్రాగడం నేర్చుకున్నారు. దానితో మొదలైంది ఈ జాతివారి పతనం.

## 4 వేల నుంచి 24కి తగ్గిపోయిన జనాభా!

జీవన సరళిలోని ఈ ఆకస్మిక మార్పుకు 19వ శతాబ్దంలో వీరి జనాభా నాలుగువేల నుండి రెండు వేలకు కుదించుకు పోయింది. 1864-1870 సంవత్సరాల మధ్య కాలంలో 150 మంది శిశువులు జన్మిస్తే, ఏ శిశువు కూడా రెండు సంవత్సరాల కంటే ఎక్కువ బ్రతకలేదట! 1971 జనాభా లెక్కల ప్రకారం వీరి సంఖ్య 24 గురు. వీరి రక్తాన్ని పరీక్షించగా తేలింది ఏమిటంటే నీగ్రటో, బర్మా, భారతీయుల రక్తాలు వీరిలో కలసి ఉన్నవట.

అండమానీయులు సహజంగా నల్లగా, పొట్టిగా దృఢంగా ఉంటారు. వీరు పందులను వేటాడి తింటారు. చెట్ల దుంపలను తినేవారు. చేపలు, నత్తలు, పీతలు మొదలైన సముద్ర ఆహారాన్ని ఇదివరలో ఆరగించేవారు. పొలం దున్నడం, చెట్లు పెంచడం వీరికి తెలియదు. ఇప్పుడిప్పుడే వ్యవసాయం చేయడం నేర్చుకున్నారు. అలంకరణ పట్ల వీరికి మోజు ఉంది. ఇప్పుడిప్పుడే వీరు మొహానికి పౌడరు రాసుకోవడం అలవాటు చేసుకుంటున్నారు.

సంతోష సమయాల్లో అంటే పెళ్లి, వేడుకల్లో ఆడా, మగా కలసి రాత్రి అంతా నాట్యం చేస్తూ, పాటలు పాడ్తారు. ప్రకృతిని ఆరాధిస్తారు. దుష్ట శక్తులంటే తగని భయం. పునర్జన్మలో మనలాగే వీరికి నమ్మకం ఉన్నది. కలల్ని నమ్ముతారు. కల్లా కపటం తెలియని అమాయకులు వీరు. బ్రిటిషు వారు ఆ రోజుల్లో రెచ్చగొట్టకపోతే వీరు అక్రమ చర్యలకు పాటుపడేవారు కాదు.

ఈ అమాయకుల జీవితాల్లోని సరదాలు మూడే మూడు. అవి - వేట, సంగీతం, నాట్యం. పగలంతా వేట, రాత్రి అంతా పాటలు పాడటం, నృత్యం చేయడం, పెద్ద పెద్ద చెట్ల బొదెలతో డప్పుల్లాంటివి చేసి, ఆ డప్పు మీద కర్రతో కొడుతూ ఆ శబ్దానికి అనుగుణంగా నాట్యం చేస్తారు.

## అతి తక్కువ జనాభాకల జాతి!

నేడు ప్రపంచంలో కెల్లా అతి తక్కువ జనాభాగల జాతి బహుశా ఇదేనేమో! ప్రస్తుతం వీరి సంఖ్య 27. ప్రభుత్వం వీరికి నవనాగరికత, అంటే బట్టలు కట్టుకోవడం, వంట చేసుకోవడం - వ్యవసాయం చేయడం నేర్పి, వీరందరికీ "స్ట్రైట్ ఐలండ్" అన్న ద్వీపంలో ప్రత్యేక వసతిని ఏర్పాటు చేసారు.

వీరి ఆరోగ్య పరిరక్షణకు వైద్య సదుపాయాల్ని కల్పించి, చిన్న పిల్లల బడిని, త్రాగడానికి నీరు విద్యుచ్ఛక్తి వంటి సౌకర్యాలను ఈ స్థావరంలో కల్పించి వారిని కంటికి రెప్పలా కాపాడుతూంది ప్రభుత్వం. కానీ ఈ కృత్రిమ వాతావరణంలో ఈ జాతి ఎంతో కాలం మనుగడ సాగించలేదని కొంతమంది అభిప్రాయం. అదే నిజమయితే మానవజాతి అనే వృక్షంలోని ఒక కొమ్మ రాలిపోయినట్లే!

— ఎస్. వి. ప్రసాద్

"స్ట్రైట్ ఐలండ్"



"స్ట్రైట్ ఐలండ్"లో ఉంటున్న అండమానీయులతో వ్యాస రచయిత (కుడి వైపు చివర)






(గత సంచిక తరువాయి)

యధావిధిగా కాలేజీలో అడుగు పెట్టాడు విజయ్ అవరణలో నే కొత్తగా లెక్చరర్ అయిన రామారావు గర్వంగా భుజాలు ఎగుర వేసి చిరునవ్వు నవ్వాడు ఆ నవ్వు విజయ్ గుండెల్లో తుపాకి గుండులా దూసుకు పోయింది కోపం హద్దు దాటింది ఆత్మాభిమానం బుస కొట్టింది అవమానం ఆరని గాయం అయింది అయినా తమాయించుకున్నాడు పరిస్థితులు ఆలోచించి. నెమ్మదిగా స్టాఫ్ రూము చేరాడు

"పేపర్ వేల్యూ ముగిసిందా?" హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటు ప్రశ్న

"అయింది సార్" విజయ్ సమాధానం.

"ఆ మార్కుల లిస్టు కాపీ యివ్వండి "

"అదింకా తయారు చేయలేదు ఓ గంటలో యిస్తాను "

' ఈ రోజు శోభనాద్రి లీవు ఆ క్లాసు మీరు తీసికోండి" హెడ్.

"అలాగే "

"క్లాసు ముగిశాక లిస్టు తయారు చేసి యివ్వండి '

"అలాగే సార్" క్లాస్ ముగిశాక బయట కొచ్చాడు విజయ్. ఆ కాలేజీలో బాగా సన్నిహిత మిత్రుడు రాంబాబు.

"హలో విజయ్, క్లాసు నుంచా

'అవును శోభనాద్రిగారు లీవు '

"కేంటీను కెళ్ళి వద్దాం రా" యిద్దరూ కాంటీన్ వైపు దారి తీశారు.

"ఏం విజయ్, ఆ విషయం గురించి ఏం ఆలోచించావ్?"

'ఏ విషయం?"

"నాకే ప్రశ్న వేశావా?"

"తెలియనప్పుడు అడిగి తెలుసుకోవటం ధర్మం కదా?'

'బాగుంది వరస, ఆ రామారావు పోస్టు విషయం."

"అదా?"

"ఏం అంత తేలిగ్గా తీసేశావు."

"అంత కంటే చేయగలిగింది లేదు గనుక "

"అంటే."

"రాము, పేదవారి కోపం పెదవికి చేటట తెలుసు గదా!"

"నీ వరస నాకేం అర్థం కాలేదు "

' ఇందులో అర్థం కావడానికేముంది రాము "

"ఏం కావాలి సార్" సర్వర్ ప్రశ్న

"వేడిగా ఏముందోయ్" రాంబాబు.

"నిజం చెప్పమన్నారా సార్?"

"అనే గదోయ్ "

"చాలా వేడిగా నిప్పుంది సార్ "

"ఓరి వెధవా నీక్కూడా పరిహాసంగా వుందా?" విజయ్ చిన్నగా నవ్వుతూ అన్నాడు

"గారె పకోడి సార్ "

"విజయ్ ఏం చెబుదాం?"

'నాకేం వద్దు కాఫీ చాలు "

"సరే రెండు కాఫీ" సర్వరు వెళ్ళిపోయాడు

"ఇంతకీ మనమెక్కడున్నాం" గుర్తు చేసికొని–

' నా మాట విను విజయ్, లాయర్ నోటీసివ్వు వీళ్ళకు బాగా బుద్ధి చెప్పాలి. నీవే గెలుస్తావ్ "

"నాకా నమ్మకం లేదు రాము "

"ఏం? యెందుకని? ధర్మం న్యాయం నీ ప్రక్కనున్నాయ్ "

'అదే నీ భ్రమ అవి నా ప్రక్క లేవు '

"అదేం మాట "

"వాటికీ భయమే అవి నాబోటి పేదవారి ప్రక్కకు తొంగి గూడా చూడవు ఎప్పుడూ గొప్పవారి ప్రక్కనే వుంటాయి '

"ఏమిటి విజయ్ వేడి చల్లారి పోయిందా?"

"పరిస్థితుల ప్రభావం '

"చూస్తూ చేతగాని వాడిలా వూరుకుంటావా?"

'అదే మంచి పని "

"విజయ్ నీ మాటలు నాకేం అర్థం కావడం లేదు "

"రాము, విధి నాపై కత్తి కట్టి సాధిస్తున్నది నేను దేనిలో చేయి పెట్టినా యెదురు దెబ్బ నాకే తగులుతూంది అందుకే బాగా ఆలోచించే యీ నిర్ణయాని కొచ్చి అసమర్థుడిగా మిగిలాను" అంతలో సర్వర్ కాఫీ తెచ్చాడు. తాగారిద్దరూ. మరేం 'మాటలు పెరగలేదు యిద్దరూ స్టాఫ్ రూం చేరారు లెక్చరర్లంతా

జరిగిన కథ-5: విజయ్,పావనిలు రిజిస్టర్ మేరేజి చేసుకున్నారు. విజయ్ ట్యూటర్‌గా ఒక కాలేజీలో ఉద్యోగంలో చేరుతాడు. రోజీ ఒక హోటల్ ప్రొప్రయిటర్ అయిన మాజీ మినిస్టర్‌కి సెక్రటరీగా చేరింది అత్తెసరు మార్కులతో పాసయిన దినేష్ తండ్రి పలుకుబడితో పోలీసు శాఖలో ఉన్నతోద్యోగంలో చేర్పాడు. మదన్ పూర్తిగా స్మగలింగ్‌లో కూరుకుపోయాడు ఆనందరావు ఒక వేశ్యతో చేయి కలిపి రాత్రి చీకటి వ్యాపారం ప్రారంభించాడు. పావనికి కవల పిల్లలు పుట్టారు బాబు పేరు వినోద్, పాప పేరు సునంద. విజయ్ తనకు లెక్చరర్ పోస్ట్ రాలేదని కృంగిపోతుంటే భర్తకి ధైర్యం చెపుతుంది పావని కానీ మనసులో ఆమె కుళ్ళి కుళ్ళి ఏడ్చింది.

వెళ్ళారు కుర్చీలన్నీ ఖాళీగా వున్నాయి

విజయ్ యీ వేళ పేపరు చూశావా? మాధవరావు ప్రశ్న

ఏమిటో విశేషం?" రాంబాబు మాధవరావు వంక చూస్తూ అడిగాడు

నీకూ, నాకూ కాదు విజయ్‌కే? మాధవరావ్ నవ్వుతూ అన్నాడు.

ఏమిటి మాధవా నువ్వనేది? విజయ్ అర్థంకాని విధంగా అడిగాడు

ఆర్ బి ఆఫీసర్స్ పోస్టులు పడ్డాయి

ఓస్ అంతేనా

'ఎంటి విజయ్ అంత తేలిగ్గా తీసేశావ్"

అబ్బే యేం లేదు"

విజయ్ వెంటనే అప్లయి చెయ్"

'ఎందుకు రిజిస్టరు ఖర్చులు దండుగ"

అవేం మాటలు విజయ్

"ఆ పోస్టులు ఎప్పుడో ఏ మినిష్టర్ కేండిడేట్సుకో రిజర్వు అయివుంటాయి.

నామ్‌కే వాస్తే యీ పిలుపు"

"నో విజయ్ అలా అనకు ప్లీజ్ నా మాట కాదనకు అప్లయి చేయి ఎందుకో నీకీ జాబ్ తప్పకుండా వస్తుందని నాకు గట్టి నమ్మకంగా వుంది'

"చేస్తాను కానీ ఓ షరతు

'ఏమిటి?"

"ఆ జాబ్ రాకపోతే ఖర్చులు నువ్విచ్చుకోవాలి"

'అలాగే"

"అయితే అప్లయి చేస్తాను'

"థాంక్సు"



ఆ జాబ్ వస్తే" రాంబాబు విజయ్ వంక చూస్తూ అన్నాడు.

మీ కందరికీ గ్రాండ్ పార్టీ యిస్తాను "

"విత్ బాటిలా" మాధవ్‌రావు నవ్వుతూ అన్నాడు.

"ఓ కె అలాగే" విజయ్ కూడా నవ్వాడు

మాధవ్‌రావు మాట ప్రకారం విజయ్ యిష్టం లేకపోయినా రిజర్వ్ బ్యాంకుకు అప్లయి చేశాడు అనుకోని విధంగా ఇంటర్వ్యూకి పిలుపొచ్చింది డబ్బు దండుగ వెళ్లకూడదని అనుకున్నాడు కాని రాంబాబు, మాధవరావుల ప్రోత్సాహంతో మద్రాసుకు బయలుదేరాడు

అన్ని కంపార్టుమెంటుల్లోనూ జనం కిటకిటలాడి పోతున్నారు. ఎక్కడెక్కాలాని కంగారు పడుతున్న విజయ్ భుజం మీద ఓ చేయి పడింది ఎవరా అని తిరిగి చూచి అదిరి పోయాడు

'రోజీ నువ్వా?"

రోజీ చాలా రిచ్‌గా కనుపించింది మెడలోని రత్నాల హారం వింత కాంతితో మెరిసి పోతున్నది

"ఆ నేనే యెక్కడి వరకు ప్రయాణం?'

"మద్రాసు "

'బాప్‌రే యీ రష్‌లోనా కమాన్" అంటూ అతనెంత చెప్పినా వినకుండా ఫస్ట్‌క్లాసుకు నడిచింది

'ఎక్కు

"నా టికెట్టు సెకండ్ క్లాస్ "

'ఫరవా లేదు యెక్కు" విజయ్ ఎక్కక తప్పలేదు రోజీ టి. సి తో యేం మాట్లాడిందో తెలియదు తిరిగి వచ్చింది

"రా విజయ్ కూచుందాం " యిద్దరూ కూర్చున్నారు.

"రోజీ ఎక్సెస్ డబ్బు "

'ఫర్వాలేదు వుంచు అవసర మొచ్చినప్పుడు తీసుకుంటాను అన్నట్టు అయిదేళ్ల తర్వాత కలుసుకున్నాం నాకెంత సంతోషంగా వుందో తెలుసా!'

"నిన్ను గుర్తు పట్టలేకపోయాను రోజీ."

నేను మాత్రం నిన్ను ఈజీగా గుర్తు పట్టాను "

"యెలా వుంది లైఫ్ "

ఫైన్ నీకు పెళ్లయిందా?'

"అయింది "

"పిల్లలెందరు?'

'ఇద్దరు "

"ఇంతకూ పావనేనా భార్య?"

"ఔను

గుడ్ పావనెలా వుంది?"

'బాగానే వుంది '

యింతకీ ఏం వుద్యోగం చేస్తున్నావ్ నీకేం బ్రిలియంట్‌వి డిస్టింక్షన్, యేదో పెద్ద వుద్యోగమే పట్టి వుంటావు యింతకూ మా పావని అదృష్టవంతురాలు" ఆమె మాటలు అతని గుండెల్లో బాకుల్లా దిగాయి

"ఏం మాట్లాడవు విజయ్ మద్రాసులో పనేమిటి?"

విజయ్ అంతా వివరించి చెప్పాడు వింటున్న రోజీ అదిరిపోయింది

'వ్వాట్ నువ్వు చెప్పిందంతా నిజమా?"

అక్షరాలా "

"నేను నమ్మలేను విజయ్ "

నమ్మినా నమ్మకున్నా యదార్థం "

"మై గాడ్ నీ కింత అన్యాయం జరిగిందా?"

'విజయ్ యింతకూ మద్రాస్‌లో తెలిసిన వాళ్లెవరయినా వున్నారా?"

"ఎవరూ లేరు.

"మరి ఈ ఉద్యోగం కోసం యేదయినా రికమండేషన్'

"నాకెవరున్నారు రోజీ రాదని తెలిసినా స్నేహితుల బలవంతం మీద చావని ఆశతో వెళుతున్నాను "

"నో నీకి వుద్యోగం తప్పక వస్తుంది

"అలా అనుకోవటం అత్యాశ

"కాదు కానే కాదు!" చాలాసేపు పూర్వమిత్రుల కబుర్లతో కాలం దొర్లిపోయింది తెలతెలవారుతుండగా రైలు మద్రాసుచేరింది యిద్దరూ దిగారు

"చాలా థేంక్స్, రోజీ వస్తాను" అన్నాడు విజయ్, రోజీకోసం కారులో ఎవరో కొంతమంది వచ్చినారు

"ఎక్కడికి? నిన్ను నేనంత సులభంగా వదలుతాననుకున్నావా? రా కారెక్కు" అంటూ బలవంతం చేసింది రోజీ ఎక్కక తప్పలేదు కారు వేగంగా ముందుకు కదిలింది

"నేనిక్కడుండేది రెండురోజులే అన్నట్టు నన్ను గురించి వివరాలేం అడుగలేదునువ్వు?

"చెప్పు రోజీ"

'నేను హోటల్లో వుద్యోగం అనటంకన్నా పార్టనర్‌తో సమానం అంటూ వివరాలు చెప్పింది

చాలా సంతోషం"

"ఆ పనిమీదొచ్చాను నీ యింటర్వ్యూ పూర్తికాగానే యీ వుద్యోగం నీకెలారాదో నే చూస్తాను

"రోజీ"

'భయపడకు అంతా మన చేతిలో మనుషులే"

'రోజీ ఒక్క మాట"

'అడుగు విజయ్"

"నువ్ పెళ్లెందుకు చేసుకోలా?"

"పిచ్చి ప్రశ్న విజయ్ ఈ నాగరికతా ప్రపంచం నాకు పెళ్ళివద్దంది అయినా భర్తతో సెటిల్ కావాలనుకునే వాళ్లకి పెళ్లి, నాలాంటి అంగడి బొమ్మకుకాదు" అంతలో హోటలు రానేవచ్చింది దిగారిద్దరూ

* * * * * *

రోజులు ముందుకు దొర్లిపోతున్నాయి విజయ్ మద్రాసు నుంచి వచ్చాడు మద్రాసుకు వెళ్లేటప్పటి విచారం అతని మనసులో లేదు చిరునవ్వుతో దిగాడు సునందా, బాబూ అంటూ ఆప్యాయంగా పిలిచాడు యింటిలో కాలుపెట్టిన మరుక్షణంలోనే పిలుపులో అనురాగం ఆప్యాయత కొట్టవచ్చినట్టు కన్పించాయి యింతటి ఆప్యాయతతో కూడిన పిలుపువిని పావని యెంతో కాలమయింది ఆమె మనసులో శతకోటి వీణలు ఒక్కసారిగా మోగాయి పిల్లలిద్దరినీ ఒకేసారిగా చేరదీసికొని ముద్దులాడాడు విజయ్

"ఏమండీ వెళ్లిన పని యేమయింది?'

"బాగానే జరిగింది"

నిజంగానా?"

'అంతా వివరంగా చెబుతాను ముందు స్నానానికి నీళ్ళుపెట్టు "

"అలాగే ఒక్క క్షణం " విజయ్ స్నానం ముగించి రాగానే కాఫీ అందించింది పావని కాఫీతాగి సూట్‌కేసు తెరిచి పావని యిది నీకు, యిది పిల్లలకు" అంటూ బట్టలతో పాటు స్వీట్సు, బొమ్మలూ అందించాడు విజయ్

"ఏమండీ నిజం చెప్పండి యింటర్వ్యూ సక్సెస్ కదూ?'

'పిచ్చీ అప్పుడే తెలుస్తుందా! భయంలేదు వుద్యోగం తప్పకుండా వస్తుంది"

"నిజంగానా యెంత మంచివార్త చెప్పారండీ పొంగిపోయింది

"అయితే ఈ వుద్యోగం వచ్చేది నీభర్త అర్హతలనుబట్టికాదు

"మరి?"

'మంచి రెకమెండేషన్ దొరికింది"

"రికమెండేషనా?

అలా ఆశ్చర్యపోకు కూర్చో నీతో చాలా మాట్లాడాలి" పావని నెమ్మదిగా

వచ్చి అతని ప్రక్కన కూచున్నది.

"పావనీ ఒక్కొక్కరిగురించి మనం చాలా తప్పంచనా వేస్తాం కాని నిజంగా వాళ్ళు మనం వూహించనంతటి ఎత్తుకు యెదిగిపోతారు."

"మీరు చెప్పేది నాకర్థం కావటంలేదండీ"

"దేవుడు నిజంగా నీవు పూజించే బొమ్మలో లేడు. మంచి మనసున్న మనసుల్లో వున్నాడు"

"మీరేమిటో యివాళ వేదాంతం మాట్లాడుతున్నారు."

"సత్యాన్ని ఆలస్యంగా తెలుసుకున్నాగదూ!"

"యేమిటండీ ఆ సత్యం?"

"అనుకోని విధంగా రోజీ కలిసింది."

"ఆ రోజీయా ఎలావుందండి?"

"అబ్బా నిజంగా స్నేహమంటే రోజీదే. నువంటే యెంతప్రేమ? పొద్దాకా నీ మాటే. ఆ చీరవిప్పి చూశావా?" పేకెట్ వూడదీశాడు. పట్టుచీర అది "నీకు పట్టుచీర అంటే యిష్టమట. అబ్బా యెంత చెప్పినా వింటేగా! యెన్ని కొట్లు తిరిగిందో నీ కలరుకు మ్యాచ్ అయేలా కావాలని. చివరకు అయిష్టంగానే యిది తీసింది. ఆమె అనుకున్న కలరు దొరకలేదట. దీనిఖరీదు ఏడువందలు. అంతేనా పిల్లలకు బట్టలూ మిఠాయిలూ. అబ్బా ఆ ఆప్యాయత మరపురానిది"

అందంగా నిలిచింది. విజయ్ కాలేజీకి వెళ్ళాడు.

"హలో విజయ్ ఎప్పుడు రావటం?" రాంబాబు ప్రశ్న.

"ఈ రోజు వుదయమే"

"మొన్నే వస్తానని చెప్పావ్?"

"రావటానికి వీలుపడలేదు."

"సినిమా యాక్టర్ని, షూటింగులూ చూస్తూ కూచున్నావా?" రాంబాబుకు సినిమాలన్నా. తారలన్నా చాలా యిష్టం. అతనుకూడా నటుడిగా రంగంపై మకుటంలేని మహారాజుగా నిలవాలని ఆశపడ్డాడు కాని జరుగలేదు.

"నీ బుద్ధి పోనిచ్చుకున్నావుకాదు"

"విజయ్ యింటర్వ్యూ యెలా జరిగింది?" మాధవరావు ప్రశ్న.

"బాగానే జరిగింది"

"నీకు జాబ్ ష్యూర్" మాధవరావు ఖచ్చితంగా అన్నాడు.

"ఏమిటో ఆ గ్యారంటీ?"

"అది నాకే తెలియదు"

"ఏంరా మాట్లాడవు సినిమా తారల్ని చూశావా?" రాంబాబు మళ్ళీ అడిగాడు.

"ఆ చూసాను"

## గడుసులోకం —బాబు







"ఎలావుంది? బాగుందా? చూసి అయిదేళ్ళయింద" కండ్లలో ఆనందబాష్పాలు.

"ఆ చాలా బాగుంది. నన్ను ఫస్టుక్లాసు కంపార్టుమెంటులో తీసుకెళ్ళి మళ్ళీదానిలోనే పంపింది. కారులో తప్ప క్రింద నడవనివ్వలేదు. యీ వుద్యోగం నీకెలారాదో చూస్తానని పంతం పట్టింది మినిష్టర్‌తో సంప్రదిస్తానంది. అబ్బా నిజంగా రోజీ యెంత యెదిగిపోయిందో?"

"నిజంగానా? దాని మనస్సెప్పుడూ మంచిదే. మీరు చెబుతూంటే దాన్ని ఒక్కసారి చూడాలని యెంతో కోరికగా వుందండీ."

"తప్పకుండా వస్తానంది. నిన్నూ పిల్లల్ని చూడాలని యెంతో ఆరాటపడింది. నెలతిరక్కుండానే ఆర్డర్సు పంపే యేర్పాటు చేస్తానంది."

"రోజీ నీవు నిజంగా దేవతవే. అన్నట్టు రోజీకి పెళ్ళయిందాండీ. పిల్లలెందరట, భర్తేం చేస్తున్నాడు? అన్ని ప్రశ్నలూ ఒకేసారి వేసింది పావని.

"రోజీ పెళ్ళి చేసుకోలేదట బహుశా చేసుకోననే చెప్పింది."

"మొదటినుండీ అలాగే చెప్పేది చివరకు దానిమాటే నిలబెట్టుకుంది"

"సరే కాలేజీకి టైమవుతూంది"

"వంట సిద్ధంగానే వుంది రండి వడ్డిస్తాను."

ఆ రోజు పావనిని సంతోషం వుక్కిరిబిక్కిరి చేసింది. రోజీ రూపం కళ్ళల్లో

"ఎవరెవర్ని?"

"నీ అభిమాన కథానాయకిని."

" అదృష్టవంతుడివిరా"

"అలాగా. మాట్లాడానుకూడా"

"అబ్బా అబ్బా ఏంచాన్సురా?"

"ఛీ పోరా యింతచదివీ యింత వయసొచ్చీ, ముగ్గురి బిడ్డల తండ్రివి నీకు యింకా యీ వెధవ పిచ్చిపోలేదేమిటిరా? వాళ్ళను చూడటం అదృష్టమా?"

"కాదా మరి?"

"నోర్ముయ్యరా వాళ్ళ బ్రతుకులూ ఓ బ్రతుకేనా?"

"ఏం మాటలురా అవి" రాంబాబు నొచ్చుకుంటూ అన్నాడు.

"సినిమా కొకడితో నటిస్తూ కేరక్టరు నాశనం చేసుకొని బ్రతుకుతున్నారు. వాళ్ళూ ఒక మనుషులే!"

"నోర్ముయ్యరా నాకోపం వచ్చిందంటే మళ్ళీ.... కళరా కళ"

"అబ్బా పెద్ద కళనుఉద్ధరించేవాడు బయలుదేరాడు" విజయ్ చిరునవ్వు.

"సరేలే గొడవెందుకు క్లాసులేదా?" మాధవరావు ప్రశ్న.

"అన్నట్టు మరిచేపోయా ఫస్టవరు వుంది గురూ" దాదాపు పరుగెడుతూ వెళ్ళాడు రాంబాబు. చూస్తున్న యిద్దరికీ నవ్వాగలేదు.

# శపథమే నా పథం

నేను పుట్టిన నేల తల్లికి
నిండుగా కైదండ లిడుదును,
తల్లి గుండెల పరిమళాలను
తమ్ములందరి కంద చేతును
నేల తల్లికి చెరుపు చేసే
దుష్టులను దునుమాడి గెలుతును–
దేశమాత సమగ్ర సౌష్టవ
రూపమును కాపాడెదన్.....

మానవతనే మంట కలిపే
మతదురంతము నతకరింతును
వర్తమాన చరిత్ర తలపై
గత పిశాచిని తొలగద్రోతును.....
నేల తల్లి తనూజాలందరు
అన్నదమ్ముల ఆత్మ బంధము
పెనచి ఒకటై సంపదల, సృజి
యించు మంచికి పోరెదన్!

లేమిగల నాదారులను – ధన
బలముగల పీడకులు దోచని
సర్వ తంత్ర సమానధర్మము
విలసిలగ పోరాడెదన్. .
శ్రామికుల హాళికుల నొక్కట
కూర్చి, నూతన జన స్వామ్యము–
ఈ పురాతన భరత భూమిని
స్వర్ణ పథముగ మార్చెదన్...

–సోమసుందర్

## పావని

వీడికి పిచ్చి వదల్చుసుమా విజయ్ నవ్వుతూ అన్నాడు

ఎవరి పిచ్చి వారి కానందమని వూరికినే అన్నారా!" మాధవరావ్ శృతికలిపాడు

అంతేనంటావా?

అంతే మరి యింకా ఏమిటి విశేషాలు మనిద్దరికీ ఫస్టవరులేదు పదరా కాంటీనుకెళ్ళి వద్దాం, నెమ్మదిగా నడిచారు

★ ★ ★ ★ ★ ★

అనుకోని విధంగా స్పెషల్ పార్టీతో కలిసి పోలీస్ ఆఫీసర్ దినేష్ హోటల్ స్వర్గంమీద దాడి జరిపాడు అర్ధరాత్రి 12 గంటల వ్యవధిలో అన్ని వ్యవహారాలు చూసుకునే రోజీ హోటల్లో పదిమంది అమెరికన్సుతో పార్టీలో వుంది అందరూ మత్తుగా మందుతాగారు ఆ పదిమందిలో స్కార్ అనే అతనిదృష్టి రోజీమీదనే నిలిచింది

మిస్ రోజీ ఐ లైక్ యూ

థాంక్స్

ఐ వాంట్ యూ

చిరునవ్వు నవ్వింది రోజీ ఆ చిరునవ్వు అతనికి యెక్కడలేని ధైర్యాన్నిచ్చింది నెమ్మదిగా రోజీ భుజంపై చేయివేసి ముద్దుపెట్టుకున్నాడు అభ్యంతరం చెప్పలేదు అతని యెర్రని శరీరం, పెదవులూ, రాగిజుట్టూ ఆమెను ఓ విధంగా ఆకర్షించాయి నెమ్మదిగా యిద్దరూ తడబడుతూ గదిలోకి చేరారు తలుపులు మూశారు స్ప్రింగ్‌కాట్ మృదర్పి ఆహ్వానించింది స్కార్ చేతుల్లో రోజీ, రోజీ కౌగిలిలో స్కార్ చెప్పలేని అమరసుఖం అనుభవిస్తున్నారు

'రోజీ ఐ వాంట్ టు మేరీ యూ

'రియల్లీ" చిరునవ్వు చిందించింది

ఎస్ గట్టిగా హృదయాని కద్దుకున్నాడు

అంతలో దడ దడా తలుపుల చప్పుడు బట్టలు సర్దుకుని నెమ్మదిగావెళ్ళి తలుపు తెరిచింది యెదురుగా పోలీస్ యూనిఫాంలో దినేష్ అతన్నిచూచి రోజీ రోజీని చూచి దినేష్ అదిరిపోయారు

"రోజీ నువ్వా?

"ఎస్ నేనే"

వ్యభిచారం, మరియు బాధ్యత మరచి హోటల్లో పార్టీలు జరిపి మితిమీరి త్రాగి తందనాలాడుతున్నందుకూ రెండు నేరాలు చేసినందుకు రోజీని అరెస్టుచేసి వేన్ ఎక్కించవలసి వచ్చింది దినేష్ గుండెల్లో బాధ బాధ్యతా రెండూ రేస్ గుర్రాల్లాగా పరుగెత్తాయి

"రోజీ నన్ను క్షమించు నా డ్యూటీ

"డోంట్ వర్రీ" తాపీగా సమాధానమిచ్చింది

పోలీస్‌వేన్ వచ్చి స్టేషన్ ముందాగింది రోజీ దిగింది లోనికి నడిచింది

'టేక్ యువర్ సీట్ "

థాంక్యూ రోజీ కూర్చుంది

"రోజీ నిన్ను యిలా కలుసుకుంటానని

బాధపడకు దినేష్ యేదో విధంగా కలుసుకున్నాం

ఆ హోటలు

"పూర్తిగా నాదికాదు పార్టనర్ని'

మరి యీ పని'

"వచ్చిన అతిథుల మర్యాద చేయటం నా ధర్మం

ఇలా శీలాన్ని అమ్ముకోవటం"

"దినేష్ ఆ మాటే అనొద్దు డబ్బుకోసం నేనేనాడూ నా శీలాన్ని అమ్ముకోలేదు'

'అంటే యిష్టపడే యిలా చేశావా?"

"ఔను "

'రోజీ అదెంత నేరమో!"

' నాకు తెలుసు

తెలిసే యిలా'

చెప్పాగా అది మీ దృష్టిలో తప్పుకావచ్చు కానీ నా దృష్టిలో తప్పుకాదు

'రోజీ నీవు మరీ మొండిగా మాట్లాడుతున్నావు

' దినేష్ నేనో ప్రశ్న అడుగుతాను సరయిన సమాధానం చెబుతావా?

"తప్పకుండా"

మీ డిపార్ట్‌మెంటు చేసేదంతా న్యాయం, ధర్మం అనే నీ వుద్దేశ్యమా?'

"తప్పకుండా'

సమర్థించకు ఎంతోమంది పోలీసధికారులకు యీ చేతులతో లంచాలిచ్చాను తీసికొని చక్కా పోయారు మరి వారు వారిధర్మాన్ని నిర్వహించలేదే?"

' రోజీ '

'సమర్థించినా నే నొప్పుకోను కనీసం నీవయినా మంచి ఆఫీసరుగా పేరు తెచ్చుకో త్వరగా ప్రమోషన్ సంపాదించుకో

"రోజీ నన్ను"

"తప్పుగామాత్రం అర్ధం చేసుకోను'

అంతల్లో ఫోను మోగింది హలో దినేష్ హియర్' అవతలనుంచి వచ్చే సంభాషణ చాలా ఘాటుగా వుంది స్వర్గం హోటలుమీద దాడిజరిపినందుకూ రోజీని అరెస్టు చేసినందుకూ పైలివల్లో చాలా గద్దుగా మాటలు

"యెస్ సార్ అలాగే చేస్తాను" ఫోన్‌లో మాట్లాడుతున్న దినేష్ ముఖంలో

కొట్టవచ్చినట్టు మార్పు కనబడింది.

"యెక్కడినుంచి ఫోన్ దినేష్?" రోజీ అతి శాంతంగా ప్రశ్నించింది

"క్షమించు రోజీ

"ఎందుకు"

"నీ గురించి తెలుసుకోకుండా యిలా చేసినందుకు"

నీ డ్యూటీ నువ్వు చేశావు యిందులో తప్పేంలేదే?'

"ఉందో లేదో కమాన్'

"ఎక్కడికి?"

"నిన్ను మీ హొటల్ వద్ద దించి రావాలి "

"పూర్ దినేష్" కారెక్కింది

"యీ విషయంపై నాకు పనిష్మెంటు తప్పదు, బహుశా సస్పెండ్ చెయ్యవచ్చు" దినేష్ దిగులుగా అన్నాడు.

"భయపడకు అంతదాకా రానివ్వను యెందుకో తెలుసా? మనమంతా ఒకే చోట కలసి చదువుకున్నాం. నేనింకా మర్చిపోలేదావిషయం "

'చాలా థాంక్స్"

"మెన్షన్ నాట్ వస్తాను' దిగింది

★ ★ ★ ★ ★ ★

"పోస్టు" అంటూ కేక వినిపించింది

"పావనీ 'చూడు' కాలేజీకి వెళ్ళటానికి డ్రెస్ వేసుకుంటూ అన్నాడు విజయ్

' రిజిస్టరమ్మా" పోస్టుమన్ బదులు

"ఇలా తే" పావని చేయిచాపింది.

"విజయ్‌గారి పేరుంది సంతకం వారిది కావాలి."

"ఏమండీ మీకే రిజిస్టరు కవరు" కేకేసింది

"రిజిస్టరా!' టవల్ భుజంపై వేసుకొని వచ్చాడు

' ఏదీ, అంటూ సంతకం చేసి కవరందుకొని"–

"ఎక్కడి నుంచండీ"

"చూడనీ" కవరుచించి చదువుతున్న అతని ముఖంలో దీపావళీ–పౌర్ణమినాటి చంద్రుడూ ఒకేసారి వెలిగారు.

"పావనీ సక్సెస్" అంటూ పావన్ని తన రెండు చేతులో పైకెత్తాడు.

"అబ్బా ఏమిటండీ?"

"అర్. బి. జాబ్ వచ్చింది యిదో అర్డర్సు"

"నిజంగానా?"

"నిజం చూడు" అందించాడు

"భగవంతుడా మా మొరాలకించావా!" పావని కన్నుల్లో అనందాశ్రువులు నిండినవి

"మొరాలకించింది నీ భగవంతుడుకాదు, రోజీ"

"భగవంతుడే రోజీ రూపంలో తోడు నిలిచాడు " రోజీకి కృతజ్ఞతలర్పించింది

"రెండు రోజులే వ్యవధి వెళ్ళి చేరాలి. త్వరగా కాలేజీకి వెళ్ళి అందరికీ చెప్పి రిజైన్ చేసివస్తాను" సంతోషంగా వెళ్ళబోయాడు

"ఏమండీ భోజనం?"

"వద్దు కడుపంతా సంతోషంతో నిండిపోయింది "

"కొద్దిగా తినెళ్ళండి '

"ఖాళీలేదు ప్లీజ్'

ఆ రోజు పావని ముఖంలో కళ నిండుగా తాండవం చేసింది. పిల్లలిద్దర్నీ ముద్దుల్లో ముంచేసింది తలారా స్నానంచేసి పూజచేసి పరమాన్నం వండి నైవేద్యంపెట్టింది రోజీ తనకనిపంపిన పట్టుచీర కట్టుకొని పూలుపెట్టుకొంది

★ ★ ★ ★ ★ ★

సంతోషం ముఖంలో వుక్కిరిబిక్కిరి కాగా పెద్ద పెద్ద అంగలతో కాలేజీ చేరాడు విజయ్

"రామూ, మాధవ్."

"యేమిటి విజయ్ ఆ సంతోషం? యిద్దరూ ఒకేసారన్నారు

"ఒరేయ్ అర్ బి జాబ్ వచ్చింది యిదో అర్డరు"

"కంగ్రాచ్‌లేషన్సు" యిద్దరూ ఒకేసారి చెప్పారు.

"చాలా సంతోషం విజయ్ పదిహేను వందల రూపాయల జీతగాడివి"

"ఇక మాకో మంచిఫ్రెండ్ మద్రాసులో ప్రతి వేసవి శెలవులకూ వెళ్ళవచ్చు" మాధవరావు నవ్వుతూ అన్నాడు

' తప్పకుండా" విజయ్ కూడా నవ్వుతూనే అన్నాడు.

"యింకా రెండు రోజులే వ్యవధి మరెప్పుడు బయలుదేరుతావ్" రాంబాబు ప్రశ్న

"రేపు రాత్రికి'

"ఫేమిలీ?"

"ముందు నేవెళ్ళిచేరి యిల్లూ అదీ చూసి ఓ వారం సెలవుపెట్టి వస్తాను ఫేమిలీని తీసుక వెళ్ళడానికి "

"లక్కీ ఫెలో" రాంబాబు విజయ్‌చేయి నొక్కుతూ అన్నాడు.

"లక్కీ కాదురా వాడి గొప్పతనం యిన్నాళ్ళకు గుర్తించారు అంతే" అన్నాడు మాధవరావు.

"ఈ రోజే రిజైన్ చేద్దామనుకుంటున్నా" విజయ్ వారితో అన్నాడు.

"వెంటనే రాసి ప్రిన్సిపాల్ ముఖంమీద పారెయ్' మాధవరావు కోపంతో పలికాడు.

"అవేం మాటలురా?"

"మాటలుకాదురా బాధ. వీడి కంతా కలసి అన్యాయం చేశారు "

"యిప్పుడవన్నీ దేనికిరా గొప్ప జాబ్ వచ్చిందిగా!"

"రాదా మరి వాడు గోల్డ్‌మెడల్ విద్యార్థిరా"

అరోజే రిజైన్ చేశాడు విజయ్ అందరూ బాధపడ్డారు

(ఇంకా ఉంది)






# ప్రశ్నావళి



- కె. రామలక్ష్మి

### ఎమ్.వి. హైదరాబాదు

★ వేదికపై కూర్చోపెట్టి పొగిడేస్తుంటారే- (సినిమావాళ్ళు మరీను) అనాగరికంగా అనిపించదా?

● ఎందుకనిపించదు? కాని కొందరి కళా పొగిడించుకోడం- ఉత్తేజాన్నిస్తుందంటారు అసలు పొగడ్త చాలా డేంజరస్. మంచి వాడిని యింకా మంచివాడిగా చేసినా- చెడ్డవాడినింకా దిగజార్చేస్తుంది!

### డి.వి. రాయగడ

★ పత్రికలలో ఎక్కువగా వాడబడుతున్న సామాజిక స్పృహ అనే పదమునకు అర్థం ఏమిటి?

● నాకు తెలిసినంతవరకూ తన చుట్టూ జరుగుతున్నది తెలుసుకొని ఉండడం- సామాజిక స్పృహ కల్గి వుండడం మరి ఏవి ఇజాలవారు- ఏవి అర్థాలతో వాడుతారో నాకు- తెలియదు

### ఎన్.ఎస్.కె. కొత్తగూడెం

★ అసలు స్కూలు రిజిస్టరులో కులాన్ని పేర్కొనడం రద్దు చేయాలి మీ అభిప్రాయం?

● చెయ్యొరు చేస్తే ఒట్టప్పుడు కష్టపడాలి

### ఆర్.వి.వి.ఆర్. సికింద్రాబాదు

★ జీవితం అంటే రోత పుట్టుతోంది ఏ మూలా ఉత్సాహం కనబడడం లేదు

● మరి ఇలా నిస్త్రాణ అయితే ఎలా? ప్రతిరోజూ- జీవించడం నేర్చుకోవాలి జీవితం అంటే ఏమిటి? మళ్ళీ మళ్ళీ వచ్చే రోజులే కదా?

### డి.ఆర్. బళ్ళారి

★ నేను ఎప్పుడూ ఎన్నడూ చావుకి భయపడను ప్రస్తుతం నాలాగా ఎవరైనా వుంటే ధైర్యంగా చెప్పండి

● సరిరారు నీకెవ్వరూ!!

★ మీ ప్రశ్నావళిలో ఒక ఉత్తమ ప్రశ్నకు పది రూపాయల బహుమతి ఎందుకు ప్రకటించ కూడదు?

● ప్రకటించి- కొరివితో తల గోక్కోమంటారా!!

★ నేడు సినిమాలలో నటించే హీరోయిన్లకు, ఒళ్ళు అమ్ముకునే వారికి- తేడా ఏమిటి?

● వారిది కళాపోషణ! వీరిది ఉదరపోషణ

★ మీ బలహీనతలు ఏమిటి?

● ఏంలేవు – కబుర్లు చెప్పడం తప్ప!

### వి. వి. ఎ. కె. టెక్కలి

★ రామలక్ష్మి గారూ మీరెందుకు పెళ్ళి చేసుకోలేదు?

● మరిచి పోయాను చిట్టి తల్లీ!?

### కె. పి. ఎమ్మిగనూరు

★ నానాటికి దిగజారి పోతున్న తెలుగు సినిమాలపై మీ అభిప్రాయం?

● ప్రేక్షకాభిరుచికి తగ్గట్టు తీస్తున్నాం అంటున్నారు తీసే వాళ్ళు.

★ జీవితంలో ఎందుకు ఉపయోగ పడని సూత్రాలు, సమీకరణలు చదువులలో ఎందుకు?

● అందుకే ఉద్యోగానికి డిగ్రీకి సంబంధాన్ని తెంచాలనే ప్రయత్నాలు చేస్తున్నారు

### ఆర్. వి. కోటబొమ్మాళి

★ మగ పిల్లవాడు పుడితే వంశోద్ధారకుడు పుట్టాడని తల్లి తండ్రులు ఆశ పడతారు. ఆడపిల్ల పుడితే ఇంటిని గుల్ల చేస్తుందని బాధ పడతారు. దానిపై మీ అభిప్రాయం?

●. తెలివితక్కువ తనం . అలా అనుకునేలాగ చేస్తుంది. ఏం అమ్మాయినీ అబ్బాయిలా పెంచి చూడ కూడదా? నిజా నిజాలు తెలుస్తాయి. ఇలాంటి దృక్పథం ఉండబట్టే – ఆడపిల్లల స్థితినాడిలా అధ్వాన్నంగా తయారైంది- నవమాసాలు మోసి ప్రసవ వేదన పడి- కన్న బిడ్డ ఏ బిడ్డ అయితే నేం? అనిపిస్తుంది – తల్లికి.

### కె. యం. ఎమ్మిగనూరు

★ మనుషుల స్వార్థం పెరిగితే,

● కసాయిగా మారుతాడు.

★ మనిషి విలువ ఎప్పుడు పెరుగుతుంది?

● ఈ రోజుల్లో డబ్బు పెంచుతోంది – మనిషి విలువ

★ మనిషి కోరికలకి అంతం ఎప్పుడు?

● చివరి శ్వాస కూడా పోయాక!

★ అన్న వేషాల పరమార్థం?

● ఎవరి పిచ్చి వారి కానందం అని మనం ఊరుకోవడం ఉత్తమం కదా?!

★ కాలానికి ఎదురీద కల్గితే-

● కష్టాలకి భయం పోతుంది

★ జీవితమే ఒక నాటకం అయితే దానికి సూత్రధారి ఎవరు?

● ఎవరికి వారే సూత్ర ధారులు. కాని మగాడికి తన జీవితానికి తన స్త్రీ జీవితానికి కూడా తానే సూత్ర ధారి కావాలని పెద్ద కోరిక!

★ కలకాలం నిలిచేది?

● మంచి మాట.

★ అర్ధ రాత్రి సూర్యోదయం? కామెంట్-

● అంతేకద మరి?

### పి. ఎన్. గుంటూరు

★ అసలు మగవాడికి కట్నం ఎందుకు యివ్వాలి?

● అతని అసమర్థతకి విలువ కట్టి యిస్తున్నాం అనుకోవాలంతే. వేరే కారణం కనబడదు

### కె. ఎస్. ఆర్. ద్రాక్షారామం

★ మీరు తొలిసారి కలం పట్టి వ్యాసరచన చేసే అవకాశం ఎప్పుడు కల్గింది?

● 1951లో రేడియో కోసం వ్యాసం రాశాను. బి. ఏ. ఫైనలియర్ లో వుండేదాన్ని. అప్పటి నుండి రేడియోలో పాల్గొంటూనే వున్నా, కాని గత పదేండ్లుగా 'మహిళా మండలి'కో అంకితం కారాదని ఆ కార్యక్రమాలు స్వీకరించడం లేదు. మరీ అత్తగారు కొత్త కోడలు, ఉపయుక్తమైన కళలు- జాడీలకు మూతలు, మరీ చిట్టి చిట్టి పాపలకి చూళ్ళు కబుర్లు చెప్పున్నట్టుగా వుందీ నాటి మద్రాసు కేంద్ర మహిళా మండలి కార్యక్రమం. మొన్న వరలక్ష్మి వ్రతానికి – "పిండి వంటలు పళ్ళెంలో పెట్టండర్రా" అంటూ సొజ్జప్పాలూ, అరిసెలూ . రామ .. రామ విసుగేసింది. మహిళలు- వయోజనులు కానట్టు! లేదా, మహిళల కింత కంటే ఏం అక్కర్లేదన్నట్టుంటూంది. పట్టించుకునే దిక్కు లేదు. □





ఈ రెండంతస్తుల మేడని పడగొట్టి దాని స్థానే ఏడంతస్తుల మేడ కట్టివ్వు!!
అది అసాధ్యం దొరా!! దాన్ని నాగార్జున సిమెంటుతో కట్టాను! కావలిస్తే దాని పక్కనే యింకోటి కట్టిస్తా! సరేనా?
MAM-34

# అడుగుజాడలు

## "ఆకెళ్ళ"

చిమ్మ చీకటి. అమావాస్య రోజులు. నక్షత్రాలు కూడా అక్కడొకటి అక్కడొకటి మిణుకు మిణుకుమంటున్నాయి. రామచంద్రయ్యగారు- వడివడిగా అడుగులేస్తున్నారు. ఊరికి- గూడెనికి మధ్య చాలా దూరమే ఉంది. కీచురాళ్ళరొద తప్పించి జనసంచారంలేదు. ఊరప్పుడే నిద్రలో జోగుతోంది.

దూరంగా గూడెంలో దీపాలు మిణుకు మిణుకుమంటున్నాయి. 'బయల్దేరేటప్పుడు దీపం అయినా తెచ్చుకోవాల్సింది' రామచంద్రయ్యగారు గొణుక్కున్నారు. కాని కబురందగానే ఆయనకి కాళ్ళూ చేతులు ఆడలేదు.

"మంత్రాల మారయ్య మిమ్మల్నోపాలి నుంచున్నపాటున రమ్మన్నారండి" గూడెం నించి వచ్చిన మనిషి వగరుస్తూ చెప్పేసరికి ఆరిబయట మంచంమీద నడుం వాల్చబోతున్న రామచంద్రయ్యగారు ఉలిక్కిపడ్డారు.

"ఏమిటి?" నాలిక పొడి ఆరిపోతుంటే పశ్నించేరు "ఏమోనండి! మిమ్మల్ని ఉన్నపాలిన రమ్మన్నాడండి" మరో పశ్న రామచంద్రయ్యగారు వేసేలోపున ఆ మనిషి వచ్చినంత వేగంగాను వెళ్ళిపోయాడు.

ఎందుకంత అర్జంటుగా రమ్మని ఉంటాడో ఊహించిన తర్వాత గుండె ఝల్లుమంది. 'ఏం జరగలేదుకదా?' కంగారుగా మంచందిగి ఉన్నపాటునే బయల్దేరిపోయారాయన.

పట్నంలో తాగితాగే ఆలస్యంగా ఊరికి చేరుతున్న తాగుబోతు రామచంద్రయ్యగారు కనబడటంతో "నమస్కారం మేష్టారు" అంటూ వినయంగా పక్కకు తప్పుకున్నాడు. రామచంద్రయ్యగారి దృష్టి వాడిమీద పడనేలేదు. ఆయన ఆలోచనలన్ని మంత్రాల మారయ్య చుట్టూ తిరుగుతున్నాయి.

మంత్రాల మారయ్య అంటే పనసకాయలపాడేకాదు చుట్టుపక్కల వంద గ్రామాలవరకు అందరికి తెల్సు. నాగుపామయినా త్రాచుపామయినా, పొడపామైనా ఏదైనాసరే మారయ్య మంత్రానికి కట్టుబడాల్సిందే. కీలుబొమ్మలా ఆడాల్సిందే. పాము కాటుపడినవాళ్ళకి ప్రాణదాత అతనే. అతని మంత్రానికి తిరుగులేదు. మంత్రంలో మారయ్య మొనగాడే. మకుటంలేని మహారాజేకాని. నాలుగువేళ్ళు నోట్లోకి పోయేసంపాదన మాత్రంలేదు

మనుషులు ఎంత ఇనుపగుండె వాళ్ళయినా కానివ్వండి అయినవాడు ఆపదలో చిక్కితే అంత ఇనుపగుండె కూడా మంచులా కరిగిపోతుంది. నీళ్ళు కారిపోతారు. అయినవాడు కాస్త బాధలోంచి తేరుకుంటే నీరు గట్టిపడి మంచు అవుతుంది. తిరిగి ఇనపగుండె అయిపోతుంది.

పాముకాటుకి గురైన మనిషిని మోసుకొచ్చి మారయ్య ముందుపడేసి.

"మారయ్యా! నువ్వు కోరిన డబ్బిస్తాం... మా ప్రాణాలిమ్మన్నా ఇస్తాం. మావాడ్ని బ్రతికించు" అంటూ కాళ్ళావేళ్ళాపడి బ్రతిమాలి కన్నీరు కార్చినవాళ్ళే, ఆ మనిషి కళ్ళు విప్పేసరికి మంచం చుట్టూ చేరి పలకరింపుల్లో పడిపోతారు. కాని మారయ్య గురించి పట్టించుకోరు. ఒకవేళ పట్టించుకున్నా పదిరూపాయలు చేతిలోపెట్టి నీ మేలు మరవలేం అంటారు. అవేం మారయ్యకి కొత్తకాదు. మంత్రానికి దక్షిణ నోరు తెరిచి అడగ కూడదని గురువాజ్ఞ. అందువల్ల అతను నోరువిప్పడు. దరిద్రం అతని గడపవదిలిపెట్టదు.

ఆ మారయ్యకి ఒక్కడే కొడుకు శీనయ్య వాడా ఊరి మిడిల్ స్కూల్లోనే చదువుతున్నాడు. కొడుకును చదువులో పెట్టడం మారయ్యకి ఇష్టంలేదు. కాని శీనయ్య చదువు వాళ్ళమ్మ కోరిక ప్రకారం జరుగుతోంది. శీనయ్య పుట్టినపుడే తల్లికి ధనుర్వాతం వచ్చింది. పసిగుడ్డుని కన్నీళ్ళతో మారయ్య చేతిలో పెడుతూ వాడ్ని సదివించమని వేడుకుంటూ కన్ను మూసింది.

ఆ తల్లి అలా అడగటానికి కారణం ఉంది. అదేం ఖర్మోకాని నీటిమీద తిరిగేవాడు నీటి గండంలోనే ప్రాణాలు పోగొట్టుకుంటాడు. పాముల్ని ఆడించే నేర్పున్నవాడు పాము చేతిలోనే మరణిస్తాడు. మంత్రాల మారయ్య వంశం అంతా పాముల చేతిలో ప్రాణాలు కోల్పోయినవాళ్ళే- అందుకు భిన్నంగా శీనయ్య బ్రతుకు సాగాలని ఆ తల్లి కోరిక. మారయ్య తలొంచేడు మనసుకు ఇష్టంలేకున్నా శీనయ్యని రామచంద్రయ్య మాష్టారి కప్పగించేడు. పాతి-కేళ్ళుగా ఆ ఊళ్ళోనే బడిపంతులు చేసి రిటైర్ అయ్యే ముందు మిడిల్ స్కూల్ ప్రధానోపాధ్యాయు డైయ్యాడాయన. అందర్ని ఒకేరకం ఆదరణ చూపే రామచంద్రయ్యగారంటే ఊరందరికీ అభిమానమే.

ఆలోచనలు ముసురుకుంటుంటే వడివడిగా అడుగులేస్తున్న రామచంద్రయ్యగారికి అకస్మాత్తుగా శీనయ్య ముఖం గుర్తొచ్చింది కళైన పెద్దముఖం పెద్ద పెద్ద కళ్ళు. పెదాలమీద ఎప్పుడు జేరుమెండే చిరునవ్వు.... కళ్ళముందు నిలిచేయి రామచంద్రయ్యగారికి ఎందుకో కళ్ళు చెమర్చాయి. 'ఛ' అనుకుంటు పై పంచెతో అద్దుకున్నారు 'ఇప్పుడేమైందని' తనకి తనే ధైర్యం చెప్పుకున్నారు.

శీనయ్య బళ్ళో చేరిననాడు వాడు పదిమందిలో ఒకడనుకున్నారు రామచంద్రయ్యగారు. కాని పట్టుమని పదిరోజులు కాకుండానే శీనయ్య పదిమందికంటే మిన్న అనిపించుకున్నాడు. వాడివినయం. వివేకం అన్ని రామచంద్రయ్యగారిని ఆకర్షించేయి. వాడిమీద అభిమానము పెరిగింది. అన్ని క్లాసులు మొదటివాడుగా ఉత్తీర్ణుడవుతున్న శీనయ్యమీద పుత్రాభిమానం కల్గింది రామచంద్రయ్యగారికి.

మారయ్యనించి కబురు అందగానే రామచంద్రయ్యగారు కంగారుపడటానికీ కారణం ఉంది. రామచంద్రయ్యగారు మిడిల్‌స్కూలు ప్రధానోపధ్యాయులే కాకుండా ఎనిమిదో తరగతి క్లాసు టీచర్ కూడాను.

అదే క్లాసులో ఉన్నాడు శీనయ్య. వారం క్రితం మేష్టారు "ఒరేయ్.. మీరంతా రేపటి పౌరులు.... గనుక మీకు... ఓటు.... దాని విలువ తెలియాలి. మీలో ఒకడ్ని నాయకుడిగా ఎన్నుకోవాలి. వాడే ఈ క్లాసుకి లీడర్ అవుతాడు," అన్నారు.

మేష్టారి నోటంట మాట ఊడిపడిందో లేదో వెంటనే ఆడపిల్లలంతాలేచి "శీనయ్యే మాకు లీడర్" అంటు అరవసాగేరు. వాళ్ళతోపాటు కొన్ని మగకంఠాలు శృతి కలిపేయి.

మేష్టారు చిరునవ్వుతో శీనయ్యని చూశారు. వాడు బిత్తరపోయి చూశాడు.

ఇంతలో మరికొన్ని కంఠాలు... "కామేశం... మా లీడర్" అంటూ అరిచేయి. కామేశం చిరునవ్వుతో లేచి నిలబడ్డాడు. కామేశం సమితి ప్రెసిడెంటు దయానందరావుగారి కుమార్డు కామేశంలేచి నిలబడి అందరికి నమస్కరించేడు.

"కాదు. మా లీడర్... శీనయ్యే.... శీనయ్యే" కంఠాలు మళ్ళా లేచాయి. దాంతో కామేశం ముఖం ఎర్రబడింది అరుస్తున్న కంఠాలకేసి ఉరిమి చూశాడు.

దాంతో కామేశం... ఇవ్వబోయే.... టెంకిజెల్లలు గుర్తొచ్చినట్టు చాల కంఠాలు మూగపోయేయి.

"కామేశమే మా లీడర్" ఎవరో అరిచేరు.

"ఔను" చాలా కంఠాలు వంతపాడేయి.

మౌనంగా ఇదంతా గమనించిన రామచంద్రయ్యగారికి పిల్లల్లో హెచ్చుభాగం... శీనయ్య లీడర్ కావాలని కోరుకుంటున్నారని, కాని కామేశానికి భయపడి నోరెత్తటంలేదని గ్రహించేరు.

"సరేనర్రా వీళ్ళిద్దరు... నిలబడతారు. రేపు మీరొస్తునే ఎవరికి చూపించకుండా... మీరే.... మీ కెవరు లీడరు కావాలో చీటిమీద రాసివ్వండి. ఎవరి పేరు ఎక్కువమంది రాస్తే వాళ్ళేలీడర్" అన్నారాయన

మేష్టారు... చీటిమీద ఎన్నిక అనగానే కామేశం ముఖం ఎఱ్ఱనయింది "ఎందుకు మాష్టారూ ఈ వాళే-ఇప్పుడే చేతులులేపి నాకెన్ని ఓట్లు వస్తాయో శీనయ్యకెన్నివస్తాయో తేల్చొయచ్చుగా" అన్నాడు.

మేష్టారు చిరునవ్వుతో "మనదేశ ఎన్నికలు మాదిరే ఈ ఎన్నికలురా.... మీకు పెద్దయిన తర్వాత ఓటువేసే అలవాటు రావటానికిది రిహార్సల్" అన్నారు. కామేశం నోరెత్తలేదు.

మర్నాడు రామచంద్రయ్య మేష్టారు క్లాసులో పలకొచ్చి ఆశ్చర్యపోయారు. "ఇదేమిటఱ్ఱా ఈ వాళే ఏమొచ్చింది అంతమంది మానేశారు" అంటూ తరగతిని పరిక్షచేసి కూర్చుని హాజరు వేయటం ప్రారంభించేరు. అరవైమందున్న ఆ తరగతిలో ఇరవైముగ్గురొచ్చారు.

ఎందువల్ల అందరు మానేశారో మేష్టారి కర్థం కాలేదు. హాజరు వేయటం పూర్తి చేసి పాఠ్యపుస్తకం తీయబోతుంటే కామేశం లేచినిలబడి "మేష్టారు ఈవేళ లీడర్ని పెడతానన్నారు" అంటూ జ్ఞాపకం చేశాడు.

"అవునురా అన్నాను కాని ఈవేళ హాజరు ఎక్కువలేదుగా రేపు పెట్టుకుందాం" అన్నారు.

"అదేమిటి మేష్టారూ! ఎన్నికన్న తర్వాత అదేరోజు జరిపితీరాలిగా.... ఎందరుంటే అందరే చీటీలురాసి ఎన్నుకుంటాం" అన్నాడు. రామచంద్రయ్యగారికి సరేననక తప్పలేదు.

ఇంతలో ఇద్దరు అడపిల్లలు తరగతిలోకి తొంగిచూసారు మేష్టార్ని చూసి గతుక్కుమన్నారు.

"ఏమఱ్ఱా! ఆలస్యంగా వచ్చిందేకాక పుస్తకాలు లేకుండా వచ్చేరేం?" గద్దించేరాయన.

మేష్టారు పశ్నకి ముందువాళ్ళు బిత్తరపోయినా తర్వాత మెల్లిగా చెప్పారు" కామేశం మా ఇంటికొచ్చి మేష్టారికి ఒంట్లోబాగాలేదు ఈవేళ క్లాసు లేదుఅని చెప్పాడండి."

భయపడతూ ఆ పిల్ల చెప్పిన మాటకి రామచంద్రయ్యగారు కొయ్యబారిపోయారు. కామేశం ఎందుకలా చెప్పాడో క్షణంలో అర్థమైంది. క్లాసంతా హాజరయి చీటి ఎన్నికలు పెడితే తను గెలవలేడు. అందుకే అడ్డదారి పట్టేడు. పద్నాలుగేళ్ళకే రాజకీయంలో ఆరితేరిపోయిన సమితి ప్రెసిడెంట్‌గారబ్బాయిని చూసి ఆయన తెల్లబోయారు.

"నువ్వెందుకలా చేశావో నీకు తెల్సు.... నాకుతెల్సు . మరోసారిలా చేశావంటే ఊరుకోను.... జాగ్రత్త" అంటూ గద్దించేరు. మేష్టారు మాటలకి కామేశం ఏం కంగారుపడలేదు. నిమ్మకు నీరెత్తినట్టుగా గంభీరంగా ఉండిపోయాడు.

"ఎన్నిక రేపటికి వాయిదా వేస్తున్నాను" అన్నారాయన.. కోపంగా. ఆ క్షణంలో రామచంద్రయ్యగారు ప్రజాస్వామ్యాన్ని పరి-రక్షిస్తున్నానుకున్నారే కాని రాబోయే ప్రమాదాన్ని పసికట్టలేక పోయారు.

మర్నాడు పిల్లలంతా హాజరయ్యేరు. కాని శీనయ్య రాలేదు. రామచంద్రయ్యగారి మనసుకు ఏదో అనుమానం తోచింది. మారయ్య ఇంటికి కుఱ్ఱాడ్ని పంపేరు. కుఱ్ఱాడితో పాటు మారయ్య పరుగెత్తుకొచ్చాడు. అతను చెప్పిన కబురు మేష్టారిలో కంగారు పుట్టించింది. రాత్రి అంతా శీనయ్య ఇంటికి రాలేదుట. మేష్టారింట్లో ఉండి చదువుకుంటున్నాడేమో అనుకున్నాడట మారయ్య.

శీనయ్య ఏమయ్యాడో... ఎవరికి అర్థం కాలేదు.



తోటలు దొడ్డు చెట్టు చేమా అంతా గాలించేరు. శీనయ్య జాడతెలియలేదు. మేష్టారు ఒక్క క్షణం కామేశాన్ని అనుమానించినా పదిహేనేళ్ళయినా దాటని కామేశం గురించి అంతకుమించి ఆలోచించలేకపోయారు.

రెండో రోజు సాయంత్రం బడివదిలి పెట్టేవేళ, దూడలు ఇంటి ముఖం పట్టేవేళ ఓ దూడలు కాసే కుర్రాడు శీనయ్యను ఊరి చివర్న పాడుబడిన జమిందారుగారి మేడలో చూశాడు. దెయ్యాల మేడగా పేరుపడ్డ ఆ మేడలో కూలిన గోడలమధ్య.... పిచ్చి మొక్కలమధ్య పడున్నాడు శీనయ్య. దూడని వెతుకుతు వెళ్ళిన ఆ కుర్రాడికి లేగదూడలాంటి శీనయ్య కనపడ్డాడు గొళ్ళెం పెట్టబడిన గదిలోంచి మూలుగు వినపడటంతో అనుమానం వచ్చి గొళ్ళెం తీసి చూస్తే మూలుగుతున్న శీనయ్య కనపడ్డాడు.

ఇది జరిగి వారం అయింది. వారం నించి శీనయ్య మూసిన కన్ను తెరవకుండా పడుకున్నాడు. ఒకవేళ కళ్ళు తెరిచినా దెయ్యం... దెయ్యం... అంటూ వెర్రి కేకలు.... సంధి ప్రేలాపన.

ఆ రాత్రంతా ఒంటరిగా దెయ్యాల మేడని పేరుపడ్డా ఇంట్లో వెర్రి కేకలేస్తూ ఉండిపోయేడేమో. భయంతో వాడి మనసు వికలమైపోయింది. వాడు సంధిలో నే

"ఒరే! ఒరే! తలుపు తీయండ్రా! బంతిక్కడలేదురా! బంతిక్కడ లేదురా! నాకు భయం వేస్తోందిరా!" అని కేకవేసినప్పుడల్లా పక్కలో కూర్చున్న

## అడుగు జాడలు

మారయ్యకెంత అర్థమైందో లేదో కాని రామచంద్రయ్య మేష్టారికి ఏం జరిగి ఉంటుందో అర్థమైంది. ఆటవంకన వాణ్ని తీసుకెళ్ళి... అందులో గొళ్ళెం పెట్టారు. అది కామేశం పనే... వాడు మర్నాడు ఎన్నికకు రాకపోతే తను గెలుస్తాననే ఆశ. రామచంద్రయ్య గారికి అర్థమైనా ఏం చేయలేని పరిస్థితి.

శీనయ్య ఆరోగ్యం బాగయి, వాడు జరిగింది చెబితే తను కామేశంని శిక్షించచ్చు. అంత వరకు తనేం చేయలేదు. శీనయ్య ఆరోగ్యం బాగుపడాలని... వెయ్యి దేవుళ్ళకు మొక్కుకుంటున్నారాయన.

గూడెం దగ్గర పడగానే... మేష్టారు గుండె దడ హెచ్చయింది... 'శీను గాడికి ఎలా వుందో ఏమిటో భగవాన్. వాడి కేదైనా అయితే... దానికి నేనే కారణం. ప్రజాస్వామ్య పద్ధతిలో ఎన్నిక జరపాలనే నా మూర్ఖత్వమే కారణం అవుతుంది. భగవాన్! లేతపిందె. వాడ్నేం చేయకు. నే చేసిన తప్పుకి.... నా మూర్ఖత్వానికి... నన్ను తీసుకెళ్ళు" తనలోనే గొణుక్కుంటూ.... అడుగు వేశారు.

మారయ్య ఇంటి ముందు జనం.... మూగి ఉన్నారు. అంతమంది జనం ఆవేళప్పుడు అక్కడుండటం రామచంద్రయ్య గారికి సన్నటి వణుకు లాంటిది పుట్టించింది. అడుగులు తడబడుతుంటే... లేని ఓపిక తెచ్చుకుని వడిగా అడుగులు వేశారు.

మేష్టార్ని చూడగానే ఇంటి ముందున్న జనం పక్కకు తప్పుకుని దారి ఇచ్చేరు. జనాన్ని తప్పుకుంటూ లోపల కెళుతున్న రామచంద్రయ్య గారికి సన్నటి ఏడుపు వినిపిస్తోంది.

గుండె బిగపెట్టుకుని .... ముక్కోటి దేవతల్ని తల్చుకుంటూ ముందుకడుగేశారు. కొయ్య బొమ్మలా నిలబడి పోయారు.

మారయ్య ... వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు... కడుపులో ఏదో పేగు తెగి రక్తం స్రవిస్తున్నట్టు, మూలుగుతున్నాడు. శీనయ్య ముద్దు ముఖంతో.... నిద్రపోతున్నాడు. పాల బుగ్గల వన్నె తగ్గలేదు. పెదాల మించి జారే చిరునవ్వు మాసి పోలేదు. నిద్ర పోతున్న కన్నయ్యలా ఉన్నాడు.

మారయ్య ఏడుపు శృతి పెరుగుతోంది.

"ఒరే....కన్నా.... ఏరా... పాము కాటుతో నీకు సావు రాకూడదంది మీయమ్మ. నిన్ను సదివించింది.... ఇప్పుడా సదువే... నిన్ను కాటేసిందిరోయ్... నేను..... పాము కాటుకు మంత్రం వెయ్యగలనే కాని.... మనిషి కాటుకి మందేయ లేక పోయేను రోయ్. కొడకా! ఓ కొడకా!"

మారయ్య .... ఏడుపు.... ఏడుపులా లేదు.... ఆ ఏడుపు చూస్తే యముడి కైనా గుండె లదరిపోవాలి. చావుకైనా కన్నీళ్ళు రావాలి. రామచంద్రయ్య గారికి కన్నీళ్ళతో..... చూపు మసక బారి తల తిప్పుకున్నారు. సరిగ్గా అప్పుడే ..... సమితి ప్రెసిడెంట్ దయానందరావుగారు ... ఘోరం విని పరామర్శ కొచ్చారు. ఆయన అడుగు జాడల్లోనే .... కామేశం లోపల కొస్తున్నాడు. □



"తండ్రీ కొడుకుల ఛాలెంజ్"లో కృష్ణ

# సినిమా విశేషాలు

_జి.వి.జి.

## కృష్ణ, శ్రీదేవి జంటతో "యమపాశం"

"పేదపిల్ల ఐశ్వర్యవంతుని ఇంటికొస్తే ఏమవుతుంది? ఐశ్వర్యవంతుని గారాల ముద్దు బిడ్డ పూరిపాకకు వస్తే ఏమవుతుంది? వారకాంత గృహిణి అయితే ఏమవుతుంది? ఇది ఐదుజంటలకు సంబంధించిన కథ. ఆగస్ట్ షెడ్యూల్ పూర్తి చేశాం. సెప్టెంబర్ నుంచి డిసెంబర్ వరకు జరిగే మిగతా నాలుగు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు కె. బాపయ్య. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బి. వి. ఎస్. ఎన్. ప్రసాద్ నిర్మిస్తున్న శ్రీ కృష్ణప్రసన్న పిక్చర్స్ "యమపాశం" చిత్రంలో కృష్ణ, శ్రీదేవి, రావు గోపాలరావు, చంద్రమోహన్, గుమ్మడి, రాజేంద్రప్రసాద్, రాజ్‌వర్మ, పూర్ణిమ, అరుణ, వై. విజయ వగైరా తారా సందోహం. పరుచూరి సోదరుల రచన, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, వెంకట్ ఛాయ, సలీమ్ నృత్యాలు, ఎం. ఎస్. దాస్ సాహసాలు, జాస్తి హేమాంబర్ సహకార దర్శకత్వం, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు తెర వెనుక హంగులు.

## "తొలి సంధ్య"

"ఒక యువకుని నమ్మి వంచితురాలైన ఓ యువతి మరో మిత్రుని ఆదరువుతో నవ జీవితాన్ని ఆరంభించే గ్రామీణ వాతావరణానికి చెందిన కథ. సెప్టెంబర్‌లో షూటింగ్ పూర్తవుతుంది", అన్నారు రాజాచంద్ర. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బండారు భాస్కరరాజా నిర్మించే బీ. ఎస్. ఫిలిమ్స్ వారి పై చిత్రంలో రాజశేఖర్, చరణ్‌రాజ్, శుభలేఖ సుధాకర్, కిశోర్, పి. జె. శర్మ, ఉమ, రజని, తులసి, కె. విజయ, పుష్పలత నటిస్తున్నారు. పూసల సంభాషణలకర్త. చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి, సిరివెన్నెల సీతారామశాస్త్రి, గోపి గీతాలు రాశారు. సుధాకర రెడ్డి ఛాయ, కృష్ణశిల్పం, శివ సుబ్రహ్మణ్యం నృత్యాలు. డి. రాజగోపాల్ కూర్పుతో కె. జయచంద్రారెడ్డి సమర్పణ.

## లక్ష్మీకాంత్ ప్యారేలాల్ సంగీతంతో "ప్రేమదేవత"

"అమ్మ ఆప్యాయతకు నోచుకోని ఒక జమిందారు కూతురు ప్రేమదేవత మనశ్శాంతిని వెదుక్కుంటూ తండ్రికి దూరమై వెళ్ళి, అనుకోకుండా ఓ యువకుని జీవితంలో ప్రవేశించింది. దాంతో విధి వక్రించి, ఆ యువకుని జీవితానికే ముప్పువాటిల్లే పరిస్థితి ఏర్పడింది. చివరికి ఆ ప్రేమదేవత తన సమస్యలను ఎలా అధిగమించిందీ వినోదాత్మకంగా, వీనుల విందైన పాటలతో వివరించే రసమయ చిత్రం", అన్నారు ప్రముఖ ప్రచార చిత్రకారులు కె. రామదాస్. ఈయన సమర్పణలో పద్మ రామదాస్, కె. శ్రీకుమార్ నిర్మించిన రామ్‌సాయి సినీ ఆర్ట్స్ వారి పై చిత్రంలో నదియా, మోహన్, సుజాత, సంగీత, విజయకుమార్ నటించారు. మాగాపు అమ్మిరాజు మాటలు, లక్ష్మీకాంత్ ప్యారేలాల్ సంగీతం, దినేష్‌బాబు ఛాయ, కె. కేశవరావు - కుమార్ కూర్పుతో కె. రంగరాజ్ దర్శకుడు.

ఇవాళ వర్షంలో తడిసే సీను వుంది! కాబట్టి స్నానం చెయ్యకుండానే వెళ్తాను!



## ఎ. ఎన్. ఆర్.తో సురేష్ ప్రొడక్షన్స్ "గురుబ్రహ్మ"

నేటి బాలలు రేపటి పౌరులవ్వాలంటే -ఇంట్లో తల్లిదండ్రుల పెంపకం, బయట సంఘంలో మనుషుల ప్రభావంకన్నా పాఠశాలలో ఉపాధ్యాయుని ప్రభావమే ఎక్కువ. బాలలకు నైతిక ప్రవర్తన అలవాటు చేయగలిగింది ఉపాధ్యాయుడు మాత్రమే. వ్యక్తిత్వం నిలుపుకోగల బాలలవల్ల దేశానికి ఎంతో మేలు జరుగుతుంది. సమాజంలోకి వెళ్ళి, ప్రజలకు సేవ చేయడమే వారు గురువుకిచ్చే దక్షిణ. ఈ సందేశాన్నిచ్చే సామాజిక స్పృహగల చిత్రం. సెప్టెంబర్ 1 నుంచి 15 వరకు ఒక షెడ్యూల్ పూర్తయింది. అక్టోబర్, నవంబర్‌లలో కూడా ఈ తేదీల మధ్య జరిగే షెడ్యూల్స్‌తో మొత్తం షూటింగ్ పూర్తయిపోతుంది", అన్నారు బోయిన సుబ్బారావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో డి. రామానాయుడు నిర్మిస్తున్న సురేష్ ప్రొడక్షన్స్ "గురుబ్రహ్మ"లో ఎ. ఎన్. ఆర్; నవనటుడు దగ్గుపాటి రాజా, శారద, సత్యనారాయణ, చంద్రమోహన్, శరత్‌బాబు, రాజేష్, వేలు, జె. వి. సోమయాజులు, రమణమూర్తి, రాళ్ళపల్లి, రజని, మాధవి, అశ్వని, జయలలిత, పవిత్ర, శ్రీలక్ష్మి, పరుచూరి వెంకటేశ్వరరావుతో పాటు నిర్మాత డి. రామానాయుడు కూడా నటిస్తున్నారు. శ్రీనివాస చక్రవర్తి కథకు పరుచూరి సోదరులు సంభాషణలకర్తలు. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. కృష్ణమూర్తి శిల్పం, ఎం. వి. రఘు ఛాయ, సంయుక్త దర్శకత్వం: నాగేశ్వరరావు, నృత్యాలు: రఘు, కూర్పు: మార్తాండ్, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: బోయిన సుబ్బారావు.

## "పదహారేళ్ళ అమ్మాయి"

చంటికి చిన్నప్పట్నుంచీ పెళ్ళంటే అసహ్యం. పదహారేళ్ళ ఓణీ వేసే వయ్యారిని, సిగ్గులు పూచే చిన్నారిని పెళ్ళాడితే జీవితం సుఖమయమవుతుందని ఓ పెద్దమనిషి బోధిస్తూ, అందుకు ఆరు సూత్రాలున్నాయని చంటికి పెళ్ళంటే మోజు కలిగేలా చేస్తాడు. చంటి అన్వేషణ ప్రారంభిస్తాడు. ఇలా సాగే శ్రీ శైలజ ఫిలిమ్స్ పై వినోదాత్మక చిత్రంలో రాజేంద్రప్రసాద్, చిత్ర, నూతన్‌ప్రసాద్, వీరభద్రరావు, రావికొండలరావు, కాకరాల, మమత, చందన, జయలలిత, భారతి, రాధాకుమారి, గౌరవ పాత్రలో దాసరి నారాయణరావు, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, జయమాలిని కనిపిస్తారు. వసుంధర కథకు మధు మాటలు రాశారు. ఆత్రేయ, వేటూరి, సీతారామశాస్త్రి గీతాలకు శివాజీరాజా బాణీలు కూర్చారు. దివాకర్ ఛాయ, తోట యాదు శిల్పం, శ్యామలరావు సంయుక్త దర్శకత్వం, కె. రామగోపాలరెడ్డి కూర్పుతో ఆర్. దశరథరామరెడ్డి నిర్మాతగా పి. సురేంద్రనాథ్ సమర్పించే ఈ చిత్రానికి పి. ఎస్. కృష్ణమోహన్‌రెడ్డి దర్శకుడు.

"చైతన్యం"లో సాగరిక





"బ్రహ్మరుద్రులు"లో అక్కినేని

## కోడి రామకృష్ణ దర్శకత్వంలో శ్రీ లలిత కళాంజలి చిత్రం

"అక్టోబర్ నుంచి డిసెంబర్ వరకు ప్రతినెలా పది రోజులపాటు షూటింగ్", అన్నారు కోడి రామకృష్ణ. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహిస్తూ నటించే పై సంస్థ చిత్రంలో కల్యాణచక్రవర్తి, అశ్వని, ఏలేశ్వరం రంగా, ఒక విశిష్టమైన పాత్రలో రావుగోపాలరావు నటిస్తున్నారు. కె. వి. మహదేవన్ సంగీతం , పి. లక్ష్మణ్ ఛాయ, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, సాహుల్ సాహసాలు, తాతా సురేష్ కూర్పు, బి. హెచ్. సూర్యచంద్రరాజు నిర్వహణతో సూర్యకిరణ్ సమర్పించే ఈ చిత్రానికి వాకాడ అప్పారావు , దాట్ల రామకృష్ణంరాజు నిర్మాతలు.



"చాదస్తపు మొగుడు"లో సుమన్, భానుప్రియ

దర్శకత్వంలో ఎల్వూరి కోటేశ్వరరావు నిర్మించే దినకర్ ఆర్ట్స్ [illegible] వారి పై చిత్రానికి భారవి. పద్మ సంభాషణలు రాశారు. [illegible] నారాయణరెడ్డి, వేటూరి. భారవి గీతాలను [illegible] రావు స్వరకల్పన. హెచ్. ఎస్. వేణు ఛాయ. [illegible] రాజన్ శిల్పం, కత్తుల గోపాలకృష్ణ [illegible] దర్శకత్వం, టి. వి. నరసింహారావు సహకార దర్శకత్వం, తాండవకృష్ణ ప్రొడక్షన్, [illegible] నరసింహారావు కూర్పుతో ఆర్. సాంబశివరావు [illegible]

## పద్మజా ఆర్ట్స్ పిక్చర్స్ "విశ్వాసం"లో సుమన్, రజని

"పెళ్ళిళ్ళ [illegible] నందకుమార్ దర్శకత్వంలో పద్మజా పిక్చర్స్ ఎ. హెచ్. నరసింహారావు నిర్మించే మరో చిత్రమిది. మూడొంతులకు పైగా పూర్తయిన ఈ చిత్రంలో తారాగణం: సుమన్, రజని, నూతన్‌ప్రసాద్, వేలు, వీరభద్రరావు, పొట్టి ప్రసాద్, చెన్నర్ల, వినోద్, జయమాలిని, అనూరాధ, వై. విజయ.

"సక్కనోడు"లో విజ



## విఠలాచార్య దర్శకత్వంలో "వీరప్రతాప్"గా మోహన్‌బాబు

"మద్రాసులో 60 రోజుల షూటింగ్‌కు 9 భారీ సెట్స్ ప్రత్యేకంగా నిర్మిస్తున్నాం. కాస్ట్యూమ్స్ కొనం కూడా చాలా వెచ్చిస్తున్నాం. అక్టోబర్ 1 నుంచి 30 వరకు తలకోన, చిత్తూరు, మధురాంతకం, కైలాసకోన, హొగెనకల్ ప్రాంతాల్లో ఔట్‌డోర్ షూటింగ్ ఉంటుంది. ఈ జానపద చిత్ర నిర్మాణానికి అరవై లక్షలకు పైగా వ్యయమవుతోంది. జానపద చిత్ర బ్రహ్మ విఠలాచార్యగారు తమ సొంత చిత్రంలా భావించి ఎంతో ఉత్సాహంతో డైరెక్ట్ చేస్తున్నారు." అన్నారు హీరో మోహన్‌బాబు. ఈయన సమర్పించే ఎ. ఎం. ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో మాధవి నాయిక. అరుణ, దేవి, అనూరాధ, శ్రీలక్ష్మి, చంద్రిక, లక్ష్మిప్రియ, గిరిబాబు, కోట శ్రీనివాసరావు, సత్యనారాయణ, రాళ్ళపల్లి, వేలు, వీరభద్రరావు, మాడా, సారథి, కె. కె. శర్మ, నగేష్‌బాబు, ఏచూరి ప్రభృత నటవర్గం. కర్పూరపు ఆంజనేయులు సంభాషణల కర్త, శంకర్ గణేష్ స్వరకల్పనలో ఆత్రేయ, గోపి గీతాలు రాశారు. హెచ్. ఎస్. వేణు ఛాయ, కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం, సలీమ్ నృత్యాలు, జూడో రత్నం సాహసాలు, కె. ఆంజనేయులు– జయకృష్ణారావు సంయుక్త దర్శకత్వం, రవి కూర్పు, ఎమ్. కృష్ణ– బి. పురుషోత్తం ప్రొడక్షన్‌తో నిర్మలా మోహన్‌బాబు నిర్మాత.

## కమలాకర కామేశ్వరరావు దర్శకత్వంలో "సూర్యుడే ప్రత్యక్ష దైవం"

"సూర్యుడు ప్రత్యక్ష దైవం. అందరికీ ఆరాధ్య దైవం. సౌరశక్తిని నేడు ఎన్నో విధాల సద్వినియోగం చేసుకుంటున్నాం. సూర్య భగవానుని గురించి చిత్రం తీయాలని మా ఆశయం. అక్టోబర్‌లో నటీనటుల ఎన్నిక జరిపి కోణార్క్, అరసవల్లి వగైరా సూర్య క్షేత్రాలలో షూటింగ్ జరుపుతాం", అన్నారు పౌరాణిక దర్శక బ్రహ్మ కమలాకర కామేశ్వరరావు. ఈయన కథా పరిశోధన, చిత్రానువాదం.

## "సక్కనోడు"లో సాధింపు

"గోపన్నా! గోపన్నా!" అంటూ విజయ (విజయశాంతి) కేకేసింది.

"యేంటి బుర్రీ గావు కేకలేస్తున్నావ్?" అంటూ గోపన్న (శోభన్‌బాబు) వచ్చాడు.

"బుర్రీ గిర్రీ అన్నావంటే పళ్ళు రాలుతాయ్. వెళ్ళి అర్జంటుగా పాలు తీసుకురా!"

"నేను నీకు పాలు తేవాలా? తెస్తే తాగుతావా? నీ రూమ్‌లోకి రావద్దన్నావు? నీ పనులేమి చెయ్యొద్దన్నావు మరి?"

"అప్పుడన్నాను. ఇప్పుడు తెమ్మంటున్నాను. గోపన్నా!ఈ క్షణం నుంచి నే చెప్పే ప్రతి పనీ నువ్వే చెయ్యాలి".

గోపన్న వెళ్ళి పాలు తెచ్చాడు. అది చూసి విజయ "ఏమిటీ పాలు నీళ్ళలాగా ఉన్నాయి? నువ్వు తాగే ఆ సారా నీళ్ళ కంపా?"

"బుర్రీ!"

...యశాంతి, శోభన్‌బాబు





"నేనే రాజు – నేనే మంత్రి"లో మోహన్‌బాబు, రాధిక

"షట్టప్! నువ్వీ ఇంట్లో పనిమనిషివి. నాకు ఈ ఇంటి మీద అధికారం ఉంది. నన్ను 'మేడమ్' అని పిలవాలి ... అదిగో ఆ పెట్టెలో ఉన్న నా బట్టలన్నీ తీసుకెళ్ళి, బాగా ఉతికి, అందంగా ఇస్త్రీ చేసి మరీ తీసుకురా. ఇప్పుడు ఏడు గంటలయింది. తొమ్మిది గంటలకల్లా కాలేజీకి వేళవుతుంది. నా సంగతి తెలుసుగా? జాగ్రత్త! క్విక్! నీ పొగరు అణుగుతుంది ఇడియట్!"

గత్యంతరంలేక బట్టలు తీసుకెళ్ళిపోయాడు గోపన్న.

రాఘవేంద్ర సినీ క్రియేషన్స్ "సక్కనోడు" చిత్రానికి బి. భాస్కరరావు దర్శకుడు.

## డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డి చిత్రావళి

శోభన్‌బాబు, విజయశాంతి జంటతో అక్టోబర్ 16న ప్రారంభమయ్యే "కార్తీక పౌర్ణమి" కామాక్షి కమర్షియల్స్ చిత్రానికి చక్రవర్తి సంగీతం, సుధాకరరెడ్డి ఛాయతో డి. శివప్రసాదరెడ్డి నిర్మాత.

నవంబర్ నెలలో చిరంజీవి, శ్రీదేవి నాయికా నాయికలుగా తయారయ్యే గీతాఆర్ట్స్ చిత్రానికి అల్లు అరవింద్ నిర్మాత.

కృష్ణంరాజుతో యు. వి. సూర్యనారాయణరాజు నిర్మించే గోపీకృష్ణా మూవీస్ చిత్రం డిసెంబర్‌లో మొదలవుతుంది.

డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ అధినేత డి. వి. ఎస్. రాజు నిర్మించే చిత్రంలో బాలకృష్ణ హీరో.

డిసెంబర్ 21 నుంచి కృష్ణంరాజుతో వజ్జే సుబ్బారావు సమర్పించే విజయ మహేష్ కంబైన్స్ చిత్రానికి జి. సత్యనారాయణ నిర్మాత.

## కె. బాలచందర్ దర్శకత్వంలో చిరంజీవి చిత్రం

"మా తల్లిగారు అంజనమ్మగారి పేరుతో అంజనా ఆర్ట్స్ పతాకంలో నవంబర్‌లో ప్రారంభోత్సవం జరుగుతుంది", అన్నారు చిరంజీవి సోదరుడు కె. నాగేంద్రబాబు. ఈయన నిర్మించే చిత్రంలో చిరంజీవి సరసన శోభన నాయిక. కె. బాలచందర్ కథకుడు, దర్శకుడు.



"హెచ్చరిక"లో భానుచందర్, శ్రీలక్ష్మి, అనూరాధ, కల్పనారాయ్

## "తేరీ మెహర్బానీ" ఆధారంగా శ్రీ జయభేరీ ఆర్ట్ ప్రొడక్షన్స్ చిత్రం

"హిందీ హిట్ చిత్రం 'తేరే మెహర్బానీ' రైట్స్ కొనుక్కున్నాం. అక్టోబర్ నుంచి షూటింగ్."

## సినిమా

అన్నారు మురళీమోహన్. ఈయన "శ్రావణమేఘాలు" అనంతరం ప్రధాన పాత్ర నిర్వహిస్తూ సమర్పించే శ్రీ జయభేరీ ఆర్ట్ ప్రొడక్షన్స్

చిత్రంలో రజని నాయిక. కిశోర్ నిర్వహణ, పినిశెట్టి రవిరాజా దర్శకత్వంతో మాగంటి వెంకటేశ్వరరావు నిర్మాత.

## ఎస్. వెంకటరత్నం చిత్రంలో "అజేయుడు"గా వెంకటేశ్

"రక్త సంబంధంకన్నా న్యాయం - ధర్మం ముఖ్యమని చాటి చెప్పే పాత్ర వెంకటేశ్‌ది. ఇది నా 11వ చిత్రం. సెప్టెంబర్ షెడ్యూల్ ముగించాం. వెంకటేశ్, శోభనల మీద రెండు పాటలను మాల్‌దీవిలో పిక్చరైజ్ చేస్తాం. డిసెంబర్ 10కి మొత్తం షూటింగ్ పూర్తయిపోతుంది", అన్నారు ప్రముఖ ఛాయాగ్రాహకుడు, శ్రీ పల్లవీ ఫిలిమ్స్ అధినేత ఎస్. వెంకటరత్నం. ఈయన నిర్మిస్తున్న "అజేయుడు"లో వెంకటేశ్, శోభన, శారద, జగ్గయ్య, సత్యనారాయణ, గుమ్మడి, శుభలేఖ సుధాకర్, వేలు, వీరభద్రరావు, శ్రీలక్ష్మి, వరలక్ష్మి నటిస్తున్నారు. భీశెట్టి కథ, సత్యానంద్ సంభాషణలు, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, భాస్కరరాజు శిల్పం, డి. వెంకటరత్నం కూర్పు, రఘు నృత్యాలు, విజయన్ సాహసాలు, రామ్‌సూరి సంయుక్త దర్శకత్వం, దండమూడి కోటేశ్వరరావు ప్రొడక్షన్‌తో జి. రామ్మోహనరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు. □






దర్శకత్వం: కె.రాఘవేంద్రరావు బి.ఎ. నిర్మాత: కె.కృష్ణమోహన్‌రావు


సీక్రెట్ ఏజెంట్
విక్రమ్
దిలీప్ కదమ్
మోహన్
7


తర్వాత –
భలే! అంతా చాలా త్వరగా జరిగింది.
అవును.


దేన్ని గురించి ఆలోచిస్తున్నారు?
మనమీద జరిగిన దాడి దోపిడి ప్రయత్నం కాదు. జనరల్ ఒబెయిద్ కూడా వెంటనే దాన్ని కనిపెట్టాడు.
31/7


అయితే అదేమిటి?
గట్టిగా ఏమీ చెప్పలేను. మూడో వ్యక్తి ఎవరికో దీనితో సంబంధం ఉన్నది. మనం ఇంకా జాగ్రత్తగా ఉండాలి.


కాస్త నిద్ర పోవటం మంచిది. రేపు చెయ్యవలసిన పని చాలా ఉంది.
అలాగే.


ఆమర్నాడు –
నేను ఒకరిని కనిపెట్టాను. మీ సంగతేమిటి?
నాకు మరో ఇద్దరు కనిపించారు.


హోటల్ ఎవర్ గ్రీన్‌కి మనం వెళ్లటం చాలా సహజంగా, ఎవరికి అనుమానం రాకుండా జరగాలి.
మరోలా చెప్పాలంటే అదే మన గమ్యం అని మన నీడకి కూడా అనుమానం రాకూడదు.


తమని వెంబడిస్తున్న వాళ్లని విక్రమ్, రేణులు పట్నం అంతా తిప్పారు.


.....ఆ సాయంత్రం చీకటి పడిన తర్వాత వాళ్లు ఎవర్‌గ్రీన్ హోటల్‌కి చేరుకున్నారు.
హోటల్ ఎవర్‌గ్రీన్



హోటల్‌లో –
ఆవిడే మనకి కావలసిన వ్యక్తి అయి ఉండాలి.
(ఇంకా ఉంది)

# సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు



**పి. మొగిలి, పర్కాల: చక్కా గోపాలకృష్ణ, తణుకు**

1985లో "ప్రతిఘటన" చిత్రంతో నంది అవార్డ్‌ను పొందారు. 1986లో "రేపటి పౌరులు" చిత్రంతో జాతీయ అవార్డ్‌ను పొందాలని నేను కోరుకుంటున్నాను.

మీ అభిమానానికి కృతజ్ఞతలు.

**జి. మధుసూదన్, బెల్లంపల్లి**

టి. కృష్ణగారి దర్శకత్వంలోని ప్రతి సినిమాలోను మీరు నటిస్తున్నారు. దానికి కారణం ఏమిటి?

కారణం అంటూ ఏమీలేదు.

**కోచర్లకోట కృష్ణ, మార్కాపురం**

ఉత్తమ నటి అవార్డు స్వీకరించినప్పుడు పొందిన అనుభూతి చెప్పగలరా?

ఆ అవార్డ్‌ను స్వీకరించేటప్పుడు పొందిన అనుభవం ఎలాంటిది అంటే మాటలతో చెప్పనలవికానంతది.

**ఎ. కాంతిమతీదేవి, తిరుపతి**

ఉత్తమ ప్రశ్న వ్రాసిన వారికి మీ కలర్ ఫొటో పంపుతారు. మామూలు ప్రశ్న వ్రాసిన వార్కి బ్లాక్ అండ్ వైట్ ఫొటో పంపవచ్చుగదా?

తప్పకుండా! మా ఇంటికి ఉత్తరం వ్రాయండి. ఫొటో మీకు అందుతుంది.

**పి. పద్మనాభరెడ్డి, భీమవరం**

అక్కయ్యా మీరు ప్రేమించి పెళ్లి చేసుకుంటారా? లేక పెళ్లి చేసుకున్నాక ప్రేమిస్తారా?

పెళ్లి చేసుకోవాలన్న నిర్ణయం ఇంకా తీసుకోలేదు. ప్రస్తుతానికి పెళ్లి ప్రసక్తి లేదు తమ్ముడూ!

**యన్. జయరంగారెడ్డి, గుగుస్ (మహారాష్ట్ర)**

మీరంటే నాకు చాలా ఈర్ష్య. ఎందుకో చెప్పగలరా?

నా నటనను అభిమానిస్తారు కాబట్టి.

**వక్కలంక రామారావు, మానేపల్లి**

మీ కెన్నడూ అపజయం, అశాంతి ఎదరు కాకూడదనే మీ పేరు 'విజయశాంతి'గా పెట్టుకున్నారు. అవునా?

అ... కాదు. ఏమంటారు?

## ఉత్తమ ప్రశ్న

**కొల్లి శ్రీదేవి, భీమిలి**

విలాస జీవితాల్ని గడుపుతూ నటీనటులుంటే, అభిమాన సంఘాలు అంటూ ప్రాణాలు పొగొట్టుకొంటున్నారు నేటి యువతరం. దీనికి మీరేమంటారు?

దూరపు కొండలు నునుపు అన్న సామెత అందరికీ తెల్సిందే! సినిమా నటీనటులు విలాస జీవితాన్ని గడుపుతారు అనేది మీ ఊహ మాత్రమే! పోతే నటీనటులను అభిమానించే అభిమానులు దురభిమానులుగా కాకుండా తమ అభిమానాన్ని తమ మనస్సుల్లోనే ఉంచుకుంటే ఏ అవాంతరాలు ఉండవు... గొడవలూ జరగవు.

**వి. రవీంద్రచారి, మామిళ్ళగూడెం**

తాళికట్టేటప్పుడు మూడుముళ్లు ఎందుకు వేస్తారు?

మన పూర్వీకుల నించి వస్తున్న ఆచారమిది. అయినా ఆ సందేహం మీకు కల్గింది కాబట్టి ఆ మూడుముళ్ళకున్న పవిత్ర అర్ధాన్ని వివరించి మీరే వ్రాయండి ఆచార్యా!

**కొండేటి వెంకటేశ్వర్లు, రాజంపేట**

మంచి సినిమాలు విజయవంతం అవుతున్నాయి. కానీ ఎక్కువగా మంచి సినిమాలను నిర్మాతలు నిర్మించటంలేదు. కారణం?

ఈ ప్రశ్నను మంచి చిత్రాల్ని తీస్తున్న మంచి నిర్మాతల్ని అడిగితే సరయిన సమాధానం పొందవచ్చు.

**కె. శ్రీనివాసరావు, మైలవరం**

మానవుడికి వినోదాన్ని కలిగించి... మనోవుల్లాసాన్ని కలిగించే హాస్య చిత్రాలు ఉత్తమమైన చిత్రాలా? ప్రజలకు సందేశాన్ని యిచ్చే చిత్రాలు ఉత్తమ మైనవా?

ప్రజలకు నచ్చినవి.' వారు మెచ్చినవి. ఎలాంటి చిత్రాలయినా అవి ఉత్తమ చిత్రాలుగా పరిగణింపబడుతాయి.

**ముప్పాలి కన్యాకుమారి, అమరావతి**

తెలుగులో బిజీ అవుతున్న ప్రతి కథానాయిక హిందీ రంగంలోకి వెళ్తుంది. ఎంతో బిజీగా పలు చిత్రాల్లో నటిస్తున్న మీరు హిందీ రంగంలోకి వెళ్లే అవకాశం ఉందా?

అవకాశం... సరైన సందర్భం.... చక్కని పాత్ర లభిస్తే హిందీ చిత్రాల్లో కూడా నటిస్తాను.

**పి. మురళి, విజయనగరం**

మీరు మా సూపర్‌స్టార్ కృష్ణగారి సరసన నటించిన "అగ్నిపర్వతం, బ్రహ్మాస్త్రం" సూపర్‌హిట్ అయ్యాయి. ఆయన ప్రక్కన నటించే చిత్రం ఏదన్నావుందా?

శ్రీ కృష్ణగారంటే నాకెంతో అభిమానం. వారితో కల్సి శుభోదయా వారి చిత్రంతో నటించనున్నాను. □

కూపన్

ఆంధ్రసచిత్ర వారపత్రిక

## విజయశాంతి సమాధానాలు

ప్రశ్న : ________________________________

________________________________

పంపిన వారి పేరు : ________________________________

పూర్తి చిరునామా : ________________________________

# అభిమాన తారలపై అభిప్రాయం

తెలుగు చలన చిత్రసీమలో "ధ్రువతార"గా వెలుగొందుతున్న రెబల్ హీరో, రారాజు "కృష్ణంరాజు" నా అభిమాన నటుడు. ఆయన నటించిన "అమరదీపం" నాకు నచ్చిన చిత్రం. ఎటువంటి క్లిష్ట పాత్రలోనైనా జీవిస్తూ, తన "విశాలనేత్రాలు"తో ఎటువంటి భావాన్నయినా ప్రదర్శించగలవారు, సినీ ఫీల్డులో కృష్ణంరాజు తప్ప



మరెవరూ లేరంటే అతిశయోక్తి కాదు. మొన్నటి "భక్తకన్నప్ప"గా, నిన్నటి "బొబ్బిలి బ్రహ్మన్న"గా, నేటి "తాండ్రపాపారాయుడు"గా కృష్ణంరాజు గారి విశ్వరూపం తెలుగు సినీ ప్రేక్షకులు ఎవరూ మరచిపోలేరు. ఈ సంవత్సరము సంభవించిన గోదారి వరదలకు గురైన ఎంతో మంది నిరుపేదలకు, అభాగ్యులకు, రక్షణ కల్పించి పది లక్షల రూపాయలు ఖర్చు పెట్టటం మా "ధర్మాత్ముడు" ఔదార్యానికి, వారి అభిమానిగా నేను గర్వపడుతున్నాను. కళాతపస్వి కె. విశ్వనాథ్ గారి దర్శకత్వంలో కృష్ణంరాజు గారిని చూడాలని ఆకాంక్ష.

-జె. శ్రీరమణ, ఖమ్మం

★ ★ ★

అశేష ప్రేక్షకులకు తన నటనాచాతుర్యంతో అలరించే అందాల ముద్దుగుమ్మ నా అభిమాన నటి విజయశాంతి.

నేటి భారతం చిత్రంతో చిత్రసీమలో విజయభేరి మ్రోగిస్తూ, అనేక క్లాస్, మాస్ ప్రేక్షకులను ఆకట్టుకొనే విధంగా ఛాలెంజ్, దేశోద్ధారకుడు,



అరుణకిరణం, రేపటిపౌరులు చిత్రాలలో నటించి, తెలుగు చలన చిత్ర సినీలాకాశంలో అరుణకిరణమై ప్రకాశిస్తూ, ఉత్తమనటి, సూపర్‌స్టార్‌గా వెలుగొందుతూ, జాతీయ స్థాయి నటిగా పేరొందాలని ఆకాంక్షిస్తున్నాను.

నా అభిమాన నటి విజయశాంతి గార్కి మనవి. విజయశాంతి తన పాత్రకు తాను డబ్బింగ్ చెప్పి, ఎవర్‌గ్రీన్ హీరో ఎ. ఎన్. ఆర్. గారి సరసన నటించాలని నా కోరిక.

-యమ్. నాగతిరుమలరావు

టి. నగర్, బాపట్ల

★ ★ ★

నా అభిమాన హీరో నందమూరి బాలకృష్ణగారు. అతను నటించిన చాలా చిత్రాలు ఒకే లాగుంటున్నాయి. ఉదా:- పట్టాభిషేకం, సీతారామకళ్యాణం, ముద్దుల కృష్ణయ్య, మంగమ్మగారి మనవడు, అనసూయమ్మగారి అల్లుడు... ఇలా వ్రాస్తూ పోతే ఇంకా ఎన్నో వున్నాయి.

తండ్రిని మించిన తనయుడు అనిపించుకోవాలంటే ఇకముందు వివిధ రకాలైన పాత్రలు ధరించాలి. ఇప్పుడు ఆయన ఎలాంటి పాత్రలు ధరించినా ఢోకా ఏమీ లేదనుకోండి. కానీ నాలాంటి అభిమానులు ఎప్పుడూ ఒకే రకం వేషంలో చూడలేరేమోనని. మా కోరికను మన్నిస్తే మీరు ఆకాశం అంత ఎత్తు ఎదగగలరు, చూస్తూ ఉండండి.

అన్నట్టు మీరి మధ్య రాజకీయాలలోకి ప్రవేశించ



దలచినట్లు ఏదో పత్రికలలో వ్రాయగా చదివాను. దయచేసి ఇప్పుడప్పుడే అంత పని మాత్రం చేయకండి. ఇంకా కనీసం మిమ్మల్ని 2 దశాబ్దాల పాటైనా సినిమాల్లో నటించమని వేడుకుంటున్నాను. ఇక వుంటాను బాలకృష్ణా! కాదు ముద్దుల కృష్ణయ్యా! ఆహా(హ. కాదు "కలియుగ కృష్ణా!"

-శ్రీమతి ఎం. కృష్ణవేణి,

న్యూబోయిన్‌పల్లి, హైదరాబాద్

★ ★ ★

చిత్ర విచిత్ర సినీ జగత్తులో రాకెట్‌లా దూసుకెళ్తున్న "డేరింగ్", "డేషింగ్" అండ్ "డైనమిక్" హీరో చిరంజీవి నా అభిమాన నటుడు. అచిర కాలంలోనే అఖిలాంధ్ర ప్రజల అభిమానాన్ని చూరగొన్న నేటి మేటి యువ నటుడు చిరంజీవి. నటనలో నావెల్టీ, స్టెప్స్‌లో వెరైటీ చూపిస్తూ అతి తక్కువ కాలంలోనే సినీ పరిశ్రమలో అగ్రనటుల జాబితాలో చేరిన "చిరు" ఎంతైనా అభినందనీయులు. అతడు నటించిన "అడవి దొంగ" "కొండవీటి రాజా" "అభిలాష" "దొంగ" "ఛాలెంజ్" వంటి చిత్రాలు విజయవంతమైనా, "చిరు" చిరకాలం ప్రేక్షకుల హృదయాలలో నిలవాలంటే కథాబలము గల "విజేత" లాంటి కరుణరస చిత్రాలు, మరియు పాత్రలను ఎన్నుకొనేటప్పుడు జాగ్రత్త వహించి, నటించి అందరి మన్ననలను పొంది, ఎన్నో రికార్డులు తనవిగా చేసుకోవాలని అతని ప్రియమైన



అభిమానిగా నా అభిలాష. మరి నా కోరిక తీరుస్తారని ఆశిస్తున్నాను.

-యం. యస్. రాజేశ్వరి,

వెంగంపల్లె, చిత్తూరు

★ ★ ★

సుమధుర సుందర హాసిని "సుహాసిని" నా అభిమాన నటి. ఆమె మోములో నవరసాలు పలుకుతాయి. నటనలో ఆమెకు ఆమే సాటి. నాటి "కొత్త జీవితాలు" తో చిత్రరంగ ప్రవేశం చేసి నేటి వరకు మమ్మల్ని అలరిస్తున్న ఏకైక నటి "సుహాసిని".

"సింధుభైరవి"కి జాతీయ ఉత్తమ నటి అవార్డు అందుకుని ఈ ఏటి మేటి నటి అన్పించుకున్నారు.

"సిరివెన్నెల" లోని ఆమె పోషించిన మూగ కళాకారిణి పాత్రలో ఆమె జీవించినదనటం అతిశయోక్తి కాదు. ఆ పాత్ర ఆమె నట జీవితానికే కలికితురాయి.

ఆమె ఇకముందు కూడా అలాంటి కథాబలం ఉన్న



పాత్రలు ధరిస్తారని ఆశిస్తున్నాను. ఆమెను నాట్య కళాకారిణిగా చూడాలని నా ప్రగాఢ వాంఛ. ఆమె ఇకముందు కూడా ఎన్నో విజయాలు సాధించి అవార్డులు అందుకోవాలని నా ఆకాంక్ష.

కె. సీత,

సంగంజాగర్లమూడి (గుంటూరు)

అందాల తార, అద్భుత నటి విజయశాంతి నా అభిమాన నటి. నటనలో తనకు తానే సాటి అనిపించుకొన్న విజయశాంతి అంటే నాకు చాలా ఇష్టం. ఆమె నటించిన చిత్రాలన్ని చాలా వరకు చూసాను. 'ప్రతిఘటన' చిత్రంలో ఆమె నటించిన ఝూన్సి పాత్ర నాకు చాలా నచ్చింది. 'నేటి భారతం', అగ్నిపర్వతం, వందే మాతరం వంటి చిత్రాలలో ఆమె నటన అద్భుతం. ఇకముందు కూడా మంచి చిత్రాలలో నటించాలని, ప్రతి సంవత్సరం ఉత్తమనటిగా ఎన్నికవాలని నా కోరిక.

-గంగారపు నాగపార్వతి,
దొండపాడు (గుంటూరు)

★ ★ ★

నవతరం కోరే యువతరం రొమాంటిక్ హీరో అక్కినేని నాగార్జున, మొదటి చిత్రం "విక్రమ్" తోనే అఖిలాంధ్ర ప్రేక్షక హృదయాలను దోచుకున్నాడు. యాక్షన్‌లో తనకు తానే సాటి అని నిరూపించుకున్నాడు. ట్రాజిడీలో తండ్రికి తగ్గ తనయుడని, ఫైట్స్‌లో తండ్రిని మించిన తనయుడని అనిపించుకున్నాడు. మొదటి చిత్రంతోనే అగ్ర కధానాయకుల జాబితాలోనికి చేరిన ఏకైక నటుడు నవయువ సామ్రాట్ అక్కినేని నాగార్జున రానున్న అరణ్య కాండ, మజ్నూ, సంకీర్తన మొదలగు చిత్రాలతో విజయ పతాకాన్ని ఎగుర వేసి సినీలాకాశంలో ధృవతారగా వెలుగొందాలని ఆశిస్తున్నాను.

అభిమానిగా నా సలహా ఏమనగా కధకు ప్రాధాన్యతను యిచ్చే సినిమాలలో తమ పాత్రను అర్ధం చేసుకొని, పండిత,



పామరప్రేక్షకులను దృష్టిలో వుంచుకొని సన్ని వేశానుసారముగ యింకా చురుకుగా నటించాలని ఆశిస్తున్నాను.

-దాసరి విల్సన్‌బాబు, అజయనగర్,
మంగళగిరి

★ ★ ★

సినీ రంగానికే అలంకరణ వంటి వారు శోభన్‌బాబు గారు. సినీరంగానికే కాదు నటనకు కూడా అభరణం వంటివారు. నేను 'దీపారాధన' సినిమా చూచిన దగ్గర నుంచి నేను అతని అభిమానిని అయినాను. దీపారాధనలో చూపిన నటన, స్నేహం, త్యాగం నన్నెంతో ఆకర్షింప చేసినవి.

"నటభూషణ" శోభన్‌బాబుగారు దీపారాధనలాగ ఆరాధించబడి అభిమన్యుడిగా అవతరించి, మహారాజులా మన్ననలు అంది, దేవాలయంలా పూజింపబడి శ్రీవారులా గౌరవించబడి, బంధములా మన హృదయాలలోనే బంధించబడి రేపు సక్కనోడుగా విడుదల కాబోచున్నాడు. మరియు వెండి తెరపైకి పరుగులు తీస్తున్నాడు మన అభిమాన నటుడు శోభన్ బాబుగారు. 40 సార్లు ఉత్తమ నటుడుగా ఎన్నికై నటలోకానికే అపూర్వ ఖ్యాతిని ఆర్జించి పెట్టిన నట భూషణ శోభన్ బాబు గారికివే నా ప్రత్యేక గౌరవాభినందనలు!

- బి. బసవపున్నమ్మ, కందుకూరు □

సీరియల్



# సంకెళ్ళెవరికి?

## డాక్టర్ కొత్త రవీంద్రబాబు

(గత సంచిక తరువాయి)

రెండు రోజులలో జ్వరం పూర్తిగా తగ్గిపోయింది. భుజంమీద గాయం దాదాపుగా మానిపోయింది. చింటూ పూర్తిగా తెలివిలోకి వచ్చాడు.

ఆశ్చర్యంగా చూస్తున్న చింటూతో డాక్టర్ సుందరం "నువ్వు బతికి బయటపడుతున్నావంటే అందుకు నూటికి నూరుపాళ్ళు మీ ఆవిడ యాస్మిన్ కారణం!

రాత్రనక పగలనక నిద్రాహారాలు మాని నీకు సేవ చేసింది. తన రక్తం నీకు డొనేట్ చేసింది.

ఆమెకు నువ్వు ఆజన్మాంతం రుణపడి వుంటావు" అన్నాడు. సిగ్గుతో తలవంచుకున్నది రూప.

డాక్టర్ సుందరం అవతలకు వెళ్ళగానే "రాణీ! డాక్టరుగారు చెప్పిందంతా నిజమేనా? నన్నెందుకు బతికించావు?" అని అడిగాడు చింటూ.

ఆమె మాట్లాడకపోయేసరికి "అందుకే గాబోలు ఇన్నాళ్ళు నాకు నువ్వే కనిపిస్తు వచ్చావు జ్వరం మగతలో.

చెట్టియార్ ఇంటి నుండి వచ్చి తాత ఇంట్లో మంచంమీద పడిపోయాక ఏదో విపరీతమైన అలసట మగత, కండ్లు మూరుకు పోతున్నట్లు అనిపించింది. చీకట్లో లోతు తెలియని గోతిలో పడిపోతున్నాననిపించి విపరీతమైన భయమేసి వణుకు పుట్టేది. అప్పుడు ఎవరు జ్ఞాపకం వచ్చేవాళ్లో తెలుసా?

అమ్మా నాన్నా కాదు! బిజిలీ, మణికాదు. నువ్వే జ్ఞాపకం వచ్చావు! రాణీ రాణీ అని పిలుస్తూ నీ వంక చూస్తూ వుంటే గుండెలో ఏదో ధైర్యం కలిగేది" రూప చేతిని గుండెలమీద వుంచుకుని నిట్టూరుస్తూ అన్నాడు చింటూ.

మళ్ళీ "టైగర్‌ను పోలీసులు పట్టుకు పోవటం నా మేలు కోసమే అయింది! లేకపోతే నువ్వు నా దగ్గరకు వచ్చివుండేదానివి కాదు. గాయాలతో వాతం గమ్మి ప్రమాదంగా వున్న నన్ను ఇలా తీసుకునివచ్చి బతికించేదానివి గాదు".

చింటూకు పత్యం పెట్టించాడు డాక్టర్ సుందరం. రూప అన్నం తినిపిస్తుంటే చంటిపిల్లవాడిలా ఒకో ముద్ద తినసాగాడు చింటూ!

డాక్టరుగారి నర్సులుగాని వున్నప్పుడు తనను యాస్మిన్ అని పిలువమని చెప్పింది రూప. "మరి నా పేరేమిటి?" అని అడిగాడు చింటూ. అతని కంఠస్వరంలో కొంటితనం తొంగిచూచింది.

**జరిగిన కథ-12:** రూప కోసం తీవ్రంగా వెదకమని కాలముత్తుతో చెప్తాడు తంగవేలు. ఛమేలి, రూపలతో వేరే జిల్లాలో ఉన్న సుబ్రమణ్యం తాత దగ్గరకు చేరుతాడు చింటూ. కోటి చెట్టి ఇంట్లో దొంగతనం చేయాల్సిన బాధ్యతని చింటూకి అప్పగిస్తాడు సుబ్రమణ్యం తాత. రంగ, రూప, సారంగపాణి,అయ్యప్పలను కూడా తీసుకువెళ్ళి చెట్టి ఇంట్లో నగలు, డబ్బు దొంగలించుకుని వస్తాడు చింటూ. చెట్టి ఇంట్లో అల్సేషియన్ కుక్క చేసిన గాయాలవల్ల చింటూకి ప్రమాధకరమైన శీత జ్వరం వచ్చింది. చింటూ పరిస్థితి చూసిన రూపకు మనసులో భయం ఎక్కువయింది. చింటూని మధురకి తీసికెళ్ళి నర్సింగ్‌హోమ్‌లో ట్రీట్‌మెంట్ ఇప్పించింది రూప. చింటూ కొంచెం కోలుకోసాగాడు

"నీ పేరు రెహమాన్" అంటూంటే డాక్టరు సుందరం లోపలకు వస్తూ "ఏమిటమ్మా కొత్త దంపతుల్లా పేర్లు చెప్పుకుంటున్నారు" అన్నాడు.

చిలిపిగా తన వంక చూస్తున్న చింటూ వంక చూడలేక తల దించుకుంది రూప.

గాయం పూర్తిగా మానిపోయింది. జ్వరం రావడంలేదు! చింటూ ఇప్పుడు పరిపూర్ణ ఆరోగ్యవంతుడయ్యాడు. నడుస్తున్నప్పుడు కొద్దిపాటి ఆయాసం తప్ప అతనికి ఇంతవరకూ ప్రమాద పరిస్థితిలో పడి వున్నానని గుర్తు చేసే విషయాలేమీ లేవు!

ఇంత దూరం తీసుకువచ్చి రాత్రింబవళ్ళు సేవ చేసి ప్రాణాలు రక్షించిన రూపను మేలుకొని వున్నంతసేపూ తదేకంగా చూస్తుండేవాడు చింటూ.

"ఏమయ్యోయ్ అలా చూస్తున్నావు? మీ ఆవిడను ఎవరూ ఎత్తుకు పోరులే" అంది ముసలి ఆయా.

డాక్టరుగారి పర్మిషన్ తీసుకుని సుబ్రమణ్యంవాళ్ల వూరు బయలుదేరారు చింటూ, రూప. రూప బురఖా తగిలించుకున్నది.

చింటూ, రూప టాక్సీ నుండి దిగేసరికి తాత, సారంగపాణి, రంగ, అయ్యప్ప, ఛమేలీ, మణి ఇంకా ఆ గూడెంలో వున్న వాళ్లంతా నవ్వు ముఖాలతో చుట్టూ జేరారు!

ఛమేలీ ముందుకు వచ్చి ఒక్కసారిగా చింటూను కౌగలించుకుని "నా బాబే! మళ్ళీ నిన్ను చూస్తాననుకోలేదురా!" అంటూ కన్నీళ్ళు కార్చింది.

మణి కళ్లల్లో వింత కాంతి తళుకుమంటుండగా ఆత్రంగా అతని వంక చూస్తూ నిలబడిపోయింది, అతని కౌగిలింతలలోని పులకింతలను గుర్తుకు తెచ్చుకుంటూ!

సారంగపాణి "చూసావా చింటూ! ఇంత డబ్బు దోచుకుని వచ్చాం! మనకు అవసరమై ప్రాణం మీదకు వచ్చినప్పుడు డాక్టరు దగ్గరకు వెళ్లటానికి కూడా వీలుగాక పోయె! ప్రాణాలకు తెగించి రాణి నిన్ను మధుర తీసుకునివెళ్ళబట్టి బ్రతికావు! లేకపోతే ఏం జరిగేదో తలుచుకుంటేనే భయం పుడుతుంది" అనగానే అందరూ అవునన్నట్లు తలలూపారు

తాత 'రాణీ! యీ రోజు చింటూ బతికి వున్నాడంటే నీ చలవే! అన్నాడు

ఛమేలీ ఎక్కడ నుండి వచ్చావో! నిన్ను చూడగానే అనుకున్నా చింటూకు తగిన జోడీ అని! చచ్చేవాడిని బతికించి నా బిడ్డను నాకు దక్కించావు అంటూ రూప వళ్ళు ప్రేమగా నిమరసాగింది

మిగిలిన వాళ్లందరూ కూడా రూప చుట్టూ చేరి ఆమెతో అభిమానంగా మాట్లాడుతూ మధురలో జరిగిన విషయాలు తెలుసుకోసాగారు

ఎటుగూడి రూపమీద అందరూ చూపుతున్న వాత్సల్యాన్ని చూచి వోర్వలేకపోయింది ఒక్క మణి మాత్రమే!

అందరూ రూపను మెచ్చుకుంటున్నకొద్దీ మణి తనలో అసూయతో కుతకుతలాడిపోసాగింది!

"చింటూ నా దగ్గరనుండి తీసుకు పోవాలని చూసావో నీ పనిపడతా! చింటూ నావాడు" అని మనసులో అనుకుంటూ బుసలుపెట్టసాగింది

ఆ రోజంతా పండుగ వేడుక జరుపుకున్నట్లు జరుపుకున్నారు వూళ్లో జనం

అంతా! ఆడామగా తేడా లేకుండా సారా పట్టించి గాడిద మాంసంతో పలావు చేసుకుని తిని వూరి మధ్య సమతల ప్రదేశంలో గ్రామఫోన్ రికార్డు పాటకు అనుగుణంగా డాన్సుచేస్తూ సంబరం చేసుకోసాగారు.

రూప ఎవరూ చూడకుండా తన గ్లాసులో సారా అవతల వంపివేసి అందరితో పాటు తనూ వుత్సాహంగా వారి ఉల్లాసంతో పాలుపంచుకొంటూ గడిపింది.

తాత కొంతసేపవగానే చింటూని "ఇక ఇంటికి వెళ్లి విశ్రాంతి తీసుకో" అన్నాడు.

ఆ సమయం కోసమే చూస్తున్న మణి "రా చింటూ" అంటూ అతని చేయి పుచ్చుకొని తమ ఇంటి వైపు తీసుకువెళ్లింది. చింటూ మంచం పక్కనే చాప వేసుకుని పడుకుంది మణి.

అర్ధరాత్రప్పుడు ఎవరో పిలుస్తున్నట్లు శబ్దం అయితే లేచి కూర్చుంది మణి. వాకిలి దగ్గర ఎవరూ లేరు. పరకాయించి చూస్తే చింటూ "రాణీ! రాణీ!" అని పలవరిస్తున్నాడు.

అతని చేతిని తన రెండు చేతులలోకి తీసుకుని మృదువుగా నవరించసాగింది మణి.

చింటూ చివాలున లేచి కూర్చుని "నువ్వా?" అంటూ తన చేతిని ఆమె చేతి నుండి విడిపించుకుని అవతల వైపుకు ముఖంపెట్టి పడుకున్నాడు.

మణి మనసు కుతకుతలాడే అన్నపు కుండలా అయిపోయింది. నాలుగు రోజులలోనే రాణి చింటూకు ఏదో మందు పెట్టింది! దీనికి ఏదైనా విరుగుడు వేయాలి. చింటూకు రాణి అంటే విరక్తి కలిగేలా చేయాలి అనుకుంటూ నిద్రపట్టక చాపమీద అటూ యిటూ దొర్లసాగింది.

★ ★ ★ ★ ★ ★

తెల్లవారేసరికి జాకాల్ అరవముదు వచ్చాడని కలవరం బయల్దేరింది..తాత యింటి ముందు అరుగుమీద కూర్చుని వున్నాడు అరవముదు. సన్నగా తీగెలాటి శరిరం మిలమిల మెరుస్తుండే చిన్న కళ్ళు! తాటికాయ పీచులా అడచలుగట్టిన జుట్టు,కదనొక్కుకుపోయిన ముఖం, కొనదేలిన గడ్డం. చూడడానికి నక్కలా వున్నాడతను. చూపులకే కాకుండా జిత్తులమారి తనంలో కూడా సార్థక నామధేయుడు. అతన్ని స్వజనమే కాకుండా పోలీసులు కూడా జాకాల్ అని పిలుస్తారు.

వూళ్లో జనం అంతా క్షణాలమీద పోగయ్యారు. తాత అతన్ని "ఏరా గుంట నక్కా! అంతా బాగున్నారా?" అని అడిగాడు.

"బాగుంటే ఇల్లూ, వాకిలీ, పెళ్లాం బిడ్డలూ అందర్నీ వదలుకుని ఇలా బికారిగా వస్తానా?" అన్నాడు జాకాల్.



# సంకెళ్లు వరికి?

ఏమయింది? ఏమయింది అంటూ చుట్టూ మూగారు ఇంతలో చింటూ లేచి వచ్చి అరుగుమీద కూర్చున్నాడు

నెమ్మదిగా చెప్పసాగాడు జాకాల్ మొన్న రాత్రి కోవిల్‌పుత్తూరు బయట వూరికి పెడగా బాగ్యవంతుల యిల్లు వుంటే మ్రా మురావాళ్లం పదిమందిమి వెళ్లాము

ఇల్లు పెద్దది ఆవరణ దాదాపు ఎకరం వుంటుంది! దోపిడీకి వెళ్లే ముందే టెలిఫోన్ తీగలు కట్ చేసాము వెనకవైపు గేటు దగ్గర, ముందు గేటుదగ్గర ఇద్దరు ఇద్దరు కాపలా వుండి మిగిలిన ఆరుగురం లోపలకు వెళ్లాం!

అల్సేషియన్ కుక్కను పలుగుతో పొడిచి చంపి, ఇంటి తలుపులు తీయకపోతే పలుగుతో పగులగొట్టాం వాటి దుంపతెగ ముసలాడు రెండంగుళాల మందం టేకు చెక్కలతో తలుపులు చేయించాడు వాటిని పగులగొట్టేసరికి ఎక్కడలేని అలుపు వచ్చింది

లోపలకు వెళ్లి చూస్తే ఎక్కడా మనిషి అలికిడిలేదు గదులన్నీ వెదికి బీరువాలో దొరికిన డబ్బు నగలు మూటగట్టుకుని బయల్దేరబోతున్నాం! ఇంతలో గేట్ల దగ్గర శబ్దం, జీపులు వచ్చి ఆగాయి రెండు గేట్ల దగ్గర మనవాళ్లను పట్టివేసారు

నిముషాల్లో ఇంటిని చుట్టుముట్టి లౌడ్‌స్పీకర్‌లో లొంగిపొండి! లేకపోతే నిష్కారణంగా ప్రాణాలు కోల్పోతారు అని అరవసాగాడు యస్ ఐ

మనవాళ్లు అంత తేలికగా లొంగుతారా! మేం పగులగొట్టిన తలుపులనే మళ్లా దగ్గరకు వేసి వాటి కడ్డంగా ఇంట్లో వున్న బీరువాలనూ, కుర్చీలనూ పెట్టాం

కాని అంతమందిపడి తలుపులను తన్నుతుంటే అవి ఆగేటట్లుగాలేవు! వంట యింట్లో కిరసనాయిలుడబ్బా చూశాము డబ్బా మేడమీదకు తీసుకుని వెళ్లి వంట యింట్లో వున్న చిన్న సీసాలలో నింపి అగ్గిపుల్ల ముట్టించి పోలీసుల మీదకు విసరసాగాము సీసాలు బాంబుల్లా పేలి కొంతమంది పోలీసులు గాయపడ్డారు యస్ ఐ కి కోపం వచ్చి ఫైరింగ్ ఆర్డరు యిచ్చి స్వయంగా పిస్తోలుతో మాకేసి గురిచేసి కాల్చసాగాడు

నేను మేడ రెండో వైపు నుండి తప్పుకుపోవటానికి వీలవుతుందేమోనని వెళ్లాను చూడటానికి ఆ వైపున పోలీసులెవరూ కనపడలేదు మనవాళ్లకు చెబుదామని వెనుదిరిగాను! భయంకరమైన దృశ్యం కనపడింది

ఇంట్లో వున్నవాళ్లు కింద బాగంలో ఎక్కడో దొంగ గూడో స్థావరమో అమర్చుకున్నట్లున్నారు! మేము ఇల్లంతా పరిశీలనగా చూడకపోవటం ఎంత పొరపాటో అర్థం అయింది! బహుశా ఎయిర్‌కండిషన్డ్ రూములో ఫాల్స్ సీలింగ్‌లా కనపడేదాంట్లో దాక్కుని వుంటారు వాళ్లు మేము ఎప్పుడయితే పైకి వచ్చామో వాళ్లు వెళ్లి తలుపు కడ్డంగా వున్న వాటిని తీసివేశారు ఇంకేముంది పోలీసులు పైకి వచ్చి పిట్టల్ని కాల్చి చంపినట్లు చంపారు చేతులెత్తి దణ్ణం పెడుతున్నవాళ్లను కూడా నిర్దాక్షిణ్యంగా కాల్చివేసారు మేడమీద నుండి మేం విసిరిన కిరసనాయిల్ బుడ్లు వాళ్లను బాగా బాద పెట్టినట్లున్నయ్యి! గత్యంతరంలేక మేడమీద నుండి నీళ్ల పైపు పట్టుకుని పాకి కిందకు దిగి పారిపోయి వచ్చాను!

మేం వాళ్ల ఇంటి గేట్లో వుండగానే ఇంటి వాళ్లబ్బాయి గోడ దూకి పారిపోయి పోలీసులకు ఫోను చేశాడట

ఏమయితేనేం! శకునం మంచిదికాదు మనవాళ్లు అయిదుగుర్ని కాల్చి చంపారు గేట్ల దగ్గర చిక్కిన నలుగుర్ని చిత్రహింసలు పెట్టారని వూళ్లో జనం చెప్పుకున్నారు అంతేనా?

జాకాల్ ఏడి?' అంటూ మా వూరి మీద పడి దొరికినవాళ్లను దొరికినట్లు బాదిపారేసారు

అంతమంది ఒక్కసారి చనిపోయేసరికి మనవాళ్లంతా దిక్కుతోచక వుండిపోయారు గాని లేకపోతే పోలీసుల్ని గూడెంలో అడుగుపెట్టనిచ్చేవాళ్లేనా?

జట్టువాళ్లు సగంమంది చనిపోయి దిగాలుపడిపోయాను! కాని ఏం చేయను పాపిష్టి ప్రాణం రక్షించుకోటానికి ఇలా పారిపోయి వచ్చాను చెప్పటం అయేసరికి జాకాల్‌కు నిస్త్రాణ వచ్చినట్లుంది రూప నీళ్ల గ్లాసు తెచ్చి యిస్తే గడగడ తాగాడు

చుట్టూ చేరినవాళ్లంతా కోపంతో మండిపడిపోసాగారు ఎంత కిరాతకం!

చేతులెత్తి దణ్ణం పెడుతుంటే కాల్చి చంపుతారా?

ఎర్ర టోపీల వాళ్లని సున్నంలోకి ఎముకలేకుండా విరగ్గొట్టాలి

రొయ్యల్ని వేయించినట్లు వేయించాలి అంది చమేలీ

కానీ ఏం ప్రయోజనం? రూప గొంతు విని అంతా నిశ్శబ్దంగా వుండిపోయారు

మనం నలుగురు పోలీసుల్ని చంపవచ్చు! మరి పదిమందిని హింసించవచ్చు! కాని పదిమంది బదులు వందమంది వచ్చిపడతారు!

వాళ్లు మనల్ని నిర్దాక్షిణ్యంగా చంపారన్నాడే జాకాల్! నిజానికి అది వాళ్ల డ్యూటీ!

మనమో? నిష్కారణంగా ఇతరులమీద పడి దోచుకొంటున్నాం వెంటనే పుస్తెలివ్వలేదని గొంతు పిసికి చంపుతున్నాం! దాచుకున్న డబ్బు, నగలు ఆచూకీ చెప్పకపోతే నానా హింసలు పెట్టి చంపుతున్నాం!

ఇంత చేసి తెచ్చిన నెత్తురు కూడు మనకేమైనా వుపయోగపడుతున్నదా?

మొన్న చింటూకు ప్రాణంమీదకు వస్తే దొంగచాటుగా మారువేషంలో వెళ్లి వైద్యం చేయించుకు రావాల్సి వచ్చింది

జాకాల్ దగ్గర ఎంత డబ్బుంటేనేం? ఇవ్వాళ అతను చెట్ల వెంట పుట్టల






కీ కొనండి,
సింథాల్ పుచ్చుకోండి.
ఉచితం!

NEW
Action.Plus
KEY
BLUE DETERGENT POWDER
FREE
1 Kg.

50 Gms.
Godrej
NEW
CINTHOL
DEODORANT AND COMPLEXION SOAP

స్టాకు ఉన్నంత వరకే.

CHAITRA B G 418 TL

# సంకెళ్లెవరికి?

వెంట పరిగెత్తాల్సిన అవస్థ పట్టింది

ఛీ! మనదీ వొక బతుకులేనా? మాట్లాడడం ఆపి చుట్టూ చూచింది రూప ఎవరూ నోరు మెదిపి మాట్లాడటంలేదు! పరవాలేదు పరివర్తన దశలోనే వున్నారు వీళ్ళు అనుకుంది రూప

* * * * * *

పల్లె పక్కన చిన్న కొండ వున్నది కొండ ముందు చదును ప్రదేశం వున్నది రూప ఆ ప్రదేశంలోని ఒక బండరాయి మీద కూర్చుని ఆకాశంలో తిరిగే పక్షులను చూస్తున్నది! ఆమె మనసు గత కొద్ది రోజులలోగా జరిగిన సంఘటనలను నెమరువేసుకుంటున్నది

రాణీ! పిలుపు విని వులికిపడి చూసింది రూప

ఎదురుగా సారంగపాణి!

రాణీ! చాలా బాగా మాట్లాడావు! మన బతుకులెలాటివో అందరకూ తెలిసొచ్చేలా చేసావు!

నేను మాట్లాడినదాంట్లో అబద్ధమేమైనా వుందా?

లేదు కల్తీ లేని నిజం చెప్పావు

బజారులో ఎంగిలాకులకు పరిగెత్తే వూరకుక్క బతుకులు మనవి! మనని ఎవరూ దగ్గరకు జేరనివ్వరు'

ఇందాక జాకాల్ వచ్చినప్పుడు నువ్వు మాట్లాడిన మాటలు విన్న దగ్గర్నుంచీ మనవాళ్ళు ఆలోచనలో పడిపోయారు! వాళ్ళల్లో చాలామందికి ఇలా నికృష్టంగా బతకడం యిష్టంలేదు కాని ఆ మాటే పైకి చెప్పే ధైర్యం లేదు

ఇవ్వాళ నువ్వు మాట్లాడిన మాటలు వాళ్ళందరూ చాలాకాలంగా మనసులో అనుకుంటున్నవే!

కాని వృత్తి మానివేస్తే తర్వాత జీవించడం ఎలానో తోచడంలేదు వారికి

పోలీస్ ఐ జి కి వుత్తరం వ్రాద్దాం! మేము మారటానికి సిద్ధం మాలో యువతీయువకులకు ఉద్యోగాలిప్పించి రాష్ట్రం నలుమూలలా మాకు ఒకో వూరిలో ఒకటి రెండు కుటుంబాలుండేటట్లు ఏర్పాటుచేసి కుటుంబానికో చిన్న యిల్లు, రెండెకరాల పొలం అప్పజెప్పమనండి ఇప్పుడు మమ్మల్ని ఇతర ప్రజల నుండి వెలివేసి దూరంగా వుంచి అరుగో దోషులు అని వేలెత్తి చూపుతుంటే మేము మారటానికి అవకాశంలేదు!

మేమూ మనుష్యులమే! నవభారతదేశంలో సభ్య సమాజంలో సగర్వంగా తల ఎత్తుకుని తిరిగే అవకాశం కల్పించండి! అని వ్రాసి చూడు

రాణీ! ఎంత తెలివిగా మాట్లాడావు! ఈ రోజే నువ్వు చెప్పినట్లు వ్రాస్తాను! కాని రాణీ నీ మాటలు చూస్తే నువ్వు బాగా చదువుకున్న దానివని అర్థం అవుతున్నది ఎందాకా చదివావు?

అన్నీ బాగుంటే మెట్రిక్ పాసయి వుండేదాన్ని! ఇంతలో అయ్య పోయాడు! చదువాగిపోయింది!

ఆ రోజే సారంగపాణి రూప చెప్పినట్లు ఐ జి కి వుత్తరం వ్రాసాడు

నాలుగు రోజులలోనే తిరుగు జవాబు వచ్చింది! సారంగపాణి వుత్తరంలో వ్రాసిన విషయాలు గురించి శ్రద్ధగా ఆలోచిస్తున్నామనీ, ప్రభుత్వంతోనూ డిపార్ట్‌మెంట్‌లోని వారితోనూ చర్చించి అతనికి పూర్తి వివరాలతో జవాబు వ్రాస్తామని ఈలోపుగా దొంగతనాలు, డెకాయిటీలు మాని సద్వర్తనులై మెలగుతున్నట్లయితే వారి విషయమై అధికారులు సానుభూతితో పరిశీలిస్తారనీ వ్రాశాడాయన

ఉత్తరం చదువుకున్నాక సారంగపాణి సంతోషానికి మేరలేదు! రూప రెండు చేతులూ పట్టుకుని వూపుతూ–

రాణీ! వుత్తరం వచ్చింది మనం అనుకున్నట్లే వ్రాశాడాయన' అన్నాడు సంతోషంగా!

సారంగపాణి అలా రూప చేతులు పట్టుకోవడం, చనువుగా మాట్లాడడం దూరాన్నించి చూసాడు చింటూ! అతని ముఖం అప్రయత్నంగా మాడిపోయింది అతని వంకే చూస్తున్న మణి ముఖంలో ఆనందరేఖలు పొడసూపాయి

గుడెంలోని ప్రజలందర్నీ సమావేశపరిచాడు సారంగపాణి

ఎన్నాళ్ళిలా వెలివేసినట్లు బతుకుదాం? మనం కూడా మిగిలిన ప్రజలలో కలసిపోయి కష్టపడి పనిచేసి కలో గంజో తాగుదాము

ఐ జి దగ్గర్నుండి వుత్తరం వచ్చింది! మన అందరకూ సాఫీగా బతకడానికి తగు ఏర్పాట్లు చేయటానికి ఆలోచిస్తున్నామని వ్రాసాడాయన!

ఇక నుంచి దొంగతనాలు, డెకాయిటీలు మానెయ్యమని వ్రాశాడాయన!'

పోలీసుల్ని నమ్మొచ్చా! కన్నతండ్రి అని, బిడ్డ అని లేకుండా స్టేషన్‌లో పడేసి బాదుతారే! ఇంత అమాయకంగా మాట్లాడతావేంరా సారంగం అన్నాడు జాకాల్!

నమ్మక చేసేదేముంది? ఇంతకన్నా నికృష్టమైన జీవితాలు లేవు గదా! మనకు పోయేదేమున్నది? అన్నాడు సారంగపాణి

దొంగతనాలు మానితే మనకు తిండి ఎలా? మళ్ళీ అడిగాడు జాకాల్

"వయసులో వున్న వాళ్ళకు తగిన వుద్యోగాలిస్తారు! పెద్దవాళ్ళకు కుటుంబానికి రెండెకరాల పొలం, చిన్న యిల్లు యిస్తారు ఇప్పటిలా కాకుండా కష్టపడి పనిచేసి పొట్ట నింపుకుందాం?

"మనకెవరికీ చదువు రాదే! ఏం వుద్యోగాలొస్తాయి? అన్నాడు అయ్యప్ప

"ఇచ్చిన వుద్యోగంలో చేరి, తర్వాత కష్టపడి చదువుకుంటే ఇంకా మంచి వుద్యోగాలొస్తాయి" అన్నాడు సారంగపాణి

అప్పటివరకూ మాట్లాడకుండా వున్న రాణి మీరందరూ చదువుకోవాలంటే మార్గం వున్నది సారంగపాణి, నేనూ అంతో యింతో చదువుకున్నాము

సాయంత్రం పలకా బలపాలు తెప్పిస్తాను అందరూ రండి అక్షరాభ్యాసం చేసి చదువు మొదలెడుదురుగాని! అంది

కొంతమంది తలలూపారు కొంతమంది ఆలోచనలో పడ్డారు ఒకరిద్దరు మాత్రం అయిష్టంగా చూసారు

(ఇంకా ఉంది)



# గాంధీజి మతం

"నా మతానికి సరిహద్దులు లేవు. సత్యం, అహింసలపై,
నా మతం ఆధారపడినట్టిది. ఎవరినైనా ద్వేషించడాన్ని,
నా మతం నిషేధిస్తుంది. మతం ప్రజలను విడగొట్టడానికి కాదు –
అది వారిని కలపడానికే"

అదే మహాత్ముని మతం

## ప్రేమ, సహనాలే యదార్ధమైన మతం

davp/86/228

# వారఫలం

## 17-10-1986 శుక్రవారం మొదలు 23-10-1986 గురువారం వరకు

★ **మేషం:** వారమంతా శుభంగా ఉంటుంది పెద్దలతో గాని, ధనవంతులతో గాని లావాదేవీలుంటాయి చాల మందికి ప్రయాణాలుంటాయి, అత్యవసరంగా చేయవలసి రావచ్చు వ్యాపార రీత్యా అనుకూలత చెప్పదగిన వారం స్త్రీలకు సర్వవిధాలా అనుకూలం

★ **వృషభం.** విద్యా విధానంగా పెంపు గల వారం చాల మందికి దూర ప్రయాణాలు చెప్పుటకు అవకాశమున్నది ఆటపాటల్లో పవేశమున్న వారికి అనుకూలం కళారంగాన సదవకాశాలు లభ్యమవుతాయి స్త్రీలకు వస్త్ర సేకరణకు వాహన సేకరణకు అవకాశం గల వారం

★ **మిధునం:** స్థితి యందు పెంపు కనిపిస్తుంది రాజకీయవాదులకు అనుకూలం స్థిరాస్తి యందు పెంపు చేకూరుతుంది అనవసరంగా మిత్రులతో పేచీలు రావచ్చు మీ కృషి ఫలితానికి రాకపోవచ్చు స్త్రీలకు వారమంతా పనులతో హడావుడి క్రొత్త వస్తువులు కొనుగోలు చేయగలరు

★ **కర్కాటకం:** ఇంటికి వచ్చిన వారికి మర్యాదలు చేయుటలో కాలం గడచిపోతుంది అధికంగా డబ్బు ఖర్చు చేయవలసి రావటమే గాక వృధా కాలక్షేపం అవుతుంది కొందరు నూతన వృత్తులు చేపడుతారు ఉద్యోగంలో కొంత ప్రగతి ఏర్పడుతుంది స్త్రీలకు స్థిరాస్తి, సంబంధంగా చిక్కులు కొందరకు, వ్యయం కొందరకు చెప్పవచ్చు

★ **సింహం:** అలవాటుగా చేసే పనులందు కొంత యిబ్బంది ఏర్పడవచ్చు కృషి యందు లోపం కనిపిస్తుంది ఉద్యోగ రీత్యా కొందరకు యిబ్బంది ఏర్పడవచ్చు రాజకీయంగా యిబ్బందులు ఉంటాయి చిక్కినట్లే చిక్కి కళా సంబంధంగా కొన్ని అవకాశాలు జారి పోతాయి స్త్రీలకు వృత్తి యందు ప్రగతి, ఉద్యోగ సంబంధంగా కొంత పెంపు కనిపిస్తుంది

★ **కన్య:** అన్నివిధాలా మేలైన వారం. ధన సంబంధ చిక్కులుంటే నివృత్తి అవుతాయి ఉద్యోగ రీత్యా చిక్కులుంటే నివృత్తి అవుతాయి ఆదాయంలో లోపం కనిపిస్తుంది అధిక శ్రమకు గురి కావలసి రావచ్చు వ్యాపారం చేసే వారయితే కొంత ప్రగతి, అవసరమైన డబ్బు చిక్కుటకు అవకాశముంటుంది స్త్రీలకు తెలివితేటలు రాణిస్తాయి కళారంగాన అవకాశాలు లభ్యమవుతాయి, గ్రహించండి

★ **తుల:** ఇంకా మంచి రోజులు రాలేదని గ్రహించాలి. ఊరక తిరుగవలసిన అగత్యం కొందరకు ఏర్పడుతుంది రాజకీయంగా కలసి రాదు. చేసిన పనినే మరలా చేయవలసిన అగత్యం ఏర్పడుతుంది ఆశించిన విధంగా డబ్బు అందక పోవటంతో చిక్కులు స్త్రీలకు: ఉద్యోగ యత్నాలు ఫలిస్తాయి

★ **వృశ్చికం:** వ్యాపారం బాగా జరుగదని, లాభదాయకం కాదని మొదటనే గ్రహిస్తారు స్థిరాస్తి వ్యవహారాలు కొంత యిబ్బందిని కలిగిస్తాయి ఇండ్లు వాకిళ్లు చక్క దిద్దుకోవటంతో కొంత కాలయాపన జరుగుతుంది డబ్బు తీసికొన్న వారి వలన వత్తిడి ఏర్పడుతుంది స్త్రీలకు ఆయాసంతో, అధిక కృషితో గాని పనులు నెరవేరవు

★ **ధనుస్సు:** అనవసర ప్రయాణాలుంటాయి వ్యాపార సంబంధంగా కొందరకు అధిక శ్రమ కలుగుతుంది మిత్రులు కానివారుగా మారుటకు అవకాశం ఏర్పడుతుంది స్థిరాస్తి వ్యవహారాలు తల దిమ్మెత్తిస్తాయి రాజకీయంగా ఏమాత్రం మేలు గాదని గ్రహించాలి ప్రభుత్వ పరంగా రాదగిన డబ్బు ఈ వారం అందదు స్త్రీలకు రచనా విధానాన, కళారంగాన మేలుంటుంది

★ **మకరం:** నూతన వ్యాపారం చేయాలని కొందరకు గట్టి సంకల్పం కలుగుతుంది నూతన మార్గాన వృత్తి సాగించాలని కొందరకు అభిలాష ఏర్పడుతుంది వెనుక ముగించలేని గృహ వ్యవహారాలు ఈనాడు సానుకూలం చేసికోగలుగుతారు స్త్రీలకు ఉత్తమ మిత్రులు చేరుతారు ఇంటగాని, బంధువుల యింట గాని 'శుభం' జరుగవచ్చు

★ **కుంభం:** ఉత్తమ రాశి ఫలం అందుకొనుటకు యింకా కొంత కాలం పడుతుంది చేసే పని యందు కొంత ఆటంకం ఏర్పడవచ్చు రాజకీయంగా ఏ విధంగా మేలు జరుగదని గ్రహించాలి అశ్రద్ధతో, ఉద్రేకంతో కొన్ని పనులు గావించి, అనవసరం చిక్కులలో చిక్కుకొంటారు స్త్రీలకు నూతన వస్త్ర సేకరణకు, శ్రమించి బాగా సంపాదించుటకు అనుకూలం

★ **మీనం** వారమంతా మంచిగా ఉంటుంది శ్రమకరమైనా చక్కని ఫలితాన్ని అందుకోగలుగుతారు విద్యావంతుల మైత్రి ఏర్పడుతుంది ధనవంతుల సాంగత్యం ఏర్పడుతుంది వ్యాపారాన మంచి లాభం గడించే మార్గమున్నది స్త్రీలకు లాభదాయక విషయాలలో నష్టం వస్తుంది చిక్కిన అవకాశాలు జారిపోతాయి, అయినా శ్రమించక తప్పదు

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# చీకట్లోకి

కోమకొండ సత్యానంద్

బస్సు స్పీడుగా పరుగెడుతుంది....

ముందు అద్దంలోంచి కన్పిస్తున్న పౌర్ణమి చంద్రుడ్ని చూస్తూ ఆలోచిస్తున్నాడు నాయుడు...

నాయుడు పెద్ద కొడుకు గిరి... నాయుడు బంధువులంతా అతనిలాగే డబ్బున్న వాళ్ళే అయినా వాళ్ల పిల్లలెవరి నాలిక మీదా సరస్వతీదేవి చిన్న గీతైనా గియలేదు...

గిరి మాత్రం కాలేజీ వరకూ వచ్చాడు... డిగ్రి పాసయ్యాడు ... యూనివర్సిటీ సీటు కోసం అప్లై చేస్తే మొట్టమొదట రాకపోయినా సెకండ్ లిస్ట్‌లో వచ్చింది....

తన కొడుకుని చూసుకొని నాయుడు మురిసిపోతాడు, గర్వపడతాడు ... లక్ష్మీదేవితో పాటూ సరస్వతీదేవి కూడా తన ఇంట్లో కొలువు తీర్చిందని ఎంతో సంతోషపడతాడు... తన కన్న కొడుకైనా ఎందుకో గిరిని చూడగానే తన నాలికను జాగ్రత్తగా కదిలిస్తాడు ... శెలవులకు ఇంటికి వచ్చినప్పుడు అన్నీ జాగ్రత్తగా తనే దగ్గరుండి అమరుస్తాడు, ఎంత పంపమని వ్రాస్తే అంతా తిరుగు టపాలో పంపించేస్తాడు.. ఒక్కోసారి అడిగే మొత్తం వెయ్యి దాటినా – పెద్ద చదువులు కదా, ఖర్చువ్వద్ది మరి అనుకొని అడిగినంతా పంపించేస్తాడు.. సిగరెట్లు కాల్చడం తన కంట పడ్డా ఏమీ అనుకోడు, అనడు... మీ అబ్బాయి సిగరెట్లు కూడా నేర్చాడా నాయుడూ? అని ఎవరైనా అడిగితే – ఊరుకోవయ్యా, పని పాటా లేకుండా కుర్చీలో కాలి మీద కాలేసుకొని కూర్చునే మనవే చుట్ట మీద చుట్ట అంటిస్తుంటే, మరి వాడు పెద్ద చదువులు చదువుతున్నాడు. తల పట్టేసినప్పుడు సిగరెట్ కాల్చకపోతే ఆ తల పన్జెయ్యిద్దా? – అని ఎదురు ప్రశ్న వేసి కొడుకును సమర్థిస్తాడు...

కొడుకు చదువు పూర్తయిపోతే పెద్ద ఆఫీసరుద్యోగం వస్తుంది – దాంతో లక్షల కట్నం వస్తుంది... వెధవది అ ఆ లు రాని వెధవ, బావమర్ది కొడుక్కి మొన్న అరవై వేలు ఇచ్చేరు, గిరికి రెండు లక్షలైనా ఇవ్వకపోతారా? అనుకుంటూ ఉంటాడు....







నాయుడు ప్రక్కన సింహాచలం కూర్చొన్నాడు... అతను కూడా కిటికీలోంచి బయటకు చూస్తూ ఆలోచిస్తున్నాడు కొడుకు రాము గురించి...

రాము అతని ఒక్కగానొక్క కొడుకు ... రాముని ప్రసవిస్తూనే సింహాచలం భార్య కన్నుమూసింది.. అప్పటి నుండీ రాముని అతని గుండెల మీద పెట్టి పెంచుకున్నాడు... చిన్నప్పటి నుండీ చురుగ్గా తిరిగి, తనకి కిళ్ళీ కొట్లో సహాయపడుతూనే శ్రద్ధగా చదువుకొనే వాడు... రాముా క్లాసులో అందరి కంటే తెలివైనవాడని పించుకున్నాడు... తన కిళ్ళీ కొట్టు కొచ్చిన రాముా మాస్టార్లందరూ 'ఒక్కడైనా ఆణిముత్యంలాంటి వాడ్ని కన్నావోయ్ సింహాచలం!' అని అనేవారు... ఆ మాటకు సింహాచలం ఎంతో పొంగి పోయేవాడు... తనకు చదువు లేకపోయినా తన కొడుకుని చదివించుకుంటున్నానని గర్వపడే-వాడు... రాముని చూస్తుంటే సింహాచలానికి కడుపు నిండిపోయేది.. యూనివర్సిటీలో సీటొచ్చిందని రాముా సంబరపడుతుంటే సింహాచలం కూడా సంతోషపడ్డాడు... కానీ ఊరు వదిలి ఇంకో ఊరు వెళ్తున్న కొడుకుని చూసి కూతుర్ని అత్తారింటికి పంపుతున్న తండ్రిలా కంట తడి పెట్టుకున్నాడు...

"ఊరుకో నాన్నా! రెండు సంవత్సరాలేగా? సెలవులిచ్చిన ప్రతీసారీ నీ దగ్గరకు వచ్చేయనూ?" అని నవ్వుతూ అన్నాడు...

రెండేళ్ళు! ఏ తోడూలేని తను, ఉన్న ఒక్కతోడునూ వదలి రెండు సంవత్సరాలు ఉండగలడా?. పోన్లే, పెద్ద చదువులు చదివి పెద్దవాడౌతున్న వాడ్ని ఇక్కడ కట్టిపడేసి పాడు చేయడం ఎందుకు? అని అనుకొని తృప్తి పడ్డాడు....

"భోజనం, గది ఊరికే! ఫీజులు, ఖర్చులు మాత్రం నువ్వు పంపు ... నేను పది రోజులు ముందుగానే ఉత్తరం రాస్తున్లే!" అని అన్నాడు...

అడగిన దాని కంటె మరో ఇరవై ముప్పై రూపాయలు ఎక్కువే పంపేవాడు సింహాచలం....

## కార్టూన్లు పంపేవారికి మనవి

కార్టూన్లతోపాటు స్వంత చిరునామాగల స్టాంపులు అతికించిన కవరు పెట్టి సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ—3 అన్న చిరునామాకి టపాలో పంపాలి. వీటి పరిశీలనకు కనీసం 6 నుంచి 8 వారాలు పట్టవచ్చును. ఈలోగా, నేరుగా కాని, టపాలోగాని వీటిపై ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు ఉండదు కార్టూన్లు 'టపా'లో పోయినా, దారి తప్పిపోయినా సంపాదకుని బాధ్యత వుండదు ప్రత్యేక సంచికలకు కార్టూన్లు పంపేవారు కవరుమీద ఆ సంచిక పేరు ఉదహరించాలి. ఈ కార్టూన్లకి కూడా పై నిబంధనలు వర్తిస్తాయి.

—సం.





# చీకట్లోకి

చదువు పూర్తయిపోయాక రామూకి పెద్ద ఆఫీసరు ఉద్యోగం వస్తుంది ఆ తర్వాత తనకీ కిళ్ళీ కొట్టూ అక్కర్లేదు, ఈ దరిద్రపు బతుకూ అక్కర్లేదు వాడు పెద్ద పట్నంలో పెద్ద ఉద్యోగం చేస్తాడు పెద్ద బంగళా కారు ఆ బంగళాలో ఒక గదిలో ఓ మూల కూర్చొని కాలాన్ని వెళ్ళబుచ్చెయ్యొచ్చు ఊc, రామూకి పెద్దింటి పిల్ల పెళ్ళాం అవుతుంది వాళ్ళు సినిమాలోలా మంచి ఇదిగా ఉంటారు ఇంగ్లీషు మాట్లాడుకుంటారు కార్లో హాయిగా తిరుగుతారు ఇక్కడి నుండి కుటుంబ పరిస్థితే మారిపోతుంది ఇక ముందు ఈ వంశంలో బీదరికం అన్నది కన్పించనే కన్పించదు

ముందు జీవితం రంగుల కలలా ఊహించుకుంటున్నాడు సింహాచలం

ఇప్పుడు వాళ్ళిద్దరూ యూనివర్సిటీకి వెళ్తున్నారు మరో రెండు రోజుల్లో యూనివర్సిటీకి సెలవులు ఇస్తున్నారు ఆ విషయం గిరి, రాము తండ్రులకు ఉత్తరాల్లో వ్రాసారు

కలెక్టరాఫీసు పని మీద వచ్చే ముందు మా అబ్బాయి కూడా అక్కడే ఉన్నాడు కదా యూనివర్సిటీ చూసినట్టూ ఉంటుంది నాకు తోడు వచ్చినట్టూ ఉంటుంది మా వాడ్ని దగ్గరుండి తీసుకొచ్చినట్టూ ఉంటుంది అన్నాడు నాయుడు సింహాచలంతో మొదట సింహాచలం తటపటాయించాడు విషయం ఊహించి – ఖర్చు నేనే పెట్టుకుంటాన్లేవోయ్! అంతగా అయితే నీ కిళ్లీ కొట్టుకి ఈ రెండ్రోజుల్లో వచ్చే లాభం కూడా నేనే ఇస్తాన్లే' అని సింహాచలాన్ని బయల్దేరించాడు నాయుడు

బస్సు యూనివర్సిటీ దగ్గర ఆగింది నాయుడు సింహాచలం ఇద్దరూ బస్సు దిగారు

అక్కడ ఎవర్నో అడ్రసు కాగితం చూపించి ఈ హాస్టలు ఎక్కడ అని అడిగాడు నాయుడు అతను దూరంగా కన్పిస్తున్న హాస్టల్నేక దాన్ని చూపించాడు

అదేనోయ్ సింహాచలం మనవాళ్ళు ఉండే హాస్టలు అన్నాడు నాయుడు

హాస్టలంటే ఏమిటో తెలియలేదు సింహాచలానికి అయినా తెలిసినట్టుగా తలూపాడు

అంత పెద్ద ఇంట్లో తన కొడుకు ఉంటాడన్నమాట సింహాచలం సంతోషంతో ఉక్కిరిబిక్కిరైపోయాడు

హాస్టలు దగ్గర కెళ్ళి ఒక్కొక్క రూమ్ నంబరూ చూసుకుంటూ వెళ్తున్నాడు నాయుడు అతని వెనుక సింహాచలం ఆశ్చర్యంగా అన్నీ చూస్తూ నడుస్తున్నాడు

నలభై నలభై ఒక్కటీ నలభై రెండూ అదేనోయ్! ఆ చివరిదేనోయ్ మా వాడి గది రా! అన్నాడు నాయుడు

సింహాచలం ఆగలేక మా రామూ గది ఎక్కడ? అని అడిగాడు

ఎంత తొందరయ్యా కొడుగ్గురించి మా వాణ్ని అడుగుదాం ముందు నడు అన్నాడు నాయుడు

గిరి ఉండే గది వచ్చింది ఒక తలుపు జారవేసి, ఒక తలుపు కొద్దిగా తీసి ఉంది నాయుడు నెమ్మదిగా తలుపు తోసాడు

టేబిల్ లైటు వెలుతురులో గిరి బుద్ధిగా చదువుతూ కన్పించాడు నాయుడు గుండె ఆనందంతో పొంగిపోయింది ఎంత శ్రద్ధ వచ్చిందీ వీడికి? అనుకున్నాడు మనసులో నే

బాబూ గిరి!

ఆప్యాయమైన ఆ పిలుపుకు గిరి ఒక్కసారి వెనక్కి తిరిగాడు

ఆతృతగా నాన్నా మీరా? రండి ఇంత సడన్‌గా వచ్చారేమిటి? సింహాచలం బాగున్నావా? ఒక్క ఉత్తరం వ్రాయలేక పోయారా స్టేషనుకు వచ్చి నేనే దగ్గరుండి తీసుకొచ్చే వాడ్నిగా! రండి కూర్చోండి పుస్తకాలు సర్దేసి కుర్చీ చూపించాడు గిరి

కూర్చుంటాన్లేరా బోజనం చేసేసావా? కొంచెం చిక్కినట్టున్నావురా సరిగా తినడం లేదా? ఆ ప్రేమాభిమానాల ప్రశ్నల వర్షానికి గిరి నవ్వుకున్నాడు

సరేగానీ గిరీ రామూ గది ఎక్కడ? కొడుకును చూసుకుందామని తెగ ఇదైపోతున్నాడు సింహాచలం

నడు చూపించు

సింహాచలం మొగమాటంగా నవ్వాడు

రండి ఈ ప్రక్క వింగ్‌లో నే! రా, సింహాచలం

ఇద్దరూ గిరిని అనుసరించారు

రండి ఆ చివరిదే వాడి గది వెళ్ళండి

సింహాచలం పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళాడు వెనకాల నాయుడు, గిరి

ఆ గది గుమ్మం దగ్గరకు వెళ్లిన సింహాచలం ఒక్కసారిగా ఆగిపోయాడు ఆ దృశ్యం చూసిన సింహాచలం మెదడు మొద్దుబారిపోయింది

గదిలో కుర్రకారు గుంపు వాళ్ళ మధ్య రాము నోట్లో సిగరెట్టు చేతిలో పేకముక్కలు ప్రక్కనున్న టేబిల్ మీద విస్కీ బాటిల్ గ్లాసులు

ఐ పోయింది రా బాసూ ఇదిగో నీ ముక్క కళావరు తొమ్మిది! నేను మరీ అంత ఇదిగా తాగలేదు రోయ్! రామూ ఈజ్ గుడ్ అండ్ క్లవర్ బోయ్

సింహాచలానికి కళ్ళు భైర్లు క్రమ్మాయి తల తిరుగుతున్నట్లన్పించింది

★ ★ ★ ★

బోజనం పూర్తి చేసి లేచాడు రాము తలుపు మీదున్న తువాలు తీసుకొని చేయి తుడుచుకున్నాడు మౌనంగా

అంటు ఎత్తి కంచం బయట పడేసి రాము దగ్గరకు వచ్చాడు సింహాచలం బయటకు వెళ్ళిపోతున్న రాముని పిలిచి ఒరే రామూ! నిన్నో మాటడుగుతాను జవాబు చెప్తావ్రా? అన్నాడు

రాము ఆగిపోయి తండ్రి వైపు చూసాడు లాంతరు వెలుగులో సింహాచలం ముఖం ఉబ్బినట్టుగా ఉంది తండ్రి కళ్ళల్లో దైన్యం పొంగి పొరలే బాధ కన్న హృదయం చేస్తున్న రోద పసిగట్టాడు రాము

ఒరే ఎంత మారిపోయావురా? నువ్వు నిజంగా నా రామూవేరా? నేనున్నానని నేనెవరి కోసం ఉన్నానో నని నీకు గుర్తుందిరా? నిన్ను నా కడుపులో పెట్టుకొని దాచుకున్నానురా! కానీ నువ్వు ఆ కడుపునే కాల్చేసావు నా గుండెను చీల్చేసావు!

ఆ కంఠంలో నిండిపోయిన బాధ రగులుతున్న వ్యధ

ఏమిటి నాన్నా నువ్వంటున్నది?

ఒరే తెలియకే అడిగితే చెప్తాన్రా! నా నోటితో చెప్పింది వినాలనుంటే తప్పకుండా చెప్తాన్రా! నేను ఎవరి కోసం బ్రతికున్నానో ఎవరి బాగు కోసం అష్టకష్టాలూ పడుతున్నానో వాడే తప్పుదారి పడుతున్నాడు పెద్ద చదువులు చదివి నన్ను ఆశకు ఊపిరి కావు నాన్నా! ఈ చదువులు చదివేస్తే నాకు పెద్ద ఆఫీసరు ఉద్యోగం కాదు కదా చిన్న ప్యూను ఉద్యోగం కూడా రాదు మరి ఎందుకు చదువుతున్నావూ అని అడిగితే ఎందరో చెప్పే మామూలు జవాబే నేనూ చెప్పగలను నీ ఆశల్ని అడియాసలు చెయ్యను నా జీవితంలో ప్రతి రక్తపు బిందువూ నీ సుఖ సంతోషాల కోసమే ధార పోస్తాను పిచ్చి నాన్నా! నీకు ఏమీ తెలియదు నీ రక్తం నిండా అమాయకత్వమే! నా చదువు ఉద్యోగం కోసం కాదు ఉద్యోగ సమరంలో కనీసం పాల్గొనేందుకు!

నాన్నా! నేను ఇంతకంటె ఎక్కువ చెప్పలేను కాని ఒక్కటి ఉద్యోగాలు వచ్చేది చదువుల్తో కాదు తెలివితేటల్తో అంత కంటె కాదు లంచాలతో రికమండేషన్లతో! వాటిల్లో ఏదో ఒకటి మనం సంపాదించుకోవాలి ఆ ప్రయత్నంలోనే ఆ పొరపాట్లు నిన్న నువ్వు చూసిన గుంపులో ఒకడు మంత్రిగారి కొడుకు వాడు నాకు మాటిచ్చాడు వాళ్ళ నాన్న చేత రికమండ్ చేయించి ఉద్యోగం

ఏవే కామాక్షీ! సింహాచలం కొడుకు రాముగాడు లేడూ వాడు పిచ్చి త్రాగుబోతైపోయాడే ఒరే గిరి నువ్వు వాడితో కూడకు

అలాగే నాన్నా నేనెందుకు అలాంటి వాడితో తిరుగుతాను?

వడ్డించవే! ఇంకా నెయ్యి పోస్టలు తిండి ఎం తిన్నాడో ఏమో చిక్కి సగం అయిపోయాడు

చాలమ్మా!

తినరా నాయనా! ఛీ నాన్న సగం అయిపోయా వంటున్నారు నా కళ్ళకు మాత్రం ఆ సగంలో సగం అయిపోయినట్లు కన్పిస్తున్నావు నెయ్యి వేసుకో ఈ పాయసం తినరా! నీకిష్టమని కోడివేపుడు, ఇగురు రెండూ చేసాను అని కొసరి కొసరి వడ్డించింది తల్లి

అరగంటగ్గానీ భోజనం చేయడం పూర్తి కాలేదు చేయి కడుక్కోగానే తండ్రి పరుగున వెళ్ళి ఓ తువాలు తీసుకొచ్చి అందించాడు గదిలోకి దారి చూపించి మంచం మీద ప్రక్క సర్ది ఫ్యాన్ ఆన్ చేసాడు







ఉద్ధరిస్తాడనుకున్నవాడు పెద్ద పెద్ద అలవాటుల్లో ఆరితేరి పోయాడు ఈ రెండేళ్ళూ గట్టెక్కితే నువ్వు పెద్ద ఉద్యోగం చేస్తే నీ నీడలో బ్రతుకుదా మనుకున్న నాకు చుఱ్ఱున కాలే ఎండే మిగులు తుందేమోరా? నాకు నమ్మకం పోయింది ఆశ ఆరిపోయింది ఎవరో ఉద్ధరిస్తారనుకోవడం నా బుద్ధి పొరపాటు ఏడుపు పర్యంతం అయ్యాడు సింహాచలం

నాన్నా! ఏమిటి నాన్నా ఈ రోజిలా మాట్లాడు తున్నావ్?

వద్దురా నన్నింక మాట్లాడించకు నా కడుపు కాలిపోయింది

అర్థమైంది నాన్నా నువ్వెందుకు బాధ పడుతున్నావో!? నాకు తెలుసు చేసిన పనికి నేనూ సిగ్గు పడుతున్నాను , నేనూ బాధ పడుతున్నాను చేసిన పొరపాటు పనులకి నన్ను క్షమించు కానీ నాన్నా! నువ్వు నా మీద ఆశలు పెట్టుకున్నావనీ నీ ఆశే నేననీ నాకు తెలుసు కానీ ఈ చదువులు నీ ఇప్పిస్తానని ఆ మంత్రిగారు తలచుకుంటే నా చదువైపోయాక నాకు ఉద్యోగం వస్తుంది మనకో దారి కలుగుతుంది అందుకే వాడి స్నేహం పట్టాను వాడితో తిరుగుతున్నాను వాడి స్నేహానికి దూరమవ్వగూడదని వాడు చేసే పనుల్లో పాలు పంచుకుంటున్నాను నీకు తెలిస్తే బాధపడతావని తెలుసు తెలియకుండా ఉంటుందని అనుకున్నాను కానీ నీకు తెలిసి పోయింది నన్ను క్షమించు నాన్నా!

చెమర్చిన కళ్ళు తుడుచుకుంటూ బయటికి వెళ్ళిపోయాడు రాము

* * * *

గిరి భోజనం దగ్గరకు వచ్చి గాబరా అయిపోయాడు డైనింగ్ టేబిల్ నిండా వంటకాలు తల్లీ తండ్రి తన చెరో ప్రక్క నిల్చున్నారు

కూర్చొ బాబూ! తల్లిదండ్రుల కంఠం

గిరి కూర్చున్నాడు తల్లి వడ్డించడం మొదలు పెట్టింది

బాబూ గిరి! శుభ్రంగా పడుకో ఉదయం నీ నిద్రంతా తీరే వరకూ లేవకు అంతగా ఎక్కడికైనా వెళ్ళాలంటే ఇంకా పది రోజులుంటావు కదా మరి నేను వస్తానూ! అని తలుపులు దగ్గరగా వేసి వెళ్ళిపోయాడు

బయట భార్యతో కామాక్షీ! ఉదయం బాబును ఎవ్వరూ లేపకండి ఎంత సేపైనా వాడిని పడుకోనీండి రాత్రుళ్ళు నిద్ర మానేసి మరీ చదువుతున్నాడక్కడ అని చెప్పాడు నాయుడు

ఆ మాటలు గదిలో ఉన్న గిరికి విన్పిస్తున్నాయి గిరి చిన్నగా నవ్వుకున్నాడు

పిచ్చినాన్న! ఎంత పొంగి పోతున్నాడు? తను కూడ నిజంగా చదువుతున్నాననే అనుకుంటు న్నాడు నిన్న తనొచ్చినప్పుడు నేను చదువు తున్నది క్లాసు పుస్తకం కాదని తెలుసుకోలేక పోయాడు అని మనసులో అనుకొని సూట్‌కేస్ అడుగున దాచి పెట్టిన సెక్స్ పుస్తకాన్ని పైకి తీసి మంచం మీదవాలాడు ! □

## సీరియల్: నిశ్శబ్ద సంగీతం

### బెహరా వెంకట సుబ్బారావు

(గత సంచిక తరువాయి)

"ఏమ్మా! కిషోర్ బాబుకి కులాసాగా వుందా?

హాల్లో అడుగుపెడ్తూ చెల్లెల్ని అడిగారు రామనాదంగారు

ఆ ఎడుకొండలవాని దయ వల్ల బతికి బయటపడ్డాడు! అన్నారు సంతృప్తిగా

ఉదయం ఫోనులో ఉష చెప్పింది! ఓసారి చూసి పోదామని వచ్చా! అంటూ సోఫాలో ఆసీనులయ్యారు

వాడు అమ్మా అమ్మా అని ఒకటే ఏడుపు! ఎమైనా తేగలం గానీ అమ్మనెలా తేగలం చెప్పు!

నిట్టూర్చారు అనసూయమ్మ

అవును! నీకు కోడలవసరం లేకపోయినా రఘుకి బార్య అక్కర లేక పోయినా ఆ పసవాడికి తల్లి కావాలి! ఎత్తుకొని లాలించి బుజ్జగించే అమ్మ కావాలి!

ఉపోద్ఘాతం మొదలు పెట్టారు రామనాదంగారు

అన్నయ్య చెప్పదలచుకొన్న దేమిటో తనకు తెలుసు! ఆ విషయం తనయుని దగ్గర ఎత్తలేదు! వాడిని చూస్తే కడుపు చెరువై పోతుంది వాడెప్పుడూ రేణు ఫోటో ని చూస్తూ వుండిపోతాడు అన్నయ్య మాటల్ని వినిపించుకోనట్లుగా లేచి నిలబడి–

ఉండన్నయ్యా! వెంకాయమ్మ గారితో కాపీ తెమ్మని చెప్పి వస్తా! అన్నారు

కాఫీ వద్దమ్మా! యిప్పుడే బోజనం చేసి వస్తున్నా! చెల్లెల్ని ఆపారు రామనాదంగారు తిరిగి సోఫాలో కూర్చోక తప్పలేదు ఆమెకు

మొన్న మీ ఒదిన చెప్పిందనుకొంటా! రఘు బాబుని అడిగి చూసావా' అడిగారు

ఆమె మొహం వివర్ణమైంది

పెళ్లి విషయం ఎత్తితే వాడంత ఎత్తున లేస్తున్నాడన్నయ్యా! రేణు లేని లోటుని మరే పిల్లా తీర్చలేదని నా నమ్మకం!

ఖండితంగా చెప్పారు నిజానికి తనయునితో పెళ్లి ప్రస్తావన ఎప్పుడు తేలేదు అంత ధైర్యం లేదు

ఆడపిల్ల గలవాణ్ని అన్నయ్యని! తిరస్కరించినా దూషించినా పడాలి! మనం చిన్నప్పటి నుంచి అనుకొన్న సంబంధం దాని దురదృష్టం కొద్దీ అప్పుడలా జరిగింది ఇప్పుడైనా అడగదల్చుకోలేదు మీరు పడ్తున్న అవస్తలు చూసి అడుగుతున్నాం! రఘు బాబుని అడిగి చెబుతానన్నావుట! నీ నిర్ణయం అప్పుడే మీ ఒదినతో చెప్పి వుండాల్సింది! అమ్మ చనిపోతూ దాని చేతిలో నీ చేయి వేయించుకొంది జ్ఞాపకం తెచ్చుకో!

పౌరుషంగా దిగ్గున లేచారు రామనాదంగారు

అది కాదన్నయ్యా! ఏదో చెప్పబోతూండా చీకాగ్గా విన్పించుకోకుండా వెళ్లిపోయారు రామనాదంగారు

వారి సంబాషణంతా పక్కగా నిలబడి వింది వెంకాయమ్మ ఆయన బయటకు వెళ్లాక హాల్లోకి ప్రవేశించింది

అమ్మగారూ! నాకు తోచింది చెబుతా! విని ఆలోచించండి! అంది

చెప్పమన్నట్టు చూసారు అనసూయమ్మ

మీరు చూస్తే పెద్దవారై పోయారు! అనునిత్యం అనారోగ్యంతో బాద పడ్తున్నారు రఘు బాబుకి తోడూ కిషోర్‌కి తల్లీ ఈ యింటికి యిల్లాలూ చాలా అవసరం! బార్య మీదున్న మమకారం కొద్దీ ఆమెను మరువలేక పిచ్చి వాడవుతున్నాడు రఘుబాబు! బార్య పోయిన నెల్లాళ్లకే మళ్లీ పెళ్లి చేసుకొని హాయిగా జీవిస్తున్న వాళ్లెంతమంది లేరు! బార్య పోయిన వాళ్లంతా రఘుబాబులా మనసు పాడు చేసుకొంటున్నారా? మళ్లీ సంసార బందంలో చిక్కుకొంటే మామూలు మనిషవుతాడని నా నమ్మకం! పూర్వస్మృతుల నుండి విముక్తుడౌతాడు ఇలా ఆయన ఏకాంతంగా గడిపినంత కాలమూ వారికి మనశ్శాంతీ ఈ యింటికి ప్రశాంతీ వుండదమ్మా! ఒకసారి బాగా ఆలోచించండి! ఉషమ్మనే చేసుకోమని నేనడం లేదు! వారికి బార్య అవసరం లేకపోయినా ఇంటికి యిల్లాలు కావాలమ్మా

వెంకాయమ్మ మాటలు సబబుగానే తోచాయి అనసూయమ్మకు ఆ విషయం తనకు తెలియనిది కాదు రఘుబాబుని మళ్లీ పెళ్లికి ఒప్పించడమే పెద్ద సమస్య ఎలాగైనా అతని చేత ఊ! అనిపింప చేయాలని నిశ్చయించుకొన్నారు

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి

కిషోర్ని ఎత్తుకొని మేడ దిగి వచ్చింది ఉష

అత్తయ్యా! నాన్న గారొచ్చినట్టున్నారు! అంది

ఉషను పరీక్షగా చూసారు అనసూయమ్మ ఆణిముత్యంలా అగుపించింది కిషోర్ ఆమె చెంపల్ని రాస్తూ అంటుకొని పోయాడు ముద్దు పెట్టుకొంటున్నాడు

ఉష తన కోడలై యిలా మనవడితో యీ యింట్లో తిరుగాడ్తూంటే ఎంత బావుణ్ను! అనుకొన్నారు

అవునమ్మా! ఎదో పని మీద యిటు వచ్చాడుట చూస పోదామని యిక్కడి కొచ్చి వెళ్లాడు! అన్నారు

★ ★ ★ ★

ఎప్పటిలా ఆ వుదయం కూడా కాపీ తీసుకొని బావ గదిలోకి వెళ్లింది ఉష

డ్రెస్సింగ్ టేబిల్ ముందు కూర్చొని రేణు ఫోటో ని చూస్తున్నాడు రఘు

కాపీ తెచ్చా! టీపాయ్ మీద కాపి వుంచి వెనక్కి తిరిగింది ఉష

రఘు వెనక్కి తిరిగి ఉషా! పిల్చాడు

**జరిగిన కథ-10** రేణు లేని జీవితం నిస్సారంగా తయారయింది రఘుకి రఘు కొడుకు కిశోర్‌ని చూసుకోడానికి రామనాదంగారు తన కూతురు ఉషను తీసుకువస్తారు రఘుని దారిలోకి తెచ్చే పూచీ తనదని అనసూయమ్మకి ధైర్యం చెప్తారు రేణుని తనొక బ్రోతల్ హవుస్‌లో కలియడం తటస్థపడిందని ఆమెను విడిపించే ప్రయత్నంలో రఘుకి సహాయపడగలనని తులసీరాం అనే అతను రాసిన ఉత్తరం అందుకుని విషయం తల్లికి కూడా చెప్పకుండా కంపెనీ పనిమీద బొంబాయి వెళ్తున్నానని చెప్పి బయలుదేరాడు రఘు కానీ రేణుక ఉన్న జైపూర్ ట్రూప్ ఆ ఊరు వదలి వెళ్లిపోయిందని తెలుసుకున్న రఘు షాక్ తిన్నాడు రఘుకి ధైర్యం చెప్పి అనునయించాడు తులసీరాం రఘు తిరిగి హైదరాబాద్ చేరాడు

బావ కెదురు పడే అవకాశాన్ని బాగా తగ్గించుకొని ఆ యింట్లో మసల్తోంది ఉష. ఎదురు పడినా యిద్దరూ ఎప్పుడూ మాట్లాడుకోరు! తప్పనిసరైతే ఆ మాటలు చాలా పొడిగా వుంటాయ్. సంభాషణలు పొట్టిగా వుంటాయ్. బావ తనను పిలవడంతో ఆశ్చర్యపోయింది ఉష. వెనక్కి తిరక్కుండా, అడుగు ముందుకి వెయ్యకుండా గుమ్మంలో నిలబడి పోయింది.

"ఉషా!" మళ్ళీ పిల్చాడు రఘు.

ఉష వెనక్కి తిరిగి రెండడుగులు వేసి ఆగింది.

"అలా కూర్చో!" కుర్చీ చూపించాడు.

ఉష కూర్చుంది. అతను కాఫీ తాగుతూంటే గదిలో గోడకున్న చిత్రపటాలనూ, ఆయిల్ పెయింట్స్‌నీ చూస్తూ వుండిపోయింది ఉష. కాఫీ పూర్తి చేసి 'ఉషా' అని మరలా పిల్చాడు అతను.

"చెప్పు బావా!" అంది ఆ అయిల్ పెయింట్స్ వైపే చూస్తూ. గోడకి రెండు ఆయిల్ పెయింట్స్ సీనరీస్ వున్నాయ్.

ఒకటి – ఎడారిలో వంటరిగా ఒంటె మీద ప్రయాణం!

రెండోది :–క్షితిజంలో సూర్యోదయం!!

చాలా అద్భుతంగా వున్నాయ్.

"ఇటు చూడు! నా కళ్ళలోకి!" అన్నాడు రఘు.

అతని మాటలకి ఉలిక్కి పడింది ఉష. భయంగా అతని వైపు తిరిగింది. అతని కళ్ళలోకి చూసింది.

"నన్ను పెళ్ళి చేసుకొంటావా?"

ఆ అభ్యర్థనకి ఆశ్చర్యపోయింది. అలా అడుగుతాడని తానెప్పుడూ వూహించలేదు! మరుక్షణంలో తల వంచుకొంది. జవాబు చెప్పలేదు. "చెప్పు ఉషా!" నిగ్గ దీసాడు.

ఆ పూట అతనలా ఎందుకు ప్రవర్తిస్తున్నాడో అర్థం కాలేదు ఆమెకి. తల ఎత్తకుండానే యిష్టం లేనట్లుగా అడ్డంగా తల వూపింది.

"ఎందుకని?"

ఆమె మాట్లాడ లేదు. ఆమె చుబుకం పట్టుకొని పైకెత్తాడు రఘు.

ఆమె కంటి వెంట నీరు ధారాపాతంగా కారుతోంది.

"లేదు బావా! నాకా వుద్దేశం లేదు!" ఆమె గొంతు జీరపోయింది. ఆశ్చర్యపోవడం రఘు వంతైంది.

"పోనీ మీ అమ్మకీ నాన్నకీ యిష్టమేనా?"

"............."

"అందుకేగా నిన్నిక్కడకి పంపింది?" ఆవేశపడ్డాడు.

"వాళ్ళందుకే పంపారంటావా బావా?" అమాయకంగా, అతి నెమ్మదిగా అడిగింది. అతనిలో ఆవేశం తగ్గలేదు.

"కాకపోతే ఎందుకు? రేణు చచ్చిపోయిందని మీ అందరి అభిప్రాయం! వగలు కురిపించి వయ్యారం వలక బోసి ఆకర్షించేలా చేసుకోమని నిన్ను పంపారు! అవునా?"

బావ అభిప్రాయానికి విలవిల్లాడింది ఉష.

"కాదు బావా! ముమ్మాటికీ కాదు! నా పేరంట్సు అభిప్రాయం ఏమిటో నాకు తెలీదు! నేనా వుద్దేశంతో రాలేదు బావా! నా మాట నమ్ము! మనవడ్ని అత్తయ్య సాక లేకపోతోందని, సాయంగా వుండమని అమ్మా నాన్నా అంటే యిష్టం లేకపోయినా వచ్చా! అంతేగానీ నీవనుకొన్నట్లుగా నన్నాకర్షింప జేసుకోడాని క్కాదు! నా మాట నమ్ము!"

"లేదు! అందుకే వచ్చావ్!" అని అతను దృఢంగా మరోసారి అనడంతో రోషం ముంచుకొచ్చింది ఉషకి.

"బావా అటు చూడు! ఆ రెండు పెయింటింగ్సు చాలా అద్భుతంగా వున్నాయ్." గోడ వైపు చూపింది ఉష. రోజూ చూస్తున్నవే అయినా మరోసారి చూసాడు రఘు.

"ఆ బాటసారి వంటరిగా ఒంటె మీద ప్రయాణం చేస్తున్నాడు ఎడారిలో. అమితమైన దాహంతో ముందు కనబడే ఒయాసిస్ వైపు వెళ్తున్నాడు. ఒకప్పుడు సస్యశ్యామలమై వుండిన మైదానాలు ప్రకృతి వైపరీత్యాల వల్ల భయంకరమైన అనంతమైన ఎడారిగా మారిపోయాయ్! నా బతుకు కూడా అంతే అయింది బావా! ఒకప్పుడు నిన్నమితంగా ప్రేమించాను. నీ సాక్షాత్కారం కోసం పరితపించే దాన్ని! నీతో కలకాలం కల్సి జీవించాలని వువ్విళ్ళూరేదాన్ని! కలలు కనేదాన్ని! ఆ కలల్లో నీ సాన్నిధ్యంలో పరవశించి నర్తించేదాన్ని. కానీ...... కానీ..... ఏవో దుష్ట శక్తులు..... నాలో ప్రవేశించాయ్! నందనవనం లాంటి నా జీవితం భయంకరమైన ఎడారిలా మారిపోయింది! విధి వక్రించి, అమానుషంగా నీ భార్యను నీకు దూరం చేసింది! ఎప్పటికైనా తిరిగి వస్తుందనే ఆశతో ఎదురు తెన్నులు చూస్తూ గడి యొక యుగంలా గడుపు తున్నావ్! అమితమైన దాహంతో ఒయాసిస్ వైపు పయనించే బాటసారి లాంటిది నీ జీవితం!.... " అని





ఆగింది.

అవాక్కయి ఆమె మాటలు వింటున్నాడు రఘు. ఆమె మరలా మాట్లాడ్డం మొదలు పెట్టింది.

ఆ రెండోది చూడు బావా! క్షితిజంలో సూర్యోదయం! భూమ్యాకాశాలు కల్సి



## నిశ్శబ్ద సంగీతం

వున్నాయి అన్న యిబ్యాషన్‌తో బాటు ఆహ్లాదాన్ని ఆనందాన్ని కల్గిస్తోందా దృశ్యం అదంతా వట్టి భ్రమ అని తెల్సి కూడా ఆ దృశ్యాన్ని చూసి ఆనందిస్తున్నాం భూమ్యాకాశాలు ఎక్కడా ఎన్నడూ కల్సుకోవని నిరూపిస్తూ ఆ కర్మసాక్షి తన కాంతి పుంజాన్ని వెదజల్లుతూ మన అజ్ఞాన చీకట్లను పార దోలుతున్నాడు అయినా తిరిగి భ్రమలో పడుతున్నాం' మనలో ఒకరు భూమి - వేరొకరు ఆకాశం' ఆ రెండింటి సంగమం ఎంత సంభవమో మనిద్దరి కలయిక కూడా అంతే బావా' మన పెద్దలు మనల్ని కలపాలని కలుపగలమనీ భ్రమిస్తున్నారంతే' అంతే బావా' ఆమెలో నిరాశా నిస్పృహలు పెల్లుబికాయి

ఆమె స్వరం గద్గదమైంది మొహం స్వేద బిందువుల్తో నిండి పోయింది

తన తొందర పాటుకి సిగ్గు పడ్డాడు రఘు ఆ తర్వాత పశ్చాత్తాపం పొందాడు

అయితే నీకా వుద్దేశం లేదా? అతి నెమ్మదిగా అడిగాడు

లేదు బావా' కలలో కూడా నిన్ను నా చెలికానిగా వూహించుకోలేను' ఇప్పటి నా పరిస్థితి వేరు' నీ పాదాల సాక్షిగా చెబుతున్నా' ఏడుపును దిగ మింగుకొంటూ అతని పాదాల మీద వాలింది ఆమెను లేవనెత్తాడు రఘు కళ్లను పైట చెంగుతో తుడుచుకొంది

ఉషా' పిల్చాడు వాత్సల్యంగా

చెప్పు బావా' నిర్మలంగా అంది

తమ పిల్లల భవిష్యత్తు గురించే తలి దండ్రులు ఆలోచిస్తూ వుంటారు ఈ లాంటి పరిస్థితుల్లో తన కూతురు జీవితం స్థిరపడాలనీ సుఖ పడాలనీ నీ తలిదండ్రులు ఆశించడంలో ఆశ్చర్యం లేదు తన కొడుకుని ఏకాకిని చేసి పోవాల్సి వస్తుందేమోనని మా అమ్మ బెంగతో మంచం పట్టింది ఈ స్థితిలో పెద్దలు మనిద్దరికీ వివాహం జరిపించాలని ప్రయత్నిస్తున్నారు' అవునా?

అవును బావా'

వారి ఆశాసౌధ నిర్మాణం పూర్తి కానయకూడదు' నిర్మాణం పూర్తయి ఆ సౌధం ఒక్కసారి నేల కూలితే ఆ షాక్‌కి వారు తట్టుకోలేరు అందుకని దయచేసి మీ యింటికి వెళ్ళు' నన్నపార్థం చేసుకోకు ప్లీజ్' బ్రతిమాలాడు

అలాగే బావా' తప్పకుండా వెళ్తా' బాబుకి నయం అయిన వెంటనే పోతా' జీవితంలో యింకెప్పుడూ నీ కెదురు పడను'

బటబటా కారే కన్నీరొత్తి నిష్క్రమించింది ఉష ఆమె మనసు నొప్పించి నందుకు బాధ పడ్డాడు రఘు

* * * * * * * *

అబ్బాయి ఆఫీసు కెళ్ళబోతూంటే వెంకాయమ్మ ద్వారా కబురు పంపారు అనసూయమ్మ రఘు తల్లి గదిలోకి వెళ్లి -

ఏమ్మా' పిల్చావట! అడిగాడు

అవును బాబూ' కిషోర్‌కి నయం కాగానే దర్శనానికి పంపుతానని ఆ ఏడుకొండల వానికి మొక్కు కొన్నా వాడు తేరుకొన్నాడు ఆ మొక్కు తీర్చాలి బాబూ' –

అలాగేనమ్మా' తప్పకుండా తీరుద్దాం'

మొక్కుబడులు ఆలస్యం చేయకూడదు బాబూ' వెంట వెంటనే తీర్చాలి' వెనక వేస్తే భగవంతుడు పరీక్షిస్తాడు' నాలుగు రోజులు శలవు పెట్టు బాబూ' తొందర చేశారు

ఇదివరలో ఒక సారి వాడికి జ్వరం వస్తే రేణు యిలాగే మొక్కు కొందమ్మా' మేమిరువురం వెళ్లి వాడి మొక్కు తీర్చాలనుకొన్నాం'

చూసావా' ఆ మొక్కు అలా వుండిపోబట్టే భగవంతుడు మళ్లీ పరీక్ష బెట్టాడు ప్రాణం మీదకి వచ్చింది' ఇప్పడైనా ఆలస్యం చేయకుబాబూ' ఏలవిల్లాడింది తల్లి

వాడి తల్లి కూడా వుండాలి కదమ్మా'

వాడికంత అదృష్టం లేదు బాబూ' ఆ తల్లి ఎక్కడుందో ఎలా వుందో అసలు ప్రాణాల్తో వుందో లేదో'

అమ్మా' గట్టిగా బాధగా అన్నాడు రఘు

అది కాదురా నేననేది' రేణు ఎప్పుడు వస్తుంది? అసలు రాగలదంటావా? మళ్లీ మనిల్లు కలకల్లాడుతుందంటావా? అడిగారు ఓదార్పుగా

తప్పకుండా వస్తుందమ్మా' రేణు వచ్చాకే వాడి మొక్కు తీరుస్తాం' దయచేసి ఈ విషయం మరోసారి ప్రస్తావించకమ్మా' ఆ భగవంతుని మీద నాకు పూర్తి విశ్వాసం వుంది ఆమె తప్పకుండా వస్తుంది' అబ్బాయిని స్వయంగా తీసుకెళ్లి దైవ దర్శనం చేయిస్తుంది'

అదే బాబూ నేను కోరుకొనేది' నీ మౌన ముద్ర చూస్తుంటే నాకడుపు తరుక్కు పోతోంది' నీ కొడుకు ఆగడాల్తో వేగలేక పోతున్నా' ఉష వాళ్లింటికి వెళ్లి పోతానంటోంది'

వెళ్తానంటోందా? సాలోచనగా అడిగాడు

పెళ్లికాని పిల్ల పరాయి యింట్లో యేంత కాలం వుంచుతారు బాబూ' అలా వుంచుకోవడం మనకే మంచిది కాదు' కిషోర్‌కి సులువుగా వుండే వరకూ ఉంటానంది' వాడు కులాసాగా వున్నాడు వెళ్తానంటోంది'

పోనీ వుండమన లేక పోయావా?

చెప్పాను కదు బాబూ' పెళ్లి కాని పిల్లని పరాయి యింట్లో వుంచడం వాళ్లకి యిబ్బందిగానే వుంటుంది' అది వుంటే నాకు చాలా సౌఖ్యంగా వుంటుంది' మరోసారి అడిగి చూస్తా' అయినా ఎంత కాలమని వుంచుకొంటాం'

మరి నే వస్తానమ్మా అంటూ కంపెనీకి బయలు దేరాడు రఘు

ఎవిటో పిచ్చి నాగమ్మ' అది బతికుందో లేదో తెలీదు' బతికుంటే ఎందుకు తిరిగి రాదు' అనుకొన్నారు

* * * * * * * *

రమ వారం తప్పించి వారం ప్రతి శనివారం రాత్రికి వచ్చి సోమవారం వుదయం వెళ్తుంది అప్పుడప్పుడు శశిధర్ కూడా వస్తూ వుంటాడు ఆమె అత్తమామలు సహృదయులు కాబట్టి ఆమెను పంపిస్తారు రమ వున్న రెండు రోజులూ అనసూయమ్మకు పూర్తి రిలీఫ్

ఆరోజు బుధవారం రమ పెట్టి బెడ్డింగ్‌తో రావడం చూసి ఆశ్చర్య పోయారు అనసూయమ్మ

మీ అల్లుడు గారు ట్రైనింగ్‌కి కలకత్తా వెళ్లారు రెండు నెలలు పోయాక గానీ రారు' నన్నిక్కడ వుండమన్నారు చెప్పింది రమ

మీ అత్తగారు వెళ్ళమన్నారా? అనుమానంగా అడిగారు అనసూయమ్మ

ఆమె కూడా వెళ్ల మంటేనే వచ్చానమ్మా'

తృప్తి పడింది తల్లి

రా రమా' నువ్ వచ్చావ్' అత్తయ్యకి కాలక్షేపం' నీ మేనల్లుడ్ని నీ కప్పగించి నే రిలీవ్ అవుతా' ఆప్యాయంగా పలకరించింది ఉష

నే వస్తే నువ్ వుండకూడదా? అడిగింది రమ కిషోర్‌ని తన చేతుల్లోకి తీసుకొంటూ



ఉండొచ్చనుకో అంటూ నానుస్తూ

అభ్యంతరం వుంటే యింత వరకూ వుండే దాన్నే కాదు అమ్మకి కూడా ఆరోగ్యం బాగులేదు! నన్ను రమ్మనలేక తాను చేసుకో లేక సతమత మవుతోంది! అవునూ! ఏమిటలా చిక్కిపోయావ్? ఏమైనా వుందా?' అడిగింది ఉష ఆమెను పరిశీలనగా చూస్తూ

చ! నీకెప్పుడూ అలాంటాలోచనే! సిగ్గు పడింది రమ

ఆ! సిగ్గు ఒలక పోస్తున్నావ్! ఏదో వుంది! అని-

అత్తయ్యా! అని కేక వేసింది వెనుకనే వున్న అత్తయ్యను చూసి అత్తయ్యా! శుభవార్త చెప్పనా? ఊరించింది

ఏమిటమ్మా? ఆతృత పడింది అనసూయమ్మ

ఏమో! మీ అమ్మాయినే అడుగు! అంటూ రమ వైపు చూసింది ఉష

ఏం లేదమ్మా! నే నెప్పుడు వచ్చినా ఉష అలా అడుగుతూనే వుంటుంది! హడావిడి చేస్తూనే వుంటుంది!

తప్పించు కోవాలని చూసింది రమ తల్లికి అనుమానం వేసింది

చెప్పు తల్లీ! నీళ్ళు పోసుకొన్నావా?

అవునన్నట్టు తలూపింది రమ

ఏయ్! ఎన్నాళ్ళు దాస్తావ్ క్రిందటిసారే నా కనుమానం వేసింది! కొట్టిపారేసావ్! అంది ఉష ఆరిందాలా వారి అనురాగానికి ఆప్యాయతకీ మురిసిపోయారు అనసూయమ్మ

ఉష కోడలై వుంటే ఎంత బావుణ్ణు! అని అనుకొని నిట్టూర్చారు

* * * * * * * * * *

కిషోర్‌కి పోలియో డ్రాప్సు వేయించడానికి డాక్టరు గారి దగ్గరికి తీసుకొని వెళ్ళింది ఉష ఆ సమయం చూసి కూతుర్ని తన గదిలోకి రప్పించు కొన్నారు అనసూయమ్మ రఘు బాబు పునర్వివాహం గురించి అన్నయ్యా ఒదినలు అన్న మాటలూ చేసిన ప్రయత్నాలూ వివరించారు

అంతావిని

అన్నయ్య పరిస్థితి చూస్తే తిరిగి వివాహానికి యిష్టపడడేమో నని అనిపిస్తోందమ్మా! అంది రమ

అందుకే ఆ విషయం వాడి దగ్గర ఎత్తలేక పోతున్నా! రేణు యింకా బతికే వున్నట్టూ తిరిగి వస్తుందన్నట్టూ మాట్లాడుతున్నాడు! వెర్రినాగమ్మ!

సమయం చూసి అన్నయ్య అభిప్రాయాన్ని నేనే తెల్సు కొంటానమ్మా! హామీ యిచ్చింది రమ

అంతలో ఉష రావడంతో వారి సంభాషణ ఆగిపోయింది ఉషని దాని తలిదండ్రులు అక్కడకు పంపడంలో గల ఆంతర్యాన్ని అర్థం చేసుకొంది రమ కానీ అన్నయ్యని ఆకర్షించాలని ఉష ప్రయత్నిస్తున్నట్టు కనబడదు! తప్పని సరైతే తప్ప అతని ఎదుట బడదు ఎదుట బడినా మాటాడదు మాటాడినా పొడిగా ముభావంగా ఎటో చూస్తూ మాటాడుతుంది ఆమెకా ఉద్దేశ్యం వున్నట్టు కనబడదు వారి ప్రయత్నం ఫలించడానికి ఉష యేవిదంగానూ సహకరించడం లేదని గ్రహించింది రమ

* * * * * * * * * *

మీ భార్య రేణుకాదేవి యిక్కడ వున్నారు వెంటనే వచ్చి నన్ను కల్సుకోండి – హనుమాన్ ప్రసాద్ చిల్లీస్ మర్చంట్ అండ్ కమిషన్ ఏజంటు రాజా బజార్ లక్నో.

టెలిగ్రాం చదువుకొన్నాడు రఘు పంపిన వారి పేరూ అడ్రసూ పూర్తిగా వివరంగా వుంది

రఘులో తిరిగి ఆశాలత చివురించింది మరు నిమిషంలోనే బయలుదేరాలను కొన్నాడు ఇంటికి ఫోను చేసాడు ఆఫీసు పనిమీద ఢిల్లీ వెళ్తున్నానని నాలుగు రోజుల్లో వస్తానని తల్లికి చెప్పి వెంటనే బయలు దేరాడు మర్నాడు సాయంత్రం లక్నో చేరుకొన్నాడు హనుమాన్ ప్రసాద్‌ని కలిసాడు

తిరిగి ఎప్పటిలా నిరాశే ఎదురైంది ఆ ట్రూప్ ఆ వుదయమే లక్నో వదలి వెళ్ళినట్టు చెప్పారు ఎక్కడికి వెళ్ళింది తెలియదన్నారు వ్యధిత హృదయంతో హైదరాబాదు చేరుకొన్నాడు రఘు (ఇంకా ఉంది)




వి సి – మద్రాస్

నా వయస్సు 16 సంవత్సరములు నాకు అప్పుడప్పుడూ కంటిలో నీరు వచ్చు చున్నది మేకప్ పౌడర్ పూసుకొనుటవలన వచ్చునా? దీనికేమైనా మందు వున్నదా?

మేకప్ పౌడర్‌ని వాడటం ఆపి చూడండి రోగ నిర్ధారణ కానిదే మందు చెప్పటం కష్టం

డి ఎన్ ఆర్ – జమదాళ

మా పాప వయస్సు 5 సంవత్సరములు వ్యాధి నిరోదక మందులు అశ్రద్ధవలన వేయించలేక పోయాము యిప్పుడు వేయించవచ్చా? ఫలితం వుంటుందా?

వేయించండి కొద్దిపాటి ఫలితం తప్పక ఉంటుంది కోరింత దగ్గు, దనుర్వాతం, పోలియో మొదలయిన రోగాలు 5 సం ల లోపు వారినే అధికంగా బాధిస్తాయి గనుక అంతకు ముందే రోగనిరోదక మందులు వెయ్యటం అవసరం అయినా రోగ నిరోధక శక్తి లేనివారికి ఏ వయస్సులోనైనా ఈ రోగాలు వచ్చే అవకాశం ఉంటుంది గనుక మీరు మీ పాపకి వీటిని వెంటనే వెయించండి

కె ఆర్ – విజయవాడ

ఈ మధ్య రెండు మూడు మార్లు నా నుదిటిపైన బొప్పిలాగ వస్తున్నది ఈ బొప్పి వచ్చినట్టు ఎదుటి వాళ్ళు చెబితేగాని తెలియదు నెప్పి వుండదు ఆ వాపు 4,5 గంటలు వుండి పోతుంది ఈ బొప్పి నుదుటిపైన మాత్రమే వస్తున్నది

అలర్జీ వల్ల ఈ లక్షణం ఏర్పడుతుంది ఆంటీహిస్టమిన్ మాత్రలు (క్లోర్‌ఫెనిరమిన్ మాలియేట్) ఆ లక్షణం వచ్చినప్పుడు రోజుకి రెండు సార్లు వాడండి

కె ఎస్ – పుత్తూరు

నా వయస్సు 22 సం లు నా కింకా వివాహమవలేదు ఋతుక్రమం నెల నెల వస్తుంది బ్లీడింగ్ 2 రోజులు మాత్రమే వుంటుంది 6 నెలల నుండి ఇలా జరుగుతున్నది నేను లావయిపోతున్నాను నాకు బ్లీడింగ్ సరిగ్గా అవ్వాలన్నా, లావు తగ్గాలన్నా ఏమి చెయ్యాలో సలహా ఇవ్వండి

ప్రదమంగా లేడీ డాక్టర్లచేత పరీక్షింప చేసుకోవటం అవసరం ఆహార ప్రమాణాన్ని తగ్గించటం, తగిన శరీర వ్యాయామం చెయ్యటం, ఇనుప దాతువులు అధికంగా గల ఆకు కూరలను తీసుకోవటం చాలా ముఖ్యం

వై ఎస్ – మండపేట

నా వయస్సు 33 సంవత్సరములు నేను 20 రోజులకే బహిష్టు అగుచున్నాను దీనికి తగిన మందు తెలియజేయండి

లేడీ డాక్టర్లకి చూపించి తగిన మందులు వాడటం మంచిది. ఇలా జరగటానికి చాలా కారణాలున్నాయి కారణాన్ననుసరించి మందులు నిర్ణయింప బడాలి □

# కలువబాల లక్కీడిప్ చందాదారులకు నిబంధనలు సూచనలు.

1 చందా పైకము రు 60లు మనియార్డరు ద్వారా గాని డిమాండు డ్రాఫ్టు ద్వారా గాని పంపవచ్చును
2 ఎమ్ ఒ లు పంపేవారు వారి కూపన్‌తో పాటు, ఎమ్ ఒ పంపిన తేదీ తెలుపుతూ, దాని రశీదు జతచేసి మరీ కూపన్ పంపాలి లేదా డి డి ని కూపన్‌తో జతచేయాలి
3 చందా భారత దేశంలో వున్న వారెవరైనా కట్టవచ్చును
4 చందా పైకము నేరుగా విజయవాడ, ఆంధ్రపత్రిక కార్యాలయంలో కూడా కట్టవచ్చును
5 ఎమ్ ఒ లు డి డి లు వ్యక్తుల పేర పంపించకూడదు
6 కూపన్‌లు రిజిష్టర్డు పోస్టులో పంపరాదు లక్కీడిప్ గడువు పూర్తి అయిన తర్వాత యిందులో పాల్గొన్న చందాదారులకు చీట్లుతీసి, పైన తెలిపిన బహుమతులను ప్రకటించుతాము ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు
7 కూపన్‌మీద మనియార్డరు కూపన్ మీదా కూడా పంపేవారి పేరు చిరునామా స్పష్టంగా పూర్తిగా వ్రాయాలి వారు ఇదివరకే చందాదారులైతే కూడా, వారి స్నేహితులెవరికైనా 'కలువబాల చందాను బహుమతిగా కట్టవచ్చును డి డి లు ఆంధ్రపత్రిక- విజయవాడ-3 పేర తీసుకొని పంపించాలి

— కత్తిరించాలి —



నిజమయితే ✓
కాకపోతే x
అని గుర్తు పెట్టాలి

ఆంధ్రపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వుండేది ( )

దినపత్రిక కన్నా వారపత్రిక ముందే పుట్టింది ( )

"భారతి" సాహితీప్రియుల పత్రిక ( )

బాలరంజని పిల్లల పత్రిక ఆంధ్రపత్రిక ప్రచురణ ( )

కలువబాల చందాదారుల 'లక్కీడిప్' చందా కట్టిన వారి పూర్తి పేరు : .................... ........

........................................................

చిరునామా ..........................................

........................................................

........................................................

ఎమ్ ఒ పంపిన తేదీ ..................................

లేదా

డి డి జత చేయడమైనది

8. "లక్కీడిప్" 1-11-1986 లేదా ఆ లోపల కట్టే చందాలకి మాత్రమే వర్తిస్తుంది.
కూపన్‌లు, చందాలు పంపవలసిన చిరునామా :
కలువబాల, కేరాఫ్; ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3కి పంపాలి.

9 ఈ పథకంలో పాల్గొనే వారికి స్థానిక ఏజెంట్ ద్వారా పత్రిక సప్లయి చేస్తాము
గమనిక ఏజెంట్ లేనిచోట పోస్టులో పంపిస్తాము

10 ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ లక్కీ డిప్‌లో పాల్గొనరాదు

# డ్యూటీ ఈజ్ ఫస్ట్

ఉప్పులూరి సత్యనారాయణ

"మదర్ సీరియస్. స్టార్ట్ ఇమిడియట్లీ టెలిగ్రాం అందుకుని వణుకుతున్న గొంతుతో చదివాడు రవికృష్ణ. అతనికి క్షణకాలం పాటు షాక్ తిన్న వాడిలా కుర్చీలో కూలబడి పోయాడు. కళ్ళల్లో నీరు నిలిచింది అప్రయత్నంగా.

రవికి టెలిగ్రాం రావటం, అతను కుర్చీలో కళ్ళనీళ్ళు పెట్టుకుని కూలబడి పోవటం గమనించిన అతని కొలీగ్సు అంతా అతని టేబుల్ చుట్టూ చేరి "మిస్టర్ రవీ ఏమైంది" అని అడిగారు ఆత్రంగా. అతను అందుకు సమాధానంగా టెలిగ్రాం తీసి వారికి చూపించాడు.

"రవీ వారం రోజులు శలవు పడేసి వెంటనే బయలుదేరు. మెయిల్‌కూడా వచ్చే వేళయింది. సాయంత్రానికల్లా మీ ఊరు చేరగలవ్. ధైర్యంగా వుండు మీ అమ్మగారు నువ్వు వెళ్ళే సరికి క్షేమంగానే వుంటారు" అందరికంటే సీనియర్, వయసులో పెద్దవాడు, హెడ్ గుమస్తాగా పని చేస్తున్న సుబ్బారావు రవికృష్ణకు ధైర్యం చెప్పాడు.

"ఆఫీసువర్కు బోలెడు పెండింగ్‌లో వుంది. రేపు ఉదయానికల్లా పూర్తి చేసి, సీటు అప్ టు డేట్ చేసి చూపించ మన్నాడు మన ఆఫీసరు. రేపు జనరల్ మేనేజర్ ఇనస్పెక్షన్ కూడా వుందటకదా. శలవు అడిగితే ఇస్తాడో ఇవ్వడో, అసలే చండశాసనుడు". రవికృష్ణ సందేహం వ్యక్తం చేసాడు.

"టెలిగ్రాం చూపించు. ఎంత కర్కోటకుడైనా కన్నతల్లి చావు బ్రతుకుల్లో వుందంటే కరిగి పోకతప్పదు. లీవ్ లెటర్ వ్రాసి ధైర్యంగా వెళ్ళి అడుగు" ప్రోత్సహించారు కొలీగ్సు.

రవికృష్ణ లీవ్ లెటర్ వ్రాసి దానికి టెలిగ్రాం జత చేసి ఆఫీసర్ ఛాంబర్ వైపు బయలు దేరాడు. రవికృష్ణ ఆ ఆఫీసులో జూనియర్ అసిస్టెంటుగా ఉద్యోగంలో చేరి ఇంకా ఏడాది పూర్తి కాలేదు. ఎం. ఎ. పూర్తి చేసిన తరువాత అయిదు సంవత్సరాలు నిరుద్యోగంతో పోరాటం జరిపి చివరికి అతికష్టం మీద ఈ చిరు ఉద్యోగం సంపాదించుకున్నాడు. అతని తండ్రి చిన్నప్పుడే కాలం చేస్తే వున్న కొద్ది పాటి ఆస్తిని కరిగించి కొడుకును పోస్టు గ్రాడ్యుయేట్‌ను చేసింది అతని తల్లి సీతమ్మ. రవికృష్ణ తరువాత ఇద్దరు పెళ్ళి కావలసిన చెల్లెళ్ళు అతని మీద ఆధారపడి వున్నారు. పట్నంలో ఇంటి అద్దెలు ఖర్చులు భరించ లేక తల్లిని చెల్లెళ్ళను పల్లెటూరులో వున్న సొంత ఇంట్లోనే వుంచి తను క్లుప్తంగా ఖర్చు పెట్టుకుని జీతంలో మిగిలిన సొమ్మును నెల నెలా తల్లి పేర మని ఆర్డరు చేస్తూ వుంటాడు. అతను నెల రోజుల క్రిందటే అతికష్టం మీద రెండు రోజులు శలవు శాంక్షన్ చేయించుకుని తల్లిని చెల్లెళ్ళను చూసి వచ్చాడు. అప్పటికి అతని తల్లి ఆరోగ్యంగానే వున్నది. ఇంతలోనే ఇంత ప్రమాదం వచ్చి పడుతుందని కలలో కూడ ఊహించుకోలేదు.

ఆఫీసర్ దయానందరావు ఆ ఆఫీసుకు కొత్తగా వచ్చాడు. అతను అంతకు ముందు మిలట్రీలో పని చేసి, తరువాత గ్రూప్ -వన్ సర్వీసు కమిషన్‌లో సెలక్టయి డైరక్టు ఆఫీసరుగా వచ్చాడు. అతను రాక ముందు ఆ ఆఫీసు గురించి చాల బాడ్ రిపోర్టు వెళ్ళింది. స్టాఫ్ అంతా అవినీతి పరులనీ, ఎవరు ఎప్పుడూ సీట్లో కూర్చోరని, ఒక్కరు చేయవలసిన పని నలుగురు చేస్తున్నా వర్కు అంతా పెండింగ్‌లో వుందని హెడ్ ఆఫీసుకు ఇరవై పేజీల రిపోర్టు వ్రాసి పంపారు ఇన్వెస్టిగేషన్‌కు వచ్చిన ఆఫీసర్లు. దయానందరావు అప్పటికే చాల ప్రిన్సిపల్‌డ్ మాన్ అనీ, స్ట్రిక్టు ఆఫీసరని డిపార్టు మెంటులో మంచి పేరు తెచ్చు కున్నాడు. ఆ ఆఫీసు రిపోర్టు చూడగానే దయానందరావుగిఆ ఆఫీసుకి ఇన్‌ఛార్జిగా పోస్టు చేసారు.

దయానందరావు వచ్చిన నెల రోజుల్లోనే, ఆఫీసు పరిస్థితులన్నీ చక్క దిద్దాడు. అతను వచ్చిన తరువాత స్టాఫ్ అంతా సీట్లు నుంచి కదలకుండా, వంచిన తల ఎత్తకుండా పని చేయటం ప్రారంభించారు. అతనికి ఎదురు తిరిగిన ఇద్దరు ముగ్గుర్ని దూర ప్రాంతాలకు బదిలీ చేయించటమూ, సస్పెండ్ చేయటమూ కూడ జరిగింది. దాంతో మిగిలిన స్టాఫ్ కూడ తమ ప్రవర్తనను చక్క దిద్దుకున్నారు.

గుండె దడ దడలాడుతూ వుండగా రవికృష్ణ శలవు అప్లికేషన్ పట్టుకుని ఆఫీసరు గదిలోకి అడుగు పెట్టాడు. దయానందరావు చప్పుడు చేయకుండా వచ్చి మౌనంగా నిలబడిపోయిన రవికృష్ణను గమనించలేదు. అతను ఏదో ఫైలు స్టడీ చేస్తూ పనిలో నిమగ్నమై వున్నాడు.

అయిదు నిమిషాలు తరువాత తల ఎత్తి ఎదురుగా నిలబడివున్న రవికృష్ణను చూసి, "ఎస్! వాడ్యూయువాంట్" అన్నాడు

రవికృష్ణ గొంతులో తడి ఆరిపోయింది. నెమ్మదిగా ధైర్యం తెచ్చుకుని, "సార్, మా మదర్‌కు సీరియస్‌గా వున్నట్లు టెలిగ్రాం వచ్చింది. నాకు రెండు రోజులు శలవు కావాలి" అంటూ టెలిగ్రాం జతపరచిన లీవ్ లెటర్ అందించాడు.

దయానందరావు టెలిగ్రాంను, లీవ్ లెటర్‌ను పరిశీలనగా చూసి, "ఐ యామ్ సారి మిస్టర్ రవికృష్ణా! రేపు జనరల్ మేనేజర్ మన ఆఫీసు ఇనస్పెక్షన్‌కు వస్తున్నట్లు నీకు తెలుసు కదా! అసలే నీ వర్కు కూడ పెండింగ్‌లో వుంది. ఈ పరిస్థితుల్లో నీకు శలవు ఎలా గ్రాంట్ చేయగలను" చాల శాంతంగా సున్నితంగా చెప్పాడు దయానందరావు.

రవికి ఆఫీసర్ సమాధానం విని ఒక్క క్షణం నోట నుంచి మాట పెగల్లేదు. మౌనంగా నిలుచుండి పోయాడు. అతనికి కళ్ళ నీళ్ళు తిరిగాయి.

"చెప్పవలసిం దింకేమైనా వుందా?"

"మా అమ్మ కేదైనా జరగకూడనిదే జరిగితే, మా చెల్లెళ్ళు దిక్కులేని వాళ్ళయి పోతారు. దయచేసి నన్ను ఈ ఒక్కసారికి వదిలి పెట్టండి సార్." అన్నాడు రవికృష్ణ.

"మిస్టర్ రవికృష్ణా నీ పరిస్థితి నాకు అర్థమైంది. బట్ ఐ యామ్ హెల్ప్‌లెస్. నా స్థానంలో నువ్వు కూర్చున్నా ఇలాగే సమాధానం చెప్పి వుండేవాడివి. ట్రైటు అండర్‌స్టాండ్ మి. డ్యూటీ ఈజ్ ఫస్ట్. ఆ తరువాతే అన్నీ. ఈ ఆఫీసులో శలవు కావలసి వచ్చినప్పుడల్లా దొంగ టెలిగ్రామ్స్ ఇప్పించుకోవటం మొదట నుంచి అలవాటే. నువ్వు అలా చేయవని నాకు తెలుసు. ఐ నో. యువర్ సిన్సియారిటీ.... ఇనస్పెక్షన్ పూర్తి కాగానే పది రోజులు శలవు ఇస్తాను... సరేనా...."

దయానందరావు మాటలకు రవికృష్ణకు నరనరాలు కోపంతో రగిలి పోయాయి. కానీ తను అసహాయుడు. ఎన్నో ఏళ్ళ నిరీక్షణ తరువాత అతి కష్టం మీద ఈ ఉద్యోగాన్ని సంపాదించుకో గలిగాడు. క్షణికమైన ఉద్రేకంతో, పట్టుదలతో నోరు జారి ఈ ఉద్యోగాన్ని కూడా పోగొట్టుకుంటే, తనకు నిలవ నీడ కూడ వుండదు. తన ఆవేశాన్ని పళ్ళ బిగువున అణుచుకుని తలవంచుకుని బయటకు వచ్చాడు.

అతను బయటకు రాగానే కొలీగ్సు అంతా చుట్టు ముట్టి "ఏం జరిగింది. శలవు గ్రాంట్ చేసాడా?" అని అడిగారు. రవికృష్ణ జరిగిందంతా చెప్పాడు.

"వీడంత దుర్మార్గుడు ప్రపంచంలో ఎక్కడా వుండడు. తల్లి చావు బ్రతుకుల్లో వున్నదన్నా శలవు ఇవ్వని కర్కోటకుడు. సమయం వచ్చినప్పుడు అంతా కలిసి వీడికి సరియైన గుణపాఠం నేర్పాలి."

స్టాఫ్ అంతా ఎవరి చిత్తం వచ్చినట్లు వారు దయానందరావును నిందించారు.

★ ★ ★ ★

ఇంత హడావిడి జరిగినా, చివరికి జనరల్ మానేజర్ ఇనస్పెక్షన్ జరగ లేదు. నెల రోజుల తరువాత వరకు పోస్టుపోన్ అయినట్లు టెలెక్సు

మెసేజ్ మరుసటి రోజు సాయంత్రానికి చేరింది

మూడవ రోజు ఉదయమే ఆఫీసుకు వచ్చి అటెండెన్సు రిజిస్టర్‌లో సంతకం పెడుతున్న రవికృష్ణను పిలిచి,

'మిస్టర్ రవికృష్ణా, నీకు పది రోజుల లీవ్ గ్రాంట్ చేస్తున్నాను. వెళ్ళి మీ అమ్మగారి ఆరోగ్య పరిస్థితి ఎలాగుందో నాకు పెర్సనల్‌గా ఉత్తరం వ్రాయి." అని చెప్పాడు.

రవికృష్ణ వెంటనే బయలు దేరాడు. ఈ మూడు రోజుల నుంచీ డ్యూటీకి వస్తున్నా, అతని మనసంతా తల్లిమీదే వుంది. ప్రతీక్షణం అతనికి తల్లి కంటి ముందు కదులుతోంది.

అతను వెళ్ళేసరికి ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. ఇంటి నిండా మాత్రం మనుషు లున్నారు. అప్పుడే ఎవరో సంధ్య దీపం వెలిగిస్తున్నారు.

గుమ్మంలోకి అడుగు పెడుతూనే, 'అమ్మా!' అని పిలిచాడు. కానీ అతని పిలుపుకు సమాధానం రాలేదు. గుమ్మంలో నిలుచున్న బంధువులు మాటలు రాని రాతి బొమ్మల వలే నిశ్శబ్దంగా వుండి పోయారు. ఆ ఇంటి వాతావరణం అతనికి ఏదో బయంకరమైన అనుమానం కలిగించింది. అతని గుండెల్ని పిండి, దుఃఖం బయటకురికింది.

మరోసారి "అమ్మా!" అని పిలిచాడు. ఆ పిలుపులో ఆశ నిరాశ, దుఃఖం భయం సమ్మిళితమై వున్నాయి. ఆ పిలుపుకు ప్రతి స్పందనగా లోపలి గదిలోంచి అతని చెల్లెళ్ళ శోకం వినిపించింది. "ఇంకెక్కడి అమ్మరా అన్నయ్యా!" అని, అతని చేతిలో బ్యాగ్ జారిపోయింది. దుఃఖాతిశయంతో మతిభ్రమించిన వాడివలే తల గోడకు గుద్దుకో సాగాడు.

అతని మేనమామ వచ్చి అతన్ని పట్టుకుని దూరంగా తీసు కెళ్ళాడు.

ఎంత ఉద్యోగం చేస్తుంటే మాత్రం కన్న తల్లి చావు బ్రతుకుల్లో వుందని టెలిగ్రాం ఇచ్చినా రాకపోవట మేమిటి? ముసలి తల్లి ప్రాణం వుంటేనేమిటి పోతే నేమిటి అనుకున్నాడు కాబోలు. బిడ్డల మీద తల్లికి మమకారం వుంటుంది గాని తల్లి మీద మమకారం బిడ్డల కెందుకుంటుంది. ఒక్కగా నొక్క కొడుకుని ఆఖరి చూపులు చసుకుందామని ఎంతో ఆశపడింది....."

కఠినమైన నిష్ఠూరోక్తులకు అతని గుండె బ్రద్దలై పోతోంది. తన ఆవేదనను బాధను ఎవరితో చెప్పుకుంటాడు. ఇదివరకైతే తన సమస్యల్ని బాధల్ని కష్టాన్ని సుఖాన్ని తల్లితో చెప్పుకుని వోదార్పు పొందేవాడు. కానీ ఇప్పుడు ఎవరితో చెప్పుకుంటాడు? ఆ తల్లి ఇక తనకు శాశ్వతంగా లేదు.

* * * *

కర్మ కాండలన్నీ పూర్తయిన తరువాత చెల్లెళ్ళను వెంట తీసుకుని వచ్చాడు రవికృష్ణ. ఆ మరునాడే డ్యూటీలో జాయినయ్యాడు.

మీ మదర్‌కు ఎలాగుంది?"

దానికి సమాధానంగా రవికృష్ణ రెండు కన్నీటి చుక్కలు రాల్చాడు అతని కన్నీరు అప్పటికే ఇంకి పోయింది

మన ఆపీసర్ మూలంగానే ఇంత జరిగింది జరిగిన దానికి మన ఆపీసరే బాద్యత వహించాలి మనం విషయ మంతా జాయింట్‌గా సంతకాలు పెట్టి హెడ్ ఆఫీసుకు రిపోర్టు చెద్దాం అన్నారు -



దీని గురించి మీరేమి గొడవ చెయ్యొద్దు అంతా నా దురదృష్టం అనుకుంటాను!" అన్నాడు ఆ మాట వినగానే అంతా ఎవరి సీట్లలో వాళ్ళు వెళ్ళి కూర్చుండి పోయారు

మద్యాహ్న లంచ్ అవర్‌లో వంటరిగా కూర్చున్న రవికృష్ణ సీటు దగ్గరకు వచ్చాడు దయానందరావు. "జరిగిందంతా విన్నాను. ఐ యామ్ వెరీ సారీ" అని తన సానుభూతిని తెలియజేసి వెళ్ళి పోయాడు. రవికృష్ణ అతని సానుభూతి వచనాలకు బదులివ్వలేదు. మౌనంగా వుండి పోయాడు.

* * * *

నెల రోజుల తరువాత అనుకున్న జనరల్ మానేజర్ ఇనస్పెక్షన్ ప్రోగ్రాం రానే వచ్చింది. తెల్లవారితే ఇనస్పెక్షన్ అనగా ఆ సాయంత్రం ఆఫీసవర్సు తరువాత స్టాప్ అంతా సమావేశమయ్యారు.

"మన ఆఫీసర్‌కు బుద్ధి చెప్పటానికి తగిన సమయం ఇదే. రేపు ఉదయం జనరల్ మేనేజర్ ఆఫీసులో అడుగు పెట్టేసమయానికి "మదర్ ఎక్స్‌పైర్‌డ్" అని దయానందరావుకు అందేలా టెలిగ్రాం ఇద్దాం.."డ్యూటీ ఈజ్ ఫస్ట్" అని ఎదుట వాళ్ళకు నీతులు చెప్పే ఈ పెద్ద మనిషి అప్పుడు ఎలా బిహేవ్ చేస్తాడో చూద్దాం. అప్పుడుగాని ఎదుట వాళ్ళ కష్ట సుఖాలు అర్థం కావు. టిట్ ఫర్ టాట్" హెడ్ క్లర్కు సుబ్బారావు సూచించాడు. మిగిలిన అందరూ ఈ పథకానికి అంగికరించారు.

మరునాడు ఉదయం పది గంటలకు జనరల్ మేనేజర్‌తోను, అతనితో వచ్చిన ఇతర అధికారులతోను మీటింగ్ హాల్లో కాన్ఫరెన్సు ప్రారంభమైంది. ముఖ్యమైన విషయాలను ఫైల్సు తీసి చూపిస్తూ ప్రసంగిస్తున్నాడు దయానందరావు. సరిగ్గా అదే సమయంలో అతనికి టెలిగ్రాం అందింది. స్టాఫ్ అంతా అతను ఆ టెలిగ్రామ్‌కు అతను ఎలా రియాక్టవుతాడోనని ఆత్రంగా ఎదురు చూడసాగారు. కాని దయానందరావు ఎవరూ ఊహించని విధంగా ఆ




గురువు శిష్యులందరికీ విద్యను సమానంగానే బోధిస్తాడు చురుకైన బుద్ధి గలవారు గురువు చెప్పిన దానిని బాగా గ్రహించ గలరు. మందబుద్ధులు గ్రహించలేరు. గ్రహించే వారి పయి అభిమానం గురువునకు ఉండడం సహజం. ఆ అభిమానాన్ని ప్రశంసగా ఊహించి కొందరు శిష్యులు గర్వించడం కూడా కాన వస్తున్నది. గర్వం చాలా చెడ్డది. అది కలిగిందంటే క్రమంగా వృద్ధి పొందుతుందే! కాని తగ్గదు. ఆ విద్యాగర్వం, శిష్యులందరిలోనూ తానే అధికుడననే అభిప్రాయాన్ని కలిగిస్తుంది. ఒకప్పుడది, గురువు కంటే కూడా తానే విద్యాధికుడననే అభిప్రాయాన్ని కలిగిస్తుంది. విద్యా గర్వం చాలా చెడ్డది. విద్య వల్ల వినయం ఏర్పడవలెనే కాని గర్వంగాని, అవిధేయత గాని కలగకూడదు. విద్య నేర్చుకునే వారు దీనిని గ్రహించాలి.

ఒకడు మల్ల విద్య నేర్చు కొనుటకు సమర్థుడైన ఒక గురువు నాశ్రయించాడు పెక్కు మల్ల విద్యా రహస్యాలను ఆ గురువు వద్ద నేర్చుకొని అందులో మిక్కిలి నైపుణ్యం సంపాదించి చాలా ప్రదర్శనాలలో ప్రజల మెప్పును గడించాడు. కొందరు అతణ్ని గురువును మించిన వారని అన్నారు: గురువుకూ, ఇతనికీ పోటీ పెడితే ఇతడే తప్పక గురువును ఓడించగలడని వారు అనుట వల్ల ఆ శిష్యుడికి అహంకారం అధిక మయింది. కొందరి ప్రోత్సాహంతో అతడు తన గురువుతోనే మల్లయుద్ధం చెయ్యడానికి సంకల్పించి, పోటీకి ఆయనను ఆహ్వానించాడు. గురువుకు ఆశ్చర్యం కలిగింది. తనకంటె అధికుడననే గర్వంతో శిష్యుడు పోటీకి పిలుస్తాడని ఆయన అనుకో లేదు. అయినా, వెనుక తీయకుండా పోటీకి సిద్ధపడ్డాడు.

కొంతసేపు గురుశిష్యు లిద్దరూ సరిసమానంగానే యుద్ధం చేశారు. ఆ తర్వాత గురువు, తన శిష్యునికి తెలియని బంధవిశేషాన్ని ప్రయోగించి అతడిని చిత్తు చేశాడు. శిష్యుడి గర్వం అణిగింది. ఓడిపోయిన శిష్యుడు "నాకు మీరు ఈకిటుకు చెప్పలేదేమి? దీన్ని చెప్ప కుండా నన్ను మోసం చేశారు "అని అన్నాడు. గురువు "నాయనా! నీ వంటి అహంకారం గల శిష్యుల వల్ల ఎప్పుడయినా అపాయం కలగవచ్చు అనే ఆలోచన నాకు ఉండబట్టే, దీనిని మాత్రం నీకు చెప్పలేదు. దీన్ని కూడా చెప్పి వేస్తే నాకు ఓటమి తప్పేది కాదు. ఆత్మరక్షణ అందరికీ ముఖ్యమయినదే! నిన్ను మోసగించే నని అనుకోవడం నీ అహంకారానికీ, అవివేకానికీ గుర్తు" అని అన్నాడు. శిష్యుడు తల వంచుకున్నాడు. గురువును ధిక్కరించిన శిష్యుడికి తగిన శాస్తి అయిందని ప్రేక్షకులు సంతోషించారు. శిష్యుణ్ని ప్రోత్సహించిన వారు మొగాలు ముడుచుకున్నారు. గురు తిరస్కృతి అనర్థానికి మూలం కాక తప్పదు.

—బులుసు వేంకట రమణయ్య

## డ్యూటీ ఈజ్ ఫస్ట్

టెలిగ్రామ్‌ను విప్పి చదువుకుని, ఎమాత్రం చలించకుండా మడిచి కోటు జేబులో వేసుకుని తన పనిని తాను చేసుకు పోసాగాడు అతని ప్రవర్తన ఎవరు ఊహించని విధంగా ఆశ్చర్యంలో ముంచెత్తింది

ఆ సాయంత్రం జనరల్ మానేజర్ ఇనస్పెక్షన్ పూర్తి కాగానే అందరికీ వీడ్కోలు చెప్పిన తరువాత టెలిగ్రాం చదువుకుని కళ్ళ నీళ్ళు జేబు రుమాలతో తుడుచుకుంటూ వుండి పోయాడు

ఆ క్షణంలో సుబ్బారావు లోనికి వెళ్ళాడు అతనిని అనుసరించారు మిగిలిన వాళ్ళు దయానందరావు అంతా ఒకేసారి రావటం చూసి కళ్ళ నీళ్ళు తుడుచుకుని, 'మీ' అందరి సహకారం వల్ల ఇనస్పెక్షన్ విజయవంతంగా ముగిసింది మీ అందరిని పేరు పేరున అభినందిస్తున్నాను' అన్నాడు

"మేము వచ్చింది అందుకు కాదుసార్?'

'మరి ఎందుకు?'

మీరు క్షమిస్తానంటే నిజం చెపుతాం!

చెప్పండి!

"మీ అమ్మగారు నిజంగా చనిపోలేదుసార్!

ఆ మాటలు విని దయానందరావు మాట్లాడలేదు చిన్న నవ్వు నవ్వాడు ఆ నవ్వు పేలవంగా వుంది తిరిగి సుబ్బారావు చెప్పాడు

రవికృష్ణ తల్లి చనిపోయినప్పుడు, టెలిగ్రాం వచ్చినా శలవు ఇవ్వలేదు 'డ్యూటీ ఈజ్ ఫస్ట్' అని నీతులు చెప్పారు అదే మీ విషయంలో జరిగితే మీరు ఎలా ప్రవర్తిస్తారో ప్రత్యక్షంగా చూడాలని, మా కష్ట సుఖాలు మీరు అర్థం చేసుకోవాలనీ మేమే ఆ టెలిగ్రాం ఇచ్చాం కానీ మేమే ఓడి పోయాం ఈ పరీక్షలో మీరే గెలిచారు మిమ్మల్ని అనవసరంగా దుఃఖ పెట్టినందుకు క్షమించమని కోరుతున్నాం

"నేను ఎదుట వాళ్ళకు చెప్పిన నీతులు నేనూ ఆచరిస్తాను అలా ఆచరణ యోగ్యం కాని నీతులు నేను ఎదుటవాళ్ళకు ప్రబోధించను కానీ మీరు ఇంకా తెలుసుకోవలసిన నిజం ఒకటుంది అన్నాడు

ఏమిటి సార్ అది అన్నారు అంతా.

"మా అమ్మ నిజంగానే ఈ వేళ ఉదయం ఎనిమిది గంటలకు చనిపోయింది ఆమె శవం ఇంటి దగ్గర ఒంటరిగా వదిలి వచ్చాను ఇప్పటికి ఆ శవం నా కోసం ఎదురు చూస్తూనే వుంది ఈ ప్రపంచంలో నాకు నా తల్లి, నా తల్లికి నేను తప్ప మాకెవరూ తోడు లేరు ఇక నుంచి నాకు ఆ తోడు కూడా లేదు. ఇప్పుడు నేను ఇంటికి వెళ్ళి నా కోసం ఎదురు చూసే నా తల్లి శవానికి అంతిమ సంస్కారానికి ఏర్పాట్లు చేసుకోవాలి'

దయానందరావు మాటలు విని అంతా శిలాప్రతిమల వలే బిగుసుకు పోయారు

హేట్సు ఆఫ్ టు దిస్ డ్యూటి మైండెడ్ ఆఫీసర్ ఈలాంటి వారు నూటికి ఒక్కరుంటే చాలు అనుకున్నారంతా వారికి తెలియకుండానే వారు ముకుళిత హస్తాలతో దయానందరావు ముందు మౌనంగా నిలుచుండి పోయారు □

# చరిత్ర పుటలలో "విదిశ" విశేషాలు

నేటి మధ్యప్రదేశ్ రాష్ట్రంలో, మధ్యప్రదేశ్ రాష్ట్ర రాజధాని నగరమైన భోపాల్‌కు 80 కిలో మీటర్ల దూరంలో మధ్య రైల్వే మార్గంలో విదిశ పట్టణం వుంది. మద్రాసు నుంచి ఢిల్లీ వెళ్ళే ఏ రైలు ఎక్కినా నేరుగా విదిశ రైల్వే స్టేషన్‌లో దిగొచ్చు. కొన్ని సూపర్ ఫాస్టు ఎక్స్‌ప్రెస్‌లకు విదిశ స్టేషన్‌లో స్టాపు లేదు. ఇది గమనించి ట్రయిన్ ఎక్కాలి.

ప్రస్తుతం విదిశ ఒక జిల్లా కేంద్రమే అయినా ప్రాచీన కాలంలో గొప్ప నగరంగా భాసిల్లి అతి వైభవంగా తులతూగింది. విదిశను బౌద్ధ వాఙ్మయంలో బేస్‌నగర్ అని, హిందూ సంస్కృత వాఙ్మయంలో విదిశ అని పిలవడం జరిగింది. ప్రస్తుతం విదిశ అనే పేరు స్థిర పడింది. బేత్వా (వేత్రావతి) బేస్ అనే రెండు నదుల మధ్య ఈ పట్టణం నిర్మించ బడింది. బుద్ధుని కాలంలో ఇది గొప్ప వాణిజ్య కేంద్రం.

ముఖ్యంగా మౌర్య అశోక చక్రవర్తి కాలంలో విదిశ ప్రాముఖ్యతను సంతరించుకుంది. అశోక చక్రవర్తి విదిశలోని ఒక వర్తకుని కుమార్తెను వివాహమాడడాన్ని బట్టి ఈ నగర ప్రాధాన్యతను ఊహించుకోవచ్చు. తర్వాత శుంగ రాజుల కాలంలో బౌద్ధ, హిందూ సంస్కృతులు ఇక్కడ పరిఢవిల్లాయి. సుప్రసిద్ధ 'సాంచీ' స్తూపం విదిశకు 9 కిలో మీటర్ల దూరంలో నే వుంది. క్రీస్తు శకం 5 వ శతాబ్దం వరకు అంటే గుప్త యుగం వరకు మహా వైభవాన్ని అనుభవించిన ఈ నగర చరిత్ర తర్వాత ఏమి అయిందో తెలియరావడం లేదు. క్రీస్తు శకం 10 వ శతాబ్దంలో దీని సమీపంలోనే వున్న భిల్సా నగరం ప్రసిద్ధి కెక్కడంతో విదిశ నగరం క్రమ క్రమంగా తన ప్రాముఖ్యతను కోల్పోసాగింది.



బేస్ నగర్ గరుడ స్తంభ శాసనం

## దర్శనీయ స్థలాలు

విదిశ పట్టణంలోను, దాని పరిసర ప్రాంతాల లోను చూడదగిన ప్రదేశాలు కొన్ని ఉన్నాయి. విదిశ పరిసర ప్రాంతాలలో వున్న స్థలాలను సిటీ బస్సులో గాని, టాంగాలో (గుర్రపు బండి) గాని వెళ్ళి దర్శించవచ్చు. విదిశ వెళ్ళిన యాత్రికులు విధిగా చూడదగిన స్థలాలు-

### ఉదయగిరి గుహాలయాలు

విదిశ పట్టణానికి 4 కిలో మీటర్ల దూరంలో ఉదయగిరి ఏకశిలా శ్రేణులలో ఈ గుహలు తొలిపించబడ్డాయి. ఇక్కడ మొత్తం 20 గుహ లున్నాయి. అయితే వీటిలో ఎక్కువ భాగం అజంతా, ఎల్లోరా గుహలవలె పెద్దవిగాక, పరిమాణంలో చాలా చిన్నవిగా వుంటాయి. ప్రతి గుహలో దేవతా విగ్రహాలు కళాత్మకంగా చెక్కబడి వున్నాయి. ఇవన్నీ ఏకశిలా నిర్మాణాలే! ప్రస్తుతం శిధిలావస్థలో వున్నాయి.

1,20 సంఖ్యలు గల గుహలు జైన ఆలయాలు వాస్తు, శిల్పకళాత్మకంగా కనిపించదు భారతదేశ చరిత్రలో కొండలను తొలిచి ఆలయాలను నిర్మించే

ఉదయగిరి గుహాలయాలున్న ఏకశిలా శ్రేణి





వరహావతార విష్ణు విగ్రహం

# చరిత్ర పుటలలో 'విదిశ' విశేషాలు

ప్రారంభదశను ఈ గుహ సూచిస్తుంది. 2,3. సంఖ్యలు గల గుహలు చాలా చిన్నవి. 4వ సంఖ్య గల గుహను 'బీనా' గుహ అంటారు. ఈ గుహ మధ్య శివలింగం వుంది.

ఉదయగిరి గుహాలయాలన్నింటిలో 5వ సంఖ్య గల గుహ ప్రఖ్యాతి వహించింది. ఇక్కడవున్న "వరాహావతార విష్ణు" విగ్రహం చూపరులను ఆకట్టుకుంటుంది. సముద్రంలో మునిగిపోతున్న భూదేవతను తన వజ్రం దంష్ట్రలతో అవలీలగా పైకి లేవనెత్తుతున్న ఆ వరాహావతార శిల్పదృశ్యాన్ని చూడగానే ఈ ప్రపంచంలో వున్న సమస్తశక్తులూ ఆ విగ్రహంలో మూర్తీభవించాయా! అనే భావన తప్పక మనకు కలుగుతుంది. ఆ వరాహావతార పురుషుని విగ్రహం చుట్టూ పైనుంచి దేవతలు రాక్షసులు ఆ బృహత్ స్వరూపాన్ని తిలకిస్తున్నట్లు శిల్పీకరించబడింది.

ఈ గుహాలయ శిల్పశైలినిబట్టి గుప్త రాజులకాలంలో అంటే క్రీస్తుశకం 4, 5 శతాబ్దాలలో ఈ గుహ తొలచబడిందని చెప్పవచ్చు.

మిగతా గుహలలో 6, 7 నెంబర్లుగల గుహలు ముఖ్యమైనవి. వీటిలో గుప్తయుగంనాటి శాసనాలు వున్నాయి. 13వ నెంబరు గుహలోవున్న శేషసాయి విష్ణు విగ్రహం ప్రత్యేక ఆకర్షణ. అన్నిటికంటే 19వ నెంబరు గుహే పెద్దది.

## గరుడస్తంభ శాసనం

విదిశకు 3 కిలోమీటర్ల దూరంలో గరుడ స్తంభం ప్రతిష్ఠించబడివుంది. ఈ స్తంభ శాసనాన్ని స్థానికులు 'ఖామ్ బాబా' అంటారు. ఖామ్‌బాబా అంటే దైవస్తంభం అని అర్థం. ప్రాచీన బేస్‌నగర్ కూడా ఈ ప్రాంతమే! ఇక్కడ త్రవ్వకాలు జరుపగా అనేక శిల్పాలు బయల్పడ్డాయి. వీటిలో దుర్గ, యక్షిణి, కుబేర, నరసింహ ప్రతిమలు ముఖ్యమైనవి. ఇవన్నీ గ్వాలియర్ పురావస్తు ప్రదర్శనశాలలో భద్రపరచబడ్డాయి.

గరుడస్తంభం మీద బ్రహ్మిలిపిలో శాసనం చెక్కబడివుంది. ఈ శాసనంలో హెలియోడోరస్ అనే గ్రీకు ఉద్యోగి వాసుదేవభక్తుడై గరుడస్తంభాన్ని ప్రతిష్ట చేసినట్లు చెప్పుకున్నాడు. పశ్చిమ పంజాబ్‌లోని తక్షశిలనేలే గ్రీకురాజైన ఆంటియాల్కిడాస్ విదిశనేలే కడపటి శుంగరాజైన భాగభద్రుని ఆస్థానానికి పంపబడినవాడు హెలియోడోరస్.

ఈ శాసనంవల్ల భారతదేశంలో స్థిరపడిన గ్రీకులు వైష్ణవమతం స్వీకరించి భారతీయులలో కలిసిపోయారని తెలుస్తుంది.

## పురావస్తు ప్రదర్శనశాల

విదిశ వెళ్ళిన ప్రతి యాత్రికుడు తప్పక చూడ వగింది ప్రభుత్వ మ్యూజియం ఇది విదిశ పట్టణం లోనే వుంది. ఇక్కడ ముఖ్యంగా మౌర్య, శుంగ, గుప్తయుగాలకు సంబంధించినవి భద్రపరుచబడ్డాయి. ఇంకా ఈ మ్యూజియంలో మట్టి బొమ్మలు, నాణాలు, చరిత్ర పూర్వయుగం నాటి కుండపెంకులు, వాడిన పనిముట్లు ప్రదర్శనార్థం వుంచారు.

వ్యాసం, ఫోటోలు:–

–వరికూటి వెంకటసుబ్బారెడ్డి



# జ్ఞానోదయం

డాక్టర్ ఆర్వీ ఎస్

వైశాఖమాసం సాయంత్రం కావస్తున్నా ఎండ వుధృతం తగ్గలేదు సాగినవాళ్ళు ఇళ్ళలోంచి బైటికి రాకుండా తలుపులు బిగించుకుని కూర్చున్నారు లక్ష్మీపుత్రులు ఎ సి రూమ్‌లో డన్‌లప్ బెడ్‌మీద పడుకుని ఇంకా తాపం భరించలేనట్టు ఆయాసపడిపోతున్నారు

అలాంటి సమయంలో కాళ్ళకు చెప్పులైనా లేకుండా నడిచిపోతున్నాడు రాజు మూడురోజుల క్రితం తిన్న అన్నం తాలూకు శక్తి అణుమాత్రమైనా లేదు నిన్న సాయంత్రం తాగిన టీనీళ్ళు ఎప్పుడో ఆవిరి అయిపోయాయి అయినా ఓపిక చేసుకుని నడుస్తున్నాడు తప్పదు! జానడు పొట్ట నింపుకోవడానికి ఎన్ని బాధలైనా పడాలి అడపా తడపా దొరికే కూలిపనికూడా కరువైంది

అలా అని. రాజు చదువులేని వాడుకాదు. ఎకనమిక్స్‌లో పోస్ట్‌గ్రాడ్యుయేట్ అతన్ని కన్నవారిది అన్నపూర్ణ అన్న బిరుదు కొన్న ఆంధ్రదేశం అందులోను సశ్యశ్యామలమైన క్రిష్ణాతీరం. అందరు యువకుల్లాగే ఎన్నో కలలు కన్నాడు చదువుకునే-టప్పుడు ప్రభుత్వం ధర్మమా అని చదువు ముగించాడు ఆ ప్రభుత్వాన్నే నమ్ముకుని వుద్యోగ ప్రయత్నాలు చేశాడు అయితే ఎందుకో అతన్ని అదృష్టం వరించలేదు అతనికి ఏ చిన్న వుద్యోగమూ రాలేదు అతను హరిజన యువకుడైనా తనవారంటూ, వున్న తండ్రి ఒక్కడూ కాలం చెయ్యడంతో రాష్ట్ర రాజధానికి చేరుకున్నాడు అతని దురదృష్టం ఏమిటోగాని సెవెంత్ క్లాస్ పాసవని వాళ్ళకైనా అక్కడ వుద్యోగాలు దొరికాయి-గాని అతనికి మాత్రం జాబ్ రాలేదు

రోజులు, వెలలు దొర్లిపోతున్నాయి పొట్టనింపుకోవడానికి కొన్నాళ్ళు కూలిపని చేశాడు కొన్నాళ్ళు, రిక్షా లాగాడు మరి కొన్నాళ్ళు రాళ్ళు కొట్టాడు కూలి డబ్బులతో ఇంత తిండితిని, ఏ అరుగుమీదో పడుకోవడం అలవాటు చేసుకున్నాడు. నాలుగురోజులనించి ఆ కూలి పనులూ అతనికి దొరకలేదు ఫలితంగా పస్తులు! పరిస్థితి అతని మనసుకి అర్ధమైనా, శరీరానికి మాత్రం అర్ధంకాలేదు ఆహారం కావాలని అల్లరి పెడుతూనే వుంది

అందుకే అలా నడుస్తున్నాడు ఎవరైనా ఏదైనా పని ఇస్తారేమో అని పని ఇవ్వలేదు సరికదా కొందరతన్ని దొంగలా చూశారు అతనికి ఏం చెయ్యాలో అర్ధంకావడం లేదు

ఏ క్షణానైనా కళ్ళు తిరిగి పడిపోయేలా వున్నాడు

కాసేపుంటే ఎవర్నయినా ఇంత "అన్నం' అడిగి తినాలని కూడా అనిపించింది ఏదో సినిమాలోని పాట గుర్తొచ్చిందతనికి "సాపాటు ఎటూలేదు పాటైనా పాడు బ్రదర్" అంటూ కాని సాపాటు లేకపోతే పాటమాత్రం ఎలా వస్తుంది నిజ జీవితంలో? తన ఆలోచనలకి తనే నవ్వుకున్నాడు

అప్పుడే దూరంగా ఏదో కల కలం! జనం!గబగబ అటుకేసే నడిచాడు రాజు

అక్కడ ఒక వృద్ధుడు `స్పృహ తప్పిపడిపోయి వున్నాడు చుట్టూజనం మూగారేగాని ఎవరూ అతన్ని డాక్టర్‌కి చూపించాలని ఆలోచించలేదు రాజు గబగబ ఆయన దగ్గరికెళ్ళి నీళ్ళు తెప్పించి మొహంమీద చల్లాడు ఆయన కదల్లేదు 'హాస్పిటల్లో చేరుద్దాం కాస్త సహాయం చెయ్యండి పాపం ఎవర్తో ఏమిటో' పక్కవాళ్ళని అడిగాడు. అంతవరకు వేడుక చూస్తూ పుష్కళంగా జాలి కురిపిస్తున్న జనం తుపాకీ చప్పుడుకు పారిపోయిన పక్షుల్లా పారిపోయారు. ఆయన చస్తే ఎక్కడ గొడవలొస్తాయో అని రాజుకి దిక్కుతోచలేదు ఆయన్ని హాస్పిటల్లో చేర్చాలంటే రిక్షాకావాలి ఆ రిక్షాకిడబ్బు తన దగ్గరలేదు దార్నపోయే ఒకరిద్దర్ని పరిస్థితి చెప్పి బ్రతిమాలాడు లోకంలో అందరూ ఒకేలా వుండరు కొందరు ఉదారుల సహాయంతో ఎలాగైతేనేం ఆయన్ని హాస్పిటల్లో చేర్చాడు

హై బి పి మూలంగా అలా పడిపోయాడని, ప్రాణ భయం బహుశా వుండక పోవచ్చని డాక్టర్లు చెప్పడంతో తేలిగ్గా వూపిరి తీసుకున్నాడు రాజు

ఓ గంట తరువాత పేషెంటుకి స్పృహ వచ్చింది రాజు, డాక్టర్ల ద్వారా విషయం తెలుసుకున్నాడు కృతజ్ఞతలు చెప్పుకున్నాడు

ఆయన మాటల ద్వారా, పేరు శర్మ అని, ఆయనది 'పక్క గ్రామమని, ఒంటరివాడనీ, ఏదో పని మీద పట్నం వచ్చి కళ్ళు తిరిగి పడిపోయాడనీ తెలుసుకున్నాడు రాజు

ఆయన కళ్ళు తెరిచాక రాజులోని ఆకలి రాక్షసి విజృంబించింది, రెట్టించిన వుత్సాహంతో

'బాబుగారూ! కాస్త కాఫీ తాగుతారా తెస్తాను!" అన్నాడు ఆయనతో పాటు తనూ తాగచ్చని అతని ఆశ!

"ఇక్కడా? ఛ!" అన్నాడాయన మొహాన్ని ఏహ్యంగా పెట్టి

రాజుకి అర్థం కాలేదు.

'బానే వుంటుంది బాబుగారూ" అన్నాడు

బానే వుంటుంది! కాని స్నానమైనా చెయ్యకుండా అయినా నేను హోటల్లో ఏనాడు తిన్లేదు తిన్ను అదిసరే! నువ్వు' ఎవరు?" గంభీరంగా అన్నాడాయన

ఆ ప్రశ్న అసలు అర్థం కాలేదతనికి

"ఒక నిరుద్యోగిని" అన్నాడు ఏదో ఆలోచిస్తూ

అదికాదు నేనడిగింది. నీదే కులమని" తుళ్ళిపడ్డాడు రాజు

రాజు మొహం పాలిపోయింది. గుక్కెడు కాఫీ కోసం ఎదురు చూసిన అతని పేగులు నిర్ధాశగా అరిచాయి




## జ్ఞానోదయం

'చెప్పు నువ్వు బ్రాహ్మణ్ణే!' రపీమని అన్నాడు రాజు కాదు దరిద్రం అలా అనిపించింది

ఆయన కళ్ళు వింతగా మెరిశాయి

"అయితే మా యింటికి రా! ఈ రోజుండి రేపు వెళ్ళువుగాని' అన్నాడు శర్మగారు

'కానీ మీ ఆరోగ్యం '

పర్లేదు అంటూ డాక్టర్లకి చెప్పి, రాజుని తీసుకుని టాక్సీలో తన వూరు చేరుకున్నాడు

లంకంత ఇల్లు! వీధిలో పురులు ఇల్లు ఇంటి అలంకరణ చూసి, శర్మగాడు సంపన్నులని తెలుసుకున్నాడు రాజు; ఒక్క కులం విషయం తప్ప తన విషయాలన్నీ చెప్పాడు

'అయితే నా దగ్గరే వుండిపో" అన్నాడు శర్మగారు ఏదో ఆలోచిస్తూ

కంగారుగా చూశాడు రాజు

'కంగారు పడకు! నాకు సంతానం లేదు భార్య కాలం చేసి కూడా చాలా రోజులయింది నేనూ ఒంటరిగాణ్ణి కాస్త తోడుగా వుందువుగాని వుద్యోగ ప్రయత్నాలు కూడా చేద్దాం. వుద్యోగం రాగానే నీ దార్న నువ్వు పోదువు గాని అన్నాడు శర్మగారు

అంతరాత్మ ఘోషించింది అతన్ని మోసం చెయ్యొద్దు అని వచ్చిన అవకాశం జారవిడుచుకుంటే నీ అంత అవివేకి వుండడు అంది స్వార్థం

చిన్నతనం నించి హాస్టల్లో వుండడం, ఒకరిద్దరు బ్రాహ్మణ స్నేహితులు వుండడం, వారి ఆచార వ్యవహారాలు తెలిసుండడం, అన్నిటికన్నా తెల్లగా సన్నగా ఆకర్షణీయంగా వుండే అతని రూపం శర్మగారింట ఆశ్రయాన్ని అతిసులువుగా సంపాదించి పెట్టాయి

రాజు తన ఇంటి పేరుగా తన బ్రాహ్మణ స్నేహితుడి ఇంటి పేరు చెప్పి శర్మగారికి మరింత దగ్గరయ్యాడు శర్మగారు అతన్ని కన్నకొడుకులా ఆదరించాడు

రాజు రాజాలా తిరుగుతున్నాడు పైకి కాని అతనిలోని 'మంచి' హాయిగా వుండనివ్వడం లేదు

నువ్వు చేసింది మోసం! అంటూ వూదరగొటేస్తున్నది

రోజులు గడిచి పోతున్నాయి రాజు శర్మగారి మధ్య అనుబంధం 'నానాటికి విడతీయరానిదిగా మారుతోంది రాజు చేసిన వంట అమృతప్రాయంగా వుందాయనకి శర్మగారి బంధువులకి మాత్రం రాజు రాక ఆనందాన్నివ్వ లేదు కారణం ఆస్తిపాస్తులన్నీ ఓ అనామకుడికి పోవడం వారు సహించ లేకపోయారు. రకరకాలుగా బోధించారు శర్మగారికి అన్నిటికీ తేలిగ్గా నవ్వేశారు శర్మగారు

అంతరాత్మ ఘోష భరించలేని రాజు అక్కణ్ణించి వెళ్ళిపోవాలని నిర్ణయించుకుని తన చరిత్రంతా రాసి, ఆ కాయితాలతో మెల్లిగా ఆయన గదిలో కెళ్ళాడు అప్పుడే శర్మగారు మేడ మెట్లు ఎక్కుతూ కాలు జారి క్రింద పడిపోయారు ఒక్క అంగలో అక్కడికి పరిగెత్తి ఆయన్ని చేతులతో ఎ తీసికెళ్ళి పడుకోబెట్టాడు రాజు

డాక్టర్లు వచ్చారు కాలు ఫ్రాక్చరయిందని బేండేజీ వేసారు చుట్టుపక్కాలంతా కాకుల్లా వచ్చి వాలారు

మంచంలో వున్న ఆయన్ని వదిలి వెళ్ళడానికి మనసు వప్పని రాజు తన ప్రయాణాన్ని కొన్నాళ్ళు వాయిదా వేశాడు

ఆర్నెల్లు గడిచిపోయాయి అదృష్టవశాత్తూ శర్మగారి కాలు బాగయింది

'ఇంక వెళ్ళి పోవచ్చు" అనుకున్నాడు రాజు సమయం కోసం చూస్తున్నాడు

అయితే శర్మగారు మాత్రం మంచంలో వున్నప్పుడు కన్నబిడ్డ కన్నా ఎక్కువగా చేసినందుకో ఏమో రాజుని మరింత ఆప్యాయంగా చూడసాగాడు

రోజులు గడుస్తున్న కొద్దీ రాజుకి తను చేసింది, ఘోర పాపం అనిపించ సాగింది ప్రతిదానికి ఉలిక్కి పడుతున్నాడు

"రాజు ఆ సాయంత్రం హాల్లో వుయ్యాల బల్ల మీద కూర్చుని పిల్చాడు శర్మగారు. రాజు వచ్చి నిల్చున్నాడు

'రాజూ ! వచ్చిన బంధువులంతా వెళ్ళిపోయార్ల కారణం ఏమిటో తెలుసా?" అన్నాడు శర్మగారు రాజు తెలియదన్నట్లు తల తిప్పాడు

"మరేం లేదు , నిన్ను దత్తత చేసుకుంటానన్నానని!"

'బాబుగారూ!" త్రుళ్ళిపడ్డాడు రాజు

"అవును రాజూ ! నువ్వేనా కొడుకువి, నువ్వేనా తల కొరివి పెట్టాలి. ఇది జరగాలంటే

న్యాయబద్ధంగా నా కుమారుడవనిపించుకోవాలి లేకపోతే నేను పోయిన మరుక్షణం నిన్ను ఇంట్లోంచి తరిమేస్తారు

వద్దు బాబుగారూ వాళ్ళే మీ వారసులు నేను పరాయివాణ్ణి, అనామకుణ్ణి దేవుడు లాంటి మీ కొడుకుగా వుండే అదృష్టం నాకు లేదు" రాజు గొంతు వణికింది

"అది నిర్ణయించవలసిన వాణ్ణి నేను మంచి వంశంలో పుట్టాను మంచి వంశంలోని యువతిని పెళ్ళి చేసుకున్నాను నువ్వు డబ్బుకి పేదవాడివైనా, అన్నింటిలో ఉన్నతుడివే అందుకే నిన్ను నా కుమారుడిగా నిర్ణయించుకున్నాను "

రాజు ఏదో అభ్యంతర పెట్టబోయాడు కాని శర్మగారు పడనీలేదు

అప్పటికప్పుడు ముహూర్తం నిర్ణయించి రాజుని దత్తపుత్రుడిగా స్వీకరించాడు

అంతే! మనసంతా ఓ నరకంలా అయిపోయింది రాజుకి ఎన్నివిధాల చెప్పబోయినా ఆయన వినిపించుకోలేదు

★ ★ ★ ★

రాత్రి పది గంటలు కావస్తుంది. గదంతా కాస్త చీకటిగా వుంది దృఢ నిశ్చయం చేసుకున్న రాజు మెల్లగా శర్మగారి గదిలో కొచ్చాడు

బాబుగారూ! అన్నాడు మెల్లిగా

'ఊఁ!' అన్నాడాయన

"నేను మీరనుకున్నట్టు బ్రాహ్మణ యువకుణ్ణి కాదు హరిజనుడిని! అన్నాడు

అయితే ఆ మాట ఆయన విన్నట్టు లేదు గుండె చేత్తో పట్టుకుని మూలగడం చిరువెలుగులో కనిపించింది రాజుకి

గభాల్న ఆయన దగ్గరికి వెళ్ళాడు శర్మగారి వళ్ళంతా చెమటతో తడిసి ముద్దయిపోయింది బాధతో మెలికలు తిరుగుతున్నాడు ఆయన

అంతే! పది నిమిషాల్లో డాక్టర్ని వెంట పెట్టుకొచ్చాడు రాజు

"హార్ట్ అటాక్" అదోలా కళ్ళు చిట్లించాడు డాక్టర్ ట్రీట్‌మెంట్ ఇస్తూనే

'నేను శర్మగారికి నిజాన్ని చెప్పాలి' ఆయన విధించే శిక్ష అనుభవించాలి! లేకపోతే బతికున్నన్నాళ్ళూ మానసికమైన చిత్రహింస అనుభవించాలి' అని నిర్ణయించుకున్న రాజు నీరసించి పోయాడు.

అయినా త్వరలో నిజం చెప్పాలనే. నిర్ణయించుకున్నాడు. ఆ రాత్రి స్పృహ వచ్చిన శర్మగారు రాజుని దగ్గరికి రమ్మని సైగ చేసాడు.

"ఏమిటి బాబుగారూ?" కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ దగ్గర కెళ్ళాడు.

"నా కర్మకాండలు నువ్వే చేస్తావు కదూ?" నీరసంగా అడిగాడు శర్మగారు.

"అదికాదు బాబుగారూ...."

"ప్లీజ్! రాజూ... ఇదే నా తుది కోరిక."

"మీ తల కొరివి పెట్టి, కర్మకాండలు జరిపించేంతటి ఉన్నతుడు కాదు బాబూ ఈ రాజు" ఆయన కాళ్ళ మీద పడి బావురుమన్నాడు రాజు.

నీ ఔన్నత్యం నాకు తెలుసు రాజూ!' అందుకే నేనీ వరం అడుగుతున్నాను! దయ చేసి కాదనకు! రెండు చేతులూ జాపాడు శర్మగారు ఆయన కళ్ళు కూడా నీరు నిండి మసగ బారాయి

బాబుగారూ ఒక్క అంగలో వచ్చి ఆయన చేతులు కళ్ళ కద్దుకుని వెక్కి వెక్కి ఏడవసాగాడు రాజు

రాజూ ! నా కర్మకాండలు నువ్వే చెయ్యి ఇదే నా ' ఆయన మాటలు పూర్తి కాకుండానే ఆయనలో చలనం ఆగిపోయింది

పసివాడిలా రోదించాడు రాజు

ఛ! తను కిరాతకుడు! దుర్మార్గుడు తనలో మోసం, స్వార్థం వుంది కాబట్టే సరైన సమయానికి నిజాన్ని ఆయనకి చెప్పలేకపోయాను నా పాపానికి నిష్కృతి లేదు" గోడకేసి తల బాదుకున్నాడు

నౌకర్లు అతన్ని వారించి ఓదార్చారు ఈ వార్త అందిరికీ అందించడానికి హడావిడిగా పరిగెత్తారు రాజు తేరుకుని జోడించిన ఆయన చేతుల్లో వున్న కవరుని చూసి త్రుళ్ళిపడ్డాడు అతృతగా దాన్ని తీసాడు. అది ఆయన తనకి రాసిన ఉత్తరం

క్షణం అతని చేతులు వణికాయి మనసుని స్వాధీనంలో వుంచుకుంటూ కవరులోని కాగితాన్ని బైటికి లాగాడు

"రాజూ !

నువ్వు బ్రాహ్మడివి కాదని నువ్వొచ్చిన కొద్ది రోజుల్లోనే గ్రహించాను నా ఆస్తి కాజెయ్యడానికి వచ్చావని వూహించాను. నీకు తగిన శిక్ష విధించాలని కూడా అనుకున్నాను కాని నా అంచనాలన్నీ తారుమారయ్యాయి! నీ మంచితనం అర్థం అయింది

అనుకోకుండా నువ్వు నాకు రాసిన వుత్తరం నాకివ్వకపోయినా, నా కంట పడింది దాన్ని బట్టి నీ స్వభావాన్ని పూర్తిగా అర్థం చేసుకున్నాను కేవలం ఆకలి తీర్చుకోవడానికి మాత్రమే అలా అబద్ధం చెప్పావని తెలుసుకున్నాను నిజానికి అదీ తప్పే! కానీ నీ స్వభావం ఆ తప్పుని తేలిగ్గా క్షమించేలా చేసింది పుట్టిన కులం ఏదైనా తన ప్రవర్తన వల్లనే మానవుడు ఉన్నతుడు అవుతాడు నేను చదివిన వేదాలు ఉపనిషత్తులు వీటినే చెపుతాయని చాలా ఆలస్యంగా గ్రహించాను నా ఆస్తి కోసం నా చుట్టూ తిరిగే నా బంధువులు గుర్తొచ్చారు వారి స్వార్థం ముందు నీ ఔన్నత్యం పోలికకి అందనిది నా దృష్టిలో నువ్వు ఒక నిస్వార్థపరుడివి ఇవ్వన్నీ తెలిసాక నాలో చాలా మార్పొచ్చింది

నా ఆస్తి కోసం నా చుట్టూ చేరిన నా వాళ్ళంతా నా వారు కారు ఉన్నతులూ కారు నువ్వే ఉన్నతుడివి అందుకే నీకు బ్రహ్మోపదేశం చేసాను బ్రాహ్మణుడిని చేసాను అందుకే నా తలకొరివి నువ్వే పెట్టు! నీ తండ్రిగా ఏ లోకాల్లో వున్నా సంతోషిస్తాను! ఆశీర్వదిస్తాను

నేనిదంతా ఆ శ్రీకృష్ణపరమాత్మ సాక్షిగా, మనస్సాక్షిగా రాస్తున్నాను నేను త్వరలో పోతానని నా అంతరాత్మ హెచ్చరిస్తున్నది అందుకే ఈ వుత్తరం!

నా తలకొరివి పెట్టేటప్పుడు ఈ వుత్తరం కూడా చితిలో వేసి బూడిద చేసెయ్యి! ఈ రహస్యం కూడా నాతోనే అంతరించి పోవాలి ఎందుకంటే .. ఈ లోకం ఇంకా మారలేదయ్యా! కులాల మతాల ఇనప గోడల మధ్య అమాయకుల్ని నలిపి నాశనం చేస్తూనే వుంది కొన్నాళ్ళ క్రితం నేనూ ఆ కోవకు చెందినవాణ్నే! కాని నీ మూలంగా నేను మారాను కులం కాదు - గుణం ప్రధానం అని నిర్ణయించుకున్నాను అందుకే నా ఈ చివరి కోరిక తీర్చు!

నీ తండ్రి

శర్మ

'బాబుగారూ!" అంటూ రోదిస్తూ ఆయన శవం మీది పడిపోయాడు రాజు

ఆయన అతని కళ్ళకి విశ్వరూపం దాల్చిన శ్రీకృష్ణపరమాత్మలా కనిపించాడు! □

కలకత్తా ఆంధ్ర అసోసియేషన్‌వారు తమ సంస్థ స్వర్ణోత్సవాల సందర్భంగా ఏర్పాటు చేసిన కార్యక్రమాలలో విజయవాడ ఆర్టిస్ట్ అసోసియేషన్‌వారు ప్రదర్శించిన శ్రీరమణ, నారుమంచి రచన హాస్య కదంబం లో శ్రీ కోట శంకరరావు, శ్రీ విన్నకోట విజయరామ్, శ్రీ వి వి ఎన్ ప్రసాద్‌బాబు, శ్రీమతి వసంతి



# అరుణోదయం

## నందం రామారావు

నాలుగు రోజుల నుంచీ పట్టిన ముసురు ఆ రోజే తగ్గింది తూర్పు తెల్లవారుతుండగానే సూర్యుడు చకచకా ఆకాశ వీధిలోకి వచ్చేశాడు

ఎర్రటి సూర్యకాంతిని చూడగానే రంగడి మనస్సు దూది పింజలా అయిపోయింది పక్క మీద నుంచి లేచి, బయటకొచ్చి, ఆకాశంలోకి చూశాడు ఎక్కడా ఒక్క మబ్బు తునక కూడా లేదు తెల్లని వెండి మబ్బులు పరుగులు తీస్తూ కనిపించాయి ఆ క్షణంలో రంగడి మనసు కూడా మబ్బులేని ఆకాశమైంది

ఈ నాలుగు రోజుల నుంచీ రంగడి మనసంతా, తన రెండెకరాల పొలం మీదే వుంది పంటంతా కోతకు సిద్ధంగా వుంది ఇంకో రెండు, మూడు రోజుల్లో పంట కొయ్యాలనుకుంటూ వుండగానే ముసురు పట్టుకుంది వర్షానికి పంటంతా మునిగిపోతుందేమోనని బెంగపెట్టుకున్నాడు

మరో పదిహేను రోజుల్లో తన చెల్లెలికి పెళ్ళి చేయబోతున్నాడు ఈ పంట అమ్మి, ఆ డబ్బుతో చెల్లెలి పెళ్ళి చెయ్యాలనుకున్నాడు పంట బేరం కూడా కుదిరింది ఆ పంట పోయిందంటే, తను చెల్లెలి పెళ్ళి చెయ్యలేడు! అతి కష్టం మీద కుదిరిన సంబంధం పోతుంది

తండ్రి పోయిన తర్వాత, ఒక్కగా నొక్క చెల్లెలి పెళ్ళి చేయాల్సిన బాధ్యత తనపైపడింది

తండ్రి చనిపోయినప్పుడు తన వయస్సు ఇరవై రెండేళ్ళు ఆయన పోయి నాలుగేళ్ళయింది ఈ నాలుగేళ్ళూ తండ్రి చేసిన అప్పులు తీరుస్తూ, పొలంలో కష్టపడుతూ, కుటుంబాన్ని పస్తులుంచకుండా లాక్కొస్తున్నాడు

తన తల్లీ, చెల్లెలు కూడా పరిస్థితిని గ్రహించి, వున్నంతలో పొదుపు చేస్తూ తనకు సహాయంగా వున్నారు ఇప్పటికి అప్పులన్నీ తీర్చేయగలిగాడు చెల్లెలికి మంచి సంబంధం కూడా చూశాడు.

ఆ పెళ్ళి చేసేసి తనిక వూపిరి పీల్చుకోవచ్చు ఇంకా వర్షం ఎన్నాళ్ళు కురుస్తుందోనని బెంగ పడిపోయాడు కానీ, త్వరగానే తెరిపిచ్చేసింది పర్వాలేదు ఆ దేవుడు కూడా తనని కరుణించాడు ఇంతలో రంగడి ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ అతని తల్లి వచ్చి – ఏరా రంగా! పొలానికెళ్ళవా? ఏమిటలా కూర్చున్నావ్?' అనడిగింది

వెడతానమ్మా ఇవేళే గదా ఎండొచ్చింది పొలం ఎలా వుందో చూసుకుని, ఇవేళ, రేపు పంట కోసి ఇంటికి తెచ్చేస్తాను అన్నాడు రంగడు

మళ్ళా ఇంటి కెందుకు అక్కడే బేరం కుదిర్చి మిల్లుకి తోలెయ్యమని చెప్పు అమ్మాయి పెళ్ళికి వస్తువులు చేయించి, బట్టలు కూడా కొనాలి కదా' అని అంది తల్లి

"అలాగే చెల్లి పెళ్ళి ఘనంగా చెయ్యాలి" అన్నాడు రంగడు

అంతా అమ్మాయి అదృష్టం అంటూ తల్లి పొంగిపోయింది

తలుపు చాటు నుంచి వాళ్ళ సంభాషణ విన్న చెల్లెలు మహానంద పడిపోయింది ఆమె మనస్సులో కాబోయే పెళ్ళి కొడుకు మెదలగా సంతోషంతో పాటు సిగ్గు కూడా కలిగింది మరో పది నిముషాలకు రంగడు పొలానికి బయలుదేరాడు దారిలో తెలిసిన వాళ్ళు కనబడుతుంటే పలుకరిస్తూ వెడుతున్నాడు రంగడు రామాలయం దగ్గరకొచ్చేసరికి గణగణమంటూ స్కూల్ బెల్ వినిపించింది రామాలయం ప్రక్కనే వుంది ఒక చిన్న పాఠశాల

ఆ పల్లెటూరికి అదొక్కటే ఎలిమెంటరీ పాఠశాల ఆ వూరి పిల్లలు అక్కడే చదువుకుంటున్నారు

ఆ పాఠశాలలో చదువు చెప్పడానికి ఈ మధ్యనే ఒక కొత్త పంతులమ్మ వచ్చింది. ఆ పంతులమ్మ పేరు అరుణ సుమారు ఇరవై రెండేళ్ళుంటాయి అరుణ – సన్నగా, తెల్లగా, విరిసిన మల్లె మొగ్గలా వుంటుంది

యవ్వన సహజమైన ఉత్సాహం, ఆశయాలు ఆమెలో ఒక పాలు ఎక్కువనే చెప్పాలి ఈ పల్లెటూరిని చూసిన మరుక్షణమే, ఈ పల్లెకు ఒక్క సదుపాయం కూడా లేదని గ్రహించింది ఎన్నో మార్పులు తీసుకురావాలని నిశ్చయించుకుంది

అక్కడ ప్రజలు ఎక్కువ చదువుకో లేదు ఇక లోకజ్ఞానం అసలే లేదు ముందుగా, వాళ్ళకు చదువు చెప్పాలని, రాత్రులు వయోజన విద్యా కేంద్రాన్ని తెరిచింది అరుణ ఐతే, అరుణ ఆశించినట్టుగా ఒక్కరూ రాలేదు అయినా, ధైర్యాన్ని కోల్పోక, అందర్నీ పేరు పేరునా చదువుకోమని అర్థించి, దాని వలన ఎన్ని లాభాలున్నాయో వివరించి అనేకసార్లు చెప్పింది రంగడి క్కూడా చెప్పింది

'మీ గ్రామం ఎంతో అధ్వాన్న స్థితిలో వుంది దానిని బాగు చెయ్యాలంటే మీలాటి యువకులు ముందు వచ్చి, ఎన్నో సంక్షేమ కార్యక్రమాల్ని చేపట్టాలి ముందుగా మీరు చదువుకుని విజ్ఞానాన్ని సంపాదించాలి" అని చెప్పింది

రంగడికి చిన్నతనం నుంచీ చదువుకోవాలనే ఆసక్తి లేదు అతని బంధువుల్లో కూడా ఎవరూ చదువుకోలేదు అదిగాక, చిన్నప్పటి నుంచీ కూలి పనికి వెళ్ళేవాడు ఇంటి పరిస్థితి కూడా దానికి తోడైంది ఇప్పుడిక ఈ వయసులో చదువుకోవడం కుదిరే పని కాదు పగలల్లా పని చేసి వుండడంతో చీకటి పడగానే నిద్ర ముంచుకొస్తుంది

అయినా, చదువుకోకపోయినందు వల్ల తనకేం నష్టం లేదు తన పొలం తనకుంది దానిని సాగు చేసుకుని బ్రతుకుతాడు అది చాలు ఇప్పుడు చదువుకోవడం అనవసరం అదే మాట అరుణతో చెప్పాడు

దానికి అరుణ నవ్వుతూ – 'చదువుకోవడం కేవలం వుద్యోగాల కోసం కాదు విజ్ఞానానికి దాని వలన ఎన్నో లాభాలున్నాయి అంటూ వివరించబోయింది

రంగడు ఆ వాదాన్ని మధ్యలో నే కొట్టి పారేసి –

"నా దృష్టిలో ఏ లాభమూ లేదండి అని అనేశాడు అరుణ నిరాశ పడి వూరుకుంది

ఈ రోజు బడి గంటలు వినబడగానే రంగడికి ఈ సంఘటనతో పాటు, అరుణ మాటలూ గుర్తొచ్చాయి

తను చదువుకోనని చెప్పినా అరుణ ఏ మాత్రం కోపగించుకోలేదు తను కనిపించినప్పుడల్లా నవ్వుతూ పలకరిస్తుంది ఈ రోజు కూడా అరుణ కనబడుతుందని, బడి ముందు క్షణ కాలం నిలబడ్డాడు రంగడు

అతని నిరీక్షణ వ్యర్థం కాలేదు కొన్ని క్షణాల తర్వాత అరుణ దూరంగా వస్తూ కనిపించింది ఆమెని చూడగానే రంగడి ముఖం వికసించింది ఎదురెళ్ళి –

'ఏమండీ! బావున్నారా? అని పలకరించాడు

మీ దయవల్ల బావున్నాను మీలో మార్పేమైనా వచ్చిందా? అనడిగింది అరుణ

చదువు గురించేనా మీరడిగేది? ఈ పొలం పనులతో చదువుకోవడం ఎలా కుదురుతుందండి? అన్నాడు రంగడు

మనస్సుంటే మార్గ ముందండి అంది అరుణ

'అబ్బే! ఏం లాభం లేదండీ మరో పదిహేను రోజుల్లో మా చెల్లెలు పెళ్ళి జరుగుతుంది పంట అమ్మి ఆ డబ్బుతో పెళ్ళి చెయ్యాలి పెళ్ళంటే మాటలా? అన్నీ నేనే చూసుకోవాలి అన్నాడు

"సరే మీ ఇష్టం అంటూ అరుణ నిట్టూర్చింది

'మా చెల్లెలు పెళ్ళికి మీరు తప్పకుండా రావాలి' అని చెప్పి రంగడు ముందుకు నడిచాడు

వెడుతున్న రంగడి వేపు చూస్తూ నిలబడింది అరుణ – ఈ అందమైన యువకునికి చదువు కూడా వుంటే ? ఎప్పటికైనా ఇతనిలో మార్పు వచ్చి చదువుకుంటే ఎంత బావుండునో కదా?' అనుకుంటూ ముందుకు నడిచింది అరుణ.

★ ★ ★ ★

వారం రోజులకు రంగడు తన పంటని మిల్లుకి

తోలి, డబ్బు సిద్ధం చేసుకున్నాడు. పెళ్ళికి కావలసిన ఏర్పాట్లన్నీ తనే స్వయంగా చూసుకున్నాడు.

పెళ్ళి ముహూర్తం నిర్ణయించుకున్న రోజు రానే వచ్చింది. రంగడు ఇంటిముందు పందిరివేసి దగ్గరుండి అలంకరించాడు. లోపల చెల్లెలిని పెళ్ళికూతురుగా అలంకరిస్తున్నారు.

రంగడికి చాలా ఆనందంగా వుంది. తండ్రి చనిపోయిన రోజున; తన చుట్టూ వున్న అప్పులు, చెల్లెలి పెళ్ళి చేయాల్సిన బాధ్యత ఇవన్నీ తలచుకుని భయపడిపోయాడు. వచ్చే ఆదాయం తక్కువ. వీటి నుంచి ఎలా బయటపడాలా? అని బెంగపెట్టుకున్నాడు. తనకు తానుగానే ధైర్యం తెచ్చుకుని కష్టపడి పనిచేశాడు. తండ్రి చేసిన అప్పులు తీర్చాడు. ఈ రోజుకి చెల్లెలు పెళ్ళికూడా చెయ్యగలుగుతున్నాడు.

"ఏరా రంగా! పెళ్ళి ఏర్పాట్లన్నీ జరిగిపోయాయా?" అంటూ తోటి రైతులు వచ్చారు.

"రండి" అంటూ ఆహ్వానించాడు రంగడు.

"ఎలాగైనా నువ్వు గట్టివాడవురా రంగా" అంటూ పొగిడారు. రంగడు గర్వంగా నవ్వుకున్నాడు.






పెళ్ళివారిది పక్కనున్న పల్లెటూరే అయివుండడంతో మరో గంటకు వాళ్ళు కూడా వచ్చేశారు ఇల్లంతా బంధువులతో, స్నేహితులతో సందడిగా వుంది

తన చేతుల మీదుగా ఈ శుభకార్యం జరుగుతోందని గానీ, ఇటువంటి రోజు ఇంత త్వరగా వస్తుందని గానీ రంగడు అనుకోలేదు పెళ్ళికూతురు అలంకరణలో వున్న చెల్లెలిని చూస్తుంటే రంగడి మనస్సు ఉప్పొంగి పోసాగింది! సరిగ్గా అటువంటి సమయంలోనే ఒక ఘోరం జరిగిపోయింది!

ఆ వూరి పెద్ద భూస్వామి కాంతయ్య మరో నలుగురు మనుషులతో పెళ్ళి పందింట్లోకొచ్చాడు

వారిని చూడగానే రంగడు సంబరంగా ఎదురెళ్ళాడు పెద్ద కామందు కాంతయ్య సాధారణంగా ఎవరింటికీ వెళ్ళడు తను పిలవగానే, తనింటికి వచ్చాడని పొంగిపోతూ వాళ్ళని ఆహ్వానించడానికి ముందు వెళ్ళాడు

ఒరేయ్ రంగా! నేనీ పెళ్ళి సంబరంలో పాల్గొనడానికీ, నీ ఆహ్వానాలు అందుకోవడానికీ రాలేదు నీ తండ్రి నాకివ్వాల్సిన బాకీ గుర్తు చెయ్యడానికొచ్చాను అని అన్నాడు కాంతయ్య

ఆ మాటలు విన్న రంగడు ఆశ్చర్యపోయి—

నా తండ్రి మీకివ్వాల్సిన బాకీ మొత్తం తీర్చేనుగదా! అన్నాడు

ఎక్కడ తీర్చావు? ఎప్పుడు తీర్చావు? ఇందా ఈ ప్రోనోటు చదువు నీకే తెలుస్తుంది?' అంటూ రంగడి ముందుంచాడు ఆ నోటుని

తెల్లటి కాగితం మీద ఏవో అక్షరాలు కనిపిస్తున్నాయి గానీ అవేమిటో తెలుసుకునే జ్ఞానంగానీ, చదివి అర్థం చేసుకొనే తెలివిగానీ రంగడికి లేవు అందుకే, వెర్రిగా చూడసాగాడు అదీగాక, నువ్వింకా నాకు బాకీ వున్నట్టు, ఆ బాకీని ఈ పంటలో తీరుస్తానని నాకు కాగితం రాసిచ్చావు ఇదిగో ఆ కాగితం, నువ్వు ఆరునెలల క్రితం రాసింది అంటూ మరో కాగితం చూపించాడు కాంతయ్య

'లేదు లేదు నేనలా వ్రాయలేదు, బాకీ అంతా తీరిపోయింది అని చెప్పి, అలా వ్రాస్తానని, తెల్ల కాగితం మీద నా చేత వేలిముద్రలు వేయించుకున్నారు కాగితం మీద మీరేం వ్రాశారో చదివే జ్ఞానం లేకపోవడం వల్ల, మీ మీదనమ్మకంతో వేలిముద్రలు వేశాను మీరిలా మోసం చేస్తారనుకోలేదు మీకిది న్యాయంకాదు అంటూ

# వ్యక్తిగతం



చిలీ అధ్యక్షుడు జనరల్ అగస్టో పినోషెట్ ఉగార్టే (70)పై సెప్టెంబరు 7న హత్యా ప్రయత్నం జరిగింది ఆ దాడిలో ఆయన ఎడమ చేతిపై చిన్న గాయంతో ప్రాణాలు దక్కించుకుని బయట పడ్డారు కానీ ఆయన అంగరక్షకులలో అయిదుగురు మరణించారు. మరో పదకొండు మంది గాయపడ్డారు ప్రజలచే ఎన్నుకోబడిన సాల్వడార్ అలెండీ గోస్సెన్స్ అధ్యక్షతన గల సోషలిస్టు ప్రభుత్వాన్ని సైనిక తిరుగు బాటు ద్వారా 1973లో కూలద్రోసి జనరల్ పినోషెట్ అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు ఈ పదమూడేళ్ల నియంతృత్వ పాలనలో చిలీ ప్రజలు వేలాదిగా చంపబడ్డారు ఆయన సైనికులు, పోలీసులు చేస్తున్న అమానుష చర్యలకి అంతం లేకుండా ఉన్నది ప్రజాస్వామ్య బద్ధమైన పరిపాలనకి అవకాశం లేని విధంగా ఆయన 1980లో ఒక రాజ్యాంగాన్ని రూపొందించి విపరీతమైన అధికారాలని చేజిక్కించుకున్నారు ఆయన పాలనలో పట్టణాలలో నివసించే పేద ప్రజలని, మానవ హక్కుల సంరక్షణకి పాటుపడే కార్యకర్తలని, ప్రతిపక్ష సంస్థలకి చెందిన సభ్యులని, నియంతృత్వ ప్రభుత్వ వ్యతిరేకులైన వారి నెందరినో సైనికులు, పోలీసులు నిర్బంధించి, చిత్రహింసలకి గురి చేసి చంపారు ఆయనపై దాడి జరిగిన అనంతరం అత్యవసర పరిస్థితిని విధించి మరింత కర్కశంగా వ్యవహరించటం మొదలు పెట్టారు ఒక పత్రికా రచయితని పోలీసులు రాత్రికి రాత్రే తీసుకు వెళ్లి కాల్చి చంపారు ఒక పాఠశాల ఉపాధ్యాయుడిని, ఒక ఎలక్ట్రీషియన్‌ని, ఒక ఎకౌంటెంట్‌ని సైనికులు నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపారు ఇద్దరు అమెరికన్ మత బోధకులని నిర్బంధించారు, మరో ముగ్గురు ఫ్రెంచి మతాధికారులని దేశం నుంచి బహిష్కరించారు ప్రతి పక్షాలకి చెందిన ఆరు వార్తా పత్రికలని నిషేధించారు రాయిటర్, బ్రిటిష్ వైర్ సర్వీస్, ఎ ఎన్ ఎస్ ఎ వార్తా సంస్థలు ఆ దేశంలోని వార్తలని బయటికి పంపరాదన్న ఆంక్షలు విధించారు కొంతమంది పత్రికారచయితలు, సంపాదకులపై అరెస్టు వారంట్లు ఉన్నందు వల్ల వారు అజ్ఞాతంలోకి వెళ్లి పోయారు. ఆ దేశ ప్రజలంతా ఏ క్షణాన ఎటువంటి ప్రమాదం పోలీసులు, సైనికుల ద్వారా సంభవిస్తుందో నన్న భయాందోళనలతో ఉన్నారు 1976 నుంచి ఇప్పటి వరకూ చిలీలో మానవ హక్కుల ఉల్లంఘన కేసులకి సంబంధించిన 70 వేల ఫైళ్లు ఉన్నాయని ఆ సంస్థ లెక్కలని బట్టి తెలుస్తున్నది ప్రజలలో, సైన్యంలోని ఒక వర్గంలో జనరల్ పినోషెట్ నియంతృత్వ పాలన పట్లగల వైముఖ్యానికి నిదర్శనమే ఆయనపై జరిగిన హత్యా ప్రయత్నంగా ఎంతో మంది భావిస్తున్నారు రాజ్యాంగ పరంగా పినోషెట్ అధ్యక్ష పదవీకాలం 1989 వరకూ ఉన్నది కానీ ఆయన అణచివేత విధానాల పట్ల ప్రజలలో పెల్లుబుకుతున్న అసంతృప్తిని బట్టి చూస్తుంటే వారు అంతకాలం వేచి ఉండగలరా అనిపిస్తున్నది! □

## అరుణోదయం

రంగడు అరిచాడు.

"రంగా! నాకు న్యాయాన్యాయాలు కాదు డబ్బు కావాలి నువ్వు బాకీ పదివేలు ఇస్తే నేను వెళ్లిపోతాను నువ్వు కాదంటే బలవంతంగా తీసుకోవాల్సి వుంటుంది " అన్నాడు కాంతయ్య

రంగడికి మతిపోయింది

చెయ్యని బాకీ చేసినట్టు చూపించి ఈ కాంతయ్య తన పరువు తీస్తున్నాడు రంగడికి దుఃఖం, ఆవేశం ఆగలేదు కానీ, చెయ్యగలిగిందేంలేదు కాంతయ్య కాళ్లమీద పడి ప్రాధేయపడసాగాడు. అక్కడున్న వారంతా రంగడిమీద జాలిపడుతున్నారే తప్ప కాంతయ్యను ఏమీ అనలేకపోతున్నారు

ఇంతలో అరుణ అక్కడికొచ్చి అక్కడి దృశ్యాన్ని చూసి ఆశ్చర్యపోయింది

"ఏం జరిగిందండీ' అని రంగడ్ని అడిగింది

రంగడు దుఃఖిస్తూ జరిగింది చెప్పాడు

అరుణ, కాంతయ్య దగ్గరనుంచి ఆ కాయితాలు తీసుకుని చూసింది అంతా సరిగ్గానే వుంది

"రంగా! ఆయన చెప్పింది నిజమే. మీరిపంటలో ఇవ్వవలసిన బాకీ మొత్తం తాలూకు పదివేలు ఇస్తానని వ్రాసివుంది" అన్నది అరుణ

రంగడు గోలపెట్టాడు

"ఆయన నాతో చెప్పింది ఒకటి రాసింది మరొకటి ఆయన నన్ను మోసం చేశాడు '

"రంగా! ఈ అనర్థానికి కారణం ఏమిటో తెలుసా?" అనడిగింది అరుణ

ఏమిటన్నట్టు చూశాడు

మీకు చదువులేక పోవడం అంది అరుణ

రంగడు గతం గుర్తుకొచ్చి తప్పుచేసినట్టు తలొంచుకున్నాడు

'కాంతయ్యగారూ! ఆ పదివేలూ నేనిస్తాను అంటూ అరుణ తన మెడలోని గొలుసు, చేతిగాజులుతీసి కాంతయ్యకిచ్చింది. రంగడు వారిస్తున్నా వినకుండా

'మీరు చేసిన ఈ పని చాలా గొప్పది అన్నాడు రంగడు

"నా ఋణం ఎలా తీర్చుకోవాలో తర్వాత చెప్తాగానీ ముందు మీరు నా మాట విని చదువుకోవాలి"

నా కళ్లు తెరచుకున్నాయి నేనేకాదు ఇక్కడున్న వాళ్లందరం మీ దగ్గర చదువుకుంటాం అన్నాడు రంగడు

ఈ రోజు నాకెంతో సంతోషంగా వుంది అంది అరుణ మళ్లా అక్కడ ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి

* * * * * *

వున్నంతలో ఆగదిని అందంగానే అమర్చారు పట్టిమంచం మీద తెల్లటి దుప్పటి పరచి మల్లెపూలు జల్లిన తీరు చాలా ఆనందంగావుంది

నడిరేయి ఆ రాత్రిలో ఇద్దరు వ్యక్తులు ఒకరి నొకరు సన్నటి వెలుతురులో చూసుకుంటూ మైమరచి పోతున్నారు

నన్ను పెళ్లి చేసుకోవడానికింత సాహసం చేస్తావని అనుకోలేదు రంగడు అన్నాడు

మిమ్మల్ని చూసిన తొలిసారినుంచే మీరంటే అభిమానం కలిగింది మీ ప్రతిచర్యా గమనించిన తర్వాత మీరంటే ప్రేమ పుట్టుకొచ్చింది' అంది అరుణ

రంగడి కిదంతా ఓ అద్భుతం జరుగుతున్నట్టుగా వుంది తను అరుణను పెళ్లి చేసుకోవడం వూహించని నిజం !

'నువ్వు కోరి చేసుకున్న ఈ రంగడు నీకేం ఇవ్వలేక పోయాడు ఇవ్వకపోగా నీ నగలే సిగ్గులేక రంగడి మాట పూర్తి కాకముందే అరుణ వెంటనే అందుకుని–

ఇవిగో ఆ నగలు అంది నవ్వుతూ మెడలో గొలుసు, చేతుల గాజులూ చూపిస్తూ

రంగడు ఆశ్చర్యంగా అనుమానంగా చూస్తూ–

'ఇవి అన్నాడు

ఇవి గిల్టు నగలుకాదు ఆ రోజు పెళ్లి పందిట్లో ఇచ్చిన నగలే మీరు క్షమిస్తానంటే ఒక్క మాట చెబుతాను మీకు వ్రాయడం, చదవడం పట్ల శ్రద్ధ కలగాలని కాంతయ్యగారిని సహాయం కోరాను ముందుగా ఆయన నాటకమాడడానికి అంగీకరించలేదు నచ్చచెప్పగా చివరకు అంగీకరించారు నా పట్టుదలకు తోడు ఆయన సహాయంతో మీకు వ్రాయడం నేర్పగలుగుతున్నాను అంది అరుణ

"మరి ఆ కాయితాల మీద నా వేలిముద్రలు

"లోగడ మీనాన్నగారు తీసుకున్న 'బాకీ' బాపతు అప్పు తీర్చిన కాయితాలమీద నువ్వు వేలిముద్రలు వేసిన కాయితాలు అవి వాటి నఖలు తమాషాగా తీసి నిన్ను భయపెట్టడానికి ఆడిన నాటకం" అంటూ అరుణ నవ్వి రంగడు ముందుకు జరిగింది

రంగడు ప్రేమగా అరుణ చేతిని తన చేతులోకి తీసుకుని–

'నీ ఋణం తీర్చుకోలేనిది అంటూ ఆమె ముందుకు జరిగాడు

ఋణం తీర్చుకోవాలంటే ముందీ పని చెయ్యాలి! అంటూ రంగడ్ని దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకుని, లైటార్పడానికి లేచింది అరుణ! □

# హైదరాబాద్ నోట్‌బుక్

## పాత్రికేయులకు సత్కారం :-

జంటనగరాల సాంస్కృతిక సంఘాలలో అగ్రగణ్యమైన రసమయి తన 15వ పుట్టిన రోజుపండుగ సెప్టెంబర్ 22వతేదీన జంటనగరాల సాంస్కృతిక వికాసానికి కృషి చేసిన ప్రముఖ పాత్రికేయులకు సత్కారం చేసి సహృదయుల మన్ననలు పొందింది ఈ సత్కారోత్సవం సార్వత్రిక విశ్వవిద్యాలయ వైస్ చాన్సలర్ డాక్టర్ సి నారాయణరెడ్డి అధ్యక్షతన త్యాగరాయ గాన సభలో కన్నులపండువుగా జరిగింది ప్రారంభంలో రసమయి కార్యదర్శి శ్రీ ఎం కె రాములు స్వాగతం చెప్పారు డాక్టర్ జె బాపురెడ్డి సభను ప్రారంభిస్తూ పత్రికా రచయితల బాధ్యతను వివరించి సన్మాన్యులను పరిచయం చేశారు ప్రముఖ సినిమా నటులు డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు సన్మానం చేస్తుండగా శ్రీమతి ఎం కె ఆర్ ఆశాలత సన్మాన్యులను సేవా విశేషాలను వివరిస్తూ వ్యాఖ్యానించారు డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు సన్మాన్యులకు శాలువలిచ్చి సన్మానించగా, ముఖ్య అతిథి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గీతోపదేశం చిత్రఫలకాలను అందజేశారు రిటైర్డ్ పోలీస్ డైరెక్టర్ జనరల్ శ్రీ ఎం వి నారాయణరావు, బెటాలియన్ అధిపతి శ్రీ ఆర్ ప్రభాకరరావు సన్మానితులకు శుభాకాంక్షలు అందజేశారు వారు జంటనగరాల సాంస్కృతిక వికాసానికే గాక యావదాంధ్ర దేశ సాంస్కృతిక వికాసానికి కృషి చేశారని వారు ప్రశంసించారు సన్మానితులు కేవలం పాత్రికేయులే కాదని, పరిశోధకులు, కవులు, విద్వాంసులు, నటులు, సంగీత విద్వాంసులునని డాక్టర్ సి నారాయణరెడ్డి వివరించారు సాంస్కృతిక కార్యకర్త ఒకరు సన్మానితులకు నూతన వస్త్రాలు బహూకరించారు దానిని డాక్టర్ సి. నారాయణరెడ్డి పాత్రికేయ చంద్రులకొక నూలుపోగని చమత్కరించారు శ్రీమతి ఆశాలత వందన సమర్పణతో సత్కార మహోత్సవం సమాప్తమయింది ప్రారంభంలో కేంద్ర ప్రభుత్వ గేయనాటక విభాగం కళాకారులు గురజాడ అప్పారావుగారి పుత్తడిబొమ్మ పూర్ణమ్మ సంగీత రూపకం అత్యద్భుతంగా ప్రదర్శించారు దానిలో వృద్ధవరుని పాత్ర ధరించిన కళాకారుడు ప్రేక్షకుల మన్ననలను చాల పొందారు సన్మానితులైన పాత్రికేయులు ఉచితరీతిని సమాధానమిచ్చి, రసమయికి, దాని నిర్వాహకులకు కృతజ్ఞత తెలిపారు సన్మానితులయిన పాత్రికేయులు వీరు శ్రీయుతులు జి కృష్ణ, పన్యాల రంగనాథరావు, పి ఎస్ ఆర్ ఆంజనేయశాస్త్రి, జి ఎస్ వరదాచార్యులు, గుడిపూడి శ్రీహరి, చాగంటి కపాలేశ్వరరావు (సంగీత విద్వాంసులు, కళా విమర్శకులు, శ్రీ నూకల చినసత్యనారాయణ శిష్యులు), తిరుమల రామచంద్ర రసమయి ఏటా ఆయా రంగాల ప్రముఖులను సన్మానిస్తున్నది ఈ కార్యక్రమం అవిచ్ఛిన్నంగా కొనసాగడంతో పాటు ఈ ఉత్సవం ముఖ్య అతిథి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి సూచించినట్లు ఆయా విషయాలపై గోష్ఠులు, సదస్సులు నిర్వహించాలని కోరుతున్నారు ఈ విదంగా సంస్కృతి వికాసానికి తోడ్పడుతున్న శ్రీ రాములు, శ్రీమతి డాక్టర్ సుధాకిశోర్‌గార్ల దీక్షను, నిర్వహణ దక్షతను ప్రశంసించకుండా వుండలేకపోతున్నాను

## సికిందరాబాద్ స్టేషన్ గణపతి దేవాలయంలో నవరాత్రి :-

గణపతి ఉత్సవాలతో జంటనగరాలు ప్రతిధ్వనించి పోయాయి పెక్కు చోట్ల నవరాత్రోత్సవం సెప్టెంబర్ 8 నుంచి 16 వరకు జరిగింది సికిందరాబాద్ స్టేషన్ వద్ద వున్న గణపతి దేవాలయంలో తొమ్మిది రోజులు ఉపన్యాసాలు, నాట్యాలు, నృత్య నాటికలు జరిగాయి

మొదటి రోజున ఆచార్య చౌడ సుబ్రహ్మణ్య చయనులు శమంతకోపాఖ్యానం గురించి ప్రసంగించారు కుమారి కె శోభారాజు బృందం అన్నమాచార్య భావనా వాహినిని ప్రదర్శించింది. రెండవ రోజు శ్రీ సింగరాచార్య సాహిత్యంలో గణపతి ప్రాముఖ్యంపై ప్రసంగించారు శ్రీమతి మంజుల రామస్వామి, శ్రీ గురురామమూర్తి శిష్యురాండ్రు భరతనాట్యం ప్రదర్శించారు మూడవవారు శ్రీ పి జనార్ధన్ (ఐ పి ఎస్) మతమూ - మానవత అనే విషయమై ప్రసంగించారు. శ్రీమతి మంజుల రామస్వామి, గురురామమూర్తి శిష్య బృందం సీతాకల్యాణం నృత్యరూపకం ప్రదర్శించి ప్రేక్షకుల మెప్పు పొందింది నాల్గవరోజు డాక్టర్ బి ఆర్ శాస్త్రి భక్తి తత్త్వం గురించి , శ్రీ జి శంకరశర్మ ఆరాధన వైశిష్ట్యం గురించి ప్రసంగించారు శ్రీమతి ప్రేమా రామమూర్తి కర్నాటకగాత్ర కచేరీ జరిపారు ఐదవరోజు ఆచార్య డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు గారు సాహిత్యంలో గణపతి గురించి ప్రసంగించారు శ్రీ ముదుపాక బాలసుబ్రహ్మణ్యం భాగవతార్ హరికథ చెప్పారు శ్రీ అష్టకాల నరసింహశర్మ అష్టావధానం చేశారు ఆరవరోజు నారుమంచి లక్ష్మి నరసింహమూర్తి తెలుగు సాహిత్యంలో విఘ్నేశ్వర వర్ణనలు గురించి ప్రసంగించారు అన్నమాచార్య కళాకేంద్రం కూచిపూడి నృత్యం ప్రదర్శించగా, శ్రీ గరిమెళ్ల గోపాలకృష్ణ వీణావాదనం జరిపారు ఏడవరోజున డాక్టర్ దివాకర్ల వెంకటావధాని తిక్కనగా, శ్రీ అయ్యదేవర పురుషోత్తమ రావు మనుమసిద్ధిగా 'హరిహరనాథ సందర్శనం' ప్రత్యేక కార్యక్రమం జరిగింది ఎనిమిదవ రోజున గణపతి తత్త్వాన్ని గురించి శ్రీమతి ఎం పద్మినీదేవి ప్రసంగించారు కుమారి ఎం వెంకటేశ్వరి ఆంధ్ర నాట్యం ప్రదర్శించారు చివరి రోజుగ శ్రీ మానకొండ సత్యనారాయణ సంస్కృతి పరిరక్షణపై ప్రసంగించారు కె శివచంద్ర కూచిపూడి నృత్యం ప్రదర్శించారు పూజా కైంకర్యాదులు పండితశ్రీ బిజుముళ్ల మాధవసూర్యనారాయణ శర్మ సిద్ధాంతి పర్యవేక్షణలో సక్రమంగా జరిగాయి తొలి రోజున రాష్ట్ర దేవాదాయ శాఖామాత్యులు శ్రీ ఎస్ యతిరాజారావు సాంస్కృతిక కార్యక్రమాన్ని ప్రారంభించారు



సికిందరాబాద్ స్టేషన్ గణపతి దేవాలయంలో గణపతి నవరాత్రోత్సవం సందర్భంగా ప్రదర్శించిన సీతా కల్యాణం నృత్య రూపకంలో ఒక దృశ్యం కూర్చున్న వారు సీత (నీరజాసేన్), చెలికత్తెలు ఎడమ నించి వేటూరి చందన, రజిత, అత్రి.

## డాక్టర్ వర్నర్ ఉల్రిష్ :

తూర్పు జర్మనీలోని లిప్‌జిగ్ విశ్వవిద్యాలయంలో పత్రికా రచనాశాఖ ప్రొఫెసర్ డాక్టర్ వర్నర్ ఉల్రిష్ సెప్టెంబర్ 4న హైదరాబాద్ జర్నలిస్టు యూనియన్ సూరవరం ప్రతాపరెడ్డి ఆడిటోరియంలో ప్రసంగిస్తూ, తమ ప్రజలు స్థానిక వార్తల పట్ల ఎక్కువ ఆసక్తి చూపుతారని అన్నారు తమదేశం పత్రికలు స్థానిక వార్తలను మొదటి పుటలో ప్రచురిస్తాయని, ముఖ్యంగా సాంఘిక విషయాలు, ఆర్థిక విషయాలు వుంటాయని అన్నారు మా పత్రికలు ఎక్కువ ఉత్పత్తికి, సాంస్కృతిక జీవితానికి, సినిమాలకు, క్రీడలకు విశేష ప్రాముఖ్యమిస్తాయి పత్రికా రచయితలకు అన్నీ తెలిసి వుండాలి. భాష ప్రజాసామాన్యానికి అర్థమయ్యేదిగా వుండాలి ప్రజల భావాలు రూపొందించడానికి పత్రికలు ముఖ్య సాధనం టీ వి. రేడియోల పోటీలో పత్రికలు పనిచేయగలగాలి -

# హైదరాబాద్ నోట్‌బుక్

అన్నారు. ఆయన కొన్ని ప్రశ్నలకు సమాధానంగా, తమ పత్రికలు ప్రభుత్వ వ్యవస్థను విమర్శించవని, విధానాలను, ఫ్యాక్టరీఅధికారులను విమర్శిస్తాయని అన్నారు. భారతదేశం పత్రికలలో వ్యక్తులను గురించిన రాతలు ఎక్కువగా కనిపిస్తాయన్ని, అది భారతీయ ప్రజా జీవితం కాదని, అభివృద్ధి ప్రణాళికలను గురించి భారతీయ పత్రికలు వ్రాయాలని అన్నారు. భారతదేశం గురించి ఇటీవల రెండు పుస్తకాలు వచ్చాయని అన్నారు.

**ఉపశ్రుతి :-**

మెరిట్ మెరిట్ అని ఇప్పుడు అంటున్నారే. తక్కువ మార్కులు వచ్చిన మీ కుమారుణ్ని డొనేషన్ ఇచ్చి పొరుగు రాష్ట్రంలో చేర్చారే, అప్పుడు మెరిట్ ప్రశ్న ఏమైంది? - అనడిగాను ఒక మోతుబరి పెద్దమనిషిని. మా వాడు కోర్సు ముగించి వచ్చాడుగా - అని చేతులు వయ్యారంగా తిప్పాడు ఆయన.

-తిరుమల రామచంద్ర

# ఉత్తరాలు...

( 4 వ పేజీ తరువాయి)

## వ్యాసాలు

అడవిరాజా "శోభన్‌బాబు" ముఖచిత్రంతో వెలువడిన సంచికలో శ్రీ కాదంబరి వెంకటరత్నంగారు "లండన్‌లో డాక్టర్ గూడాలవారితో ఒక రోజు" తాము ఎలాగ గడిపిందీ ఎంతో ఆసక్తికరంగా వివరించారు. వ్యాసకర్తగారి కుమారుడు చిరంజీవి శ్యామలరావు బాల్యంలో నా శిష్యుడు. శ్రీ జి. కృష్ణమూర్తిగారు అమలాపురం కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పని చేసిన కొద్ది కాలంలో వారి ఉపన్యాసాలు వినే మహద్భాగ్యం నాకు కలిగింది. ఈ రకంగా శ్రీ కృష్ణమూర్తిగారు నాకు గురువులు. పందొమ్మిదవ శతాబ్దంలో ఒక దశాబ్దాన్ని ఎంచుకుని దానిపై వివిధ కోణాల్లో పరిశోధనకు పూనుకొని, ఒక మహా ఉద్యమానికి సారథ్యం వహించిన శ్రీ కృష్ణమూర్తిగారు సర్వదా శ్లాఘనీయులు. ఇంత చక్కని, ఆసక్తికరమైన వ్యాసాన్ని అందించిన వ్యాసకర్త అభినందనీయులు.

–వక్కలంక రామారావు, మానేపల్లి

★ ★ ★

శోభన్‌బాబు ముఖచిత్రంతో వెలువడిన సెప్టెంబరు 19–25 సంచికలో "ఢిల్లీనగరం అందాలు" వ్యాసం చాల బాగుంది. చారిత్రాత్మకమైన ఢిల్లీ నగర అందచందాలను స్వయంగా తిలకించినట్లు అనుభూతి కల్గించే విధంగా (ఫోటోలతో సహా) వ్యాసాన్ని చిత్రీకరించిన వ్యాస రచయితకు అభినందనలు.

– బళ్ళారి మహమ్మద్ సలీమ్, గుత్తి

## సీరియల్స్

సుమారు పదిహేను సంవత్సరాల నుంచి "ఆంధ్రపత్రిక" వీక్లీ చదువుతున్నాం. ఫామిలీ సెంటిమెంట్ వున్న పాజిటివ్ నవల్స్ పత్రికలోనే ప్రచురిత మవడం మా కెంతో ఆనందంగా ఉంది.

మా మహిళా లోకానికి మీరందిస్తున్న నవల్సు గొప్ప రిలీఫ్. ప్రస్తుతం నడుస్తున్న పావని, సంకెళ్ళువరికి, కరిగిన శిల ఒకదానిని మించి ఒకటిగా వున్నాయి. "నిశ్శబ్ద సంగీతం" ఈ వారం చుంచి మలుపు తిరిగి మాలో ఉత్కంఠత రేకెత్తించింది.

– ఎస్. వేణి, బండార్లంక

★ ★ ★

సి విమలాగణేశ్ గారి "పావని" సీరియల్ ప్రథమ, ద్వితీయ భాగాలు మాకెంతగానో నచ్చాయి

– జె కనకయ్య, ధరూర్‌క్యాంపు □



## లాస్య రశ్మి

లాస్య గౌరి బిరుదాంకితురాలు, వర్ధమాన నర్తకి కుమారి రశ్మి విజయ వికాస వేదిక వారి ఆధ్వర్యంలో సెప్టెంబర్ 13వ తేదీన హనుమంతరాయ గ్రంథాలయంలో చక్కటి నృత్య ప్రదర్శన యిచ్చి తన అభినయ కౌశలంతో ప్రేక్షకులను రజింప జేసింది.

శ్రీ భాగవతుల యజ్ఞనారాయణశర్మ, శ్రీ వెంకట రామశర్మల శిష్యురాలైన రశ్మి అవిరామ కృషితో ప్రతిభను సంతరించుకొని ఇంతవరకు 35కు పైగా ప్రదర్శన లిచ్చింది. ఉడిపిలో శ్రీ పెజావర్‌స్వామి ఈమె ప్రదర్శనను తిలకించి ముగ్ధులై లాస్యగౌరి బిరుదుని ఇచ్చి ఆశీర్వదించారు. కార్యక్రమానికి శ్రీ వెంకట్రామశర్మ నట్టువాంగం నిర్వహించగా శ్రీ ఎస్. సి. హెచ్. ఆచార్యులు వయొలిన్, శ్రీ ఎం. రాధాకృష్ణమూర్తి మృదంగం, శ్రీ టి. రవికుమార్ వేణువుతో చక్కగా సహకరించారు.



ఇటీవల మదరాసులో జరిగిన ఒక సభలో ప్రముఖ మిమిక్రీ కళాకారుడు గుంటూరు వాస్తవ్యులు ధ్వని బ్రహ్మ శ్రీ చిట్టూరి గోపీచంద్‌ను సత్కరిస్తున్న మదరాసు ఆంధ్ర కళాస్రవంతి కార్యవర్గ సభ్యులు

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vyayawada-3, Editor S Radhakrishna, Phones - Business 61247, 61248, Editorial. 75667*

# భారతి

సాహిత్యాభిమానులకు ★ చక్కటి అవకాశం!

## చందాదారుగా చేరండి!

## ఆదా చేయండి రు 11 దాకా!

ఏజంటు ద్వారా భారతి సంవత్సరం చందా రు. 48.

పోస్టు ద్వారా అయితే భారతి సంవత్సరం చందా రు. 51.

కాని మీరు రు 40 ముందుగా ఒకేసారి చెల్లిస్తే మీకు ఒక సంవత్సరం పాటు భారతి అందుతుంది!

★ అంటే రు. 11 దాకా ఆదా చేసుకో వచ్చునన్న మాట!

రు. 40 చందా మొత్తాన్ని "ఆంధ్రపత్రిక" (గాంధీనగర్, విజయవాడ)కి మని ఆర్డరు ద్వారాగాని, డిమాండు డ్రాఫ్టు ద్వారాగాని పంప ప్రార్థన. ఏజెంటుకి గాని ఇతరులకి గాని చెల్లించ వద్దని మనవి.

ఈ క్రింది కూపనుని నింపి డిమాండు డ్రాఫ్టుతో గాని, మనీ ఆర్డరుతో గాని జతపరచి పంపాలని మనవి.

★ మీరు ఉన్నచోట ఏజెంటు ఉంటే ఏజెంటు ద్వారా భారతి సరఫరా చెయ్యబడు తుంది.

★ ఏజంటు లేకపోతే భారతి మీకు పోస్టులో అందుతుంది!

★ చందా మొత్తాన్ని ఇతరులకి ఇవ్వరాదు! నేరుగా ఆంధ్రపత్రికకే చెల్లించాలి!




- - - - - - - - - - - - - - - - - - - - ✂ - - - - - - - - - - - - - - - - - - - -

నేను "భారతి" మాస పత్రికకు చందాదారునిగా చేరదలుచు కున్నాను. చందా పైకము రు. 40 డి. డి./ ఎం. ఒ. ద్వారా పంపుతున్నాను.

పేరు : ______________________________

చిరునామా : ______________________________

______________________________

చందాదారుని సంతకం

